# ఉత్తరాలు

## సీరియల్స్

16 10 87 సంచికపై రమ్యకృష్ణ ముఖచిత్రం రసరమ్యంగా ఉంది ఈ తరం యువతి సీరియల్ ప్రారంభంతోనే మా హృదయాలను ఆకట్టుకుంది మంజీరనాదం డి ఎస్ పి విజయ్ సీరియల్స్ ఆసక్తికరంగా కొనసాగుతున్నాయి

మంతెన విజయలక్ష్మి విజయవాడ

* * *

కొత్త సీరియల్ ఈ తరం యువతి చాలా బాగుంది డి ఎస్ ఎ విజయ్ మంజీరనాదం సీరియల్స్ బాగున్నాయి

కొమ్మూరి శ్రీనివాసరావు కొలకలూరు

* * *

ఈ వారం పత్రిక చదివాము ముఖచిత్రం చాలా బాగుంది కొత్త సీరియల్ ఈ తరం యువతి నన్నెంతో ఆకర్షించింది

కె రమణి సుదారాణి పావని గుంటూరు

* * *

16 22వ తేదీ సంచిక ముఖచిత్రం రమ్యకృష్ణ చాలా బాగుంది కొత్త సీరియల్ ఈ తరం యువతి మొదట్లోనే ఆకట్టుకొంది

ఎల్ వి సుబ్బయ్య గూడూరు

## కథలు

రమ్యకృష్ణ ముఖచిత్రం గల పత్రిక ఆకర్షణీయంగా ఉన్నది తోడు కథ ఆలోచింప జేసేదిగా ఉంది విష్ణుమూర్తి పాత్ర దగావర్ష తండ్రులకు ఉదాహరణ రచయిత్రికి అభినందనలు

కె ఎన్ వి రవికుమార్ కె ఎన్ కె శేఖర్ బాబు మైలవరం

## న్యూఢిల్లీ లేఖ

రమ్యకృష్ణ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రపత్రిక వీక్లీలో శ్రీ జయదుబాషి వ్రాసిన న్యూఢిల్లీ లేఖ ఎంప్లీ సూపర్ నేటి రాజకీయాలపై చక్కని సెటైర్లను అందిస్తున్న ఆయన కలం మరెన్నో లేఖల్ని మాకు అందిస్తుందని ఆశిస్తూ

సుహాసిని విజయవాడ

## శీర్షికలు

మన సంస్కారాలు విశేషాలు శీర్షిక ద్వారా మాకు తెలియని ఎన్నో విషయాలు తెలియజేస్తున్నందుకు కృతజ్ఞతలు

ఎ రాము గుంటూరు

* * *

నటి రమ్యకృష్ణ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంచిక ఆద్యంతమూ అలరించింది బృందావన్ గార్డెన్స్ గురించి వ్రాసిన వ్యాసం బాగుంది సువర్ణా కన్నన్ గారి జవాబులు శీర్షికలో రచయిత్రి పాఠకులకు చక్కని సమాధానాలందిస్తున్నారు ఈ కాలం పెళ్లిళ్ళు శీర్షిక యువతుల ఆలోచనలకి ప్రతీక

టి శశిధరకుమార్ తిరువూరు

## అచ్చు పొరపాటు

మంజీరనాదం రచయిత్రి సమాధానాలలో (16 22 అక్టోబర్ 87) రచయిత్రి శ్రీమతి రావినూతల సువర్ణా కన్నన్ గారి ఫోటోకు బదులు డాక్టర్ కొత్త రవీంద్ర బాబుగారి ఫోటో వేశారు ఈ పొరపాటును గమనించ ప్రార్థన

పోలోజు వెంకటాచారి హైదరాబాద్

★ అచ్చు పొరపాటుకి చింతిస్తున్నాము సం

కొత్త శీర్షిక

# న్యాయపీఠం

పాఠకులకి ఆసక్తిదాయకంగా, ఉపయోగకరంగా ఉండే ఈ శీర్షికలో న్యాయ సంబంధమైన ఎన్నో సమస్యలకి సుప్రీమ్ కోర్టు హైకోర్టులు ఇచ్చిన తీర్పులని ఉదహరిస్తూ రచయిత ప్రముఖ న్యాయవాది శ్రీ బలివాడ బాస్కరరావు ఎం ఎ ఎల్ ఎల్ బి రాసిన వ్యాసాలని వారం వారం ప్రచురిస్తాము ఈ కొత్త శీర్షిక పాఠకులందరికీ ముఖ్యంగా న్యాయవాదులు, పోలీసు అధికారులు వ్యాపారస్తులు ఉద్యోగులు మొదలైన వారికి, ఉపయోగకరంగా ఉంటుందని ఆశిస్తున్నాము –సం

పై వారమే ప్రారంభం!


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938 1972)

13 19 నవంబర్ 87

శ్రీ ప్రభవ నామ సం కార్తీక బ అష్టమి

సంపుటము 80 సంచిక 12

ముఖ్య సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక(యాక్టింగ్) సంపాదకుడు
మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు 2 75 |
| పోస్టులో 6నెలల చందా | రు 80 60 |
| పోస్టులో 12నెలల చందా | రు 161 20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం

నటి శోభన

(ఫోటో కె ఆర్ వి భక్త)

# న్యూఢిల్లీ లేఖ

డా. జయ్ దుబాషి



సతీ సహగమనం సంఘటనపై నేనేమీ రాయలేదు. ఎందుచేతనంటే నిజంగా దాని గురించి రాయడానికేమీ లేదు. దేశ రాజధానికి కొన్ని వందల మైళ్ళ దూరంలోని ఒక రాష్ట్ర రాజధానికి వంద మైళ్ళ లోపున గల ఒక చోట ఒక అమాయక స్త్రీ- స్త్రీ కూడా కాదు, ఒక బాలిక- హత్య చేయబడినటువంటి ఈ సంఘటన దారుణమైనది. రెండు వారాల పాటు ఏమీ జరగలేదు. దేశంలో బహుశా అందరికంటే ఎక్కువగా లెక్కలు వేసుకొనే వాళ్ళయినటువంటి రాజకీయవేత్తలు ఇప్పటి వరకూ ఆ సంఘటన నుంచి తాము పొందగల ప్రయోజనాల్ని సాధించడానికి ప్రయత్నించారు. ఒక ప్రకటన విడుదల చేయడానికి రాజీవ్‌గాంధీకి సుమారు నెల రోజులు పట్టింది. ఇతర నాయకులు ఇంతకన్నా భిన్నంగా ఏమీ ప్రవర్తించలేదు. పూర్తిగా ఒక నెల రోజుల పాటు ఒక కుట్ర అనదగిన నిశ్శబ్దం వంటిది నెలకొని ఉంది. ఇందుకు కొంత కారణం ఆ సంఘటనలో ఇమిడి ఉన్న నేర భావన కావచ్చు. మరికొంత కారణం మధ్యయుగాలలోకి పలాయనం చేయిస్తున్నటువంటి ఈ పరిస్థితి పట్ల ఎటువంటి స్పందన చూపాలో ఎవరికీ తెలియక పోవడం కావచ్చు.

ఆ అమ్మాయి స్వచ్ఛందంగా, ఇష్టానుసారం సహగమనం చేసిందా, లేక ఆమె బంధు మిత్రులు ఆమె నందుకు బలవంత పెట్టారా అనేది అంత పెద్ద విషయం కాదు. భర్త మరణంతో ఆమె ప్రాన్పడి ఉండవచ్చు. అది సహజమే. కాని అప్పుడు ఆమెను సహగమనం నుంచి తప్పించవలసిన బాధ్యత బంధువులదీ, ముఖ్యంగా భర్త అన్నదమ్ములదీ అవుతుంది. అవసరమయితే, వాళ్ళు ఆమెను ఒక గదిలో నిర్బంధించి, పోలీసులకు కూడా సమాచారం అందించవచ్చు. దహనం అయిపోయిన తర్వాత రెండు గంటలకు పోలీసులు అక్కడికి వచ్చారని తెలుస్తున్నది- కాని కొందరు పోలీసులు స్వయంగా సహగమనం దగ్గర ఉండడం కూడా జరిగి ఉండవచ్చును. ఏది ఏమైనా వాళ్ళు కూడా ఆ సమాజంలోని సభ్యులే. పోలీసుల్లో ఆ అమ్మాయి బంధువులు కూడాఉండి ఉండవచ్చు.

## కాలదోషం పట్టిన ఆచారాలు

పత్రికలలో వచ్చిన కొన్ని వ్యాసాలు సిగ్గుచేటయినటువంటివి. జరిగిన సంఘటన పూర్తిగా న్యాయ సమ్మత మైనటువంటిదని రుజావు చేయడానికి ఆ వ్యాసాలు హిందూ శాస్త్రాలని ఉటంకించాయి. అది తప్పు. శాస్త్రాలకు దానితో ఏమీ సంబంధం లేదు. మామూలుగా హిందూమతాన్ని విమర్శించే వాళ్ళు ఇటువంటి వికృత చర్యను హిందూమతం ఆమోదిస్తుందనే అభియోగం మోపుతున్నారు. వాళ్ళు కూడా పొరబడుతున్నారు. హిందూమతానికీ, సహగమనానికీ ఏమీ సంబంధం లేదు. దాన్ని వివరించాలంటే, అది మధ్య యుగాలలో మొఘల్ గుంపులు మన స్త్రీజనానికి జీవితం దుర్భరం చేసిన సమయంలో తలెత్తిన ఒక ప్రత్యేక సాంఘిక ఆచారపు అవశేషంగా చెప్పాలి. కాని ఆ గుంపులు వెళ్ళిపోయాయి. మనకు కొత్త ఢిల్లీలో మన స్వంత ప్రభుత్వం ఉన్నది. కనుక, సాంఘిక పరిస్థితులు మారాయి కనుక ఇటువంటి సంఘటనలకు ఇప్పుడు ఏ కారణమూ ఉండడానికి వీలులేదు.

ప్రాచీన సమాజాలలో స్త్రీలు ఎప్పుడూ అల్ప జాతి జీవులుగానే చూడబడ్డారు. ఎనిమిదవ హెన్రీ తనకూ పోప్‌కూ మధ్య సంబంధాలు చెడిపోయినప్పుడు తన భార్యలలో చాలామందిని చంపివేశాడు. ఆఫ్రికాలో, ఒక గిరిజన నాయకుడు మరణిస్తే, ఆయన భార్యలలో కొందరిని ఆయనతో పాటు సజీవంగా ఖననం చేస్తారు. ఇవాళ్టికి కూడా ఒక పెద్ద నాయకుడు చనిపోతే పిల్లలను వధిస్తారని వి. ఎస్. నయిపాల్ వంటి ప్రముఖులు చెప్పారు. ఇవన్నీ భయం చేత పాలించబడే ప్రాచీన సమాజాలు. అక్కడ హేతుబద్ధ వాదనకు తావులేదు. అందువల్లనే హేతువుకు నిలవని మూర్ఖపు చర్యలు జరిగే అవకాశం ఉంది. నాలుగయిదు వందల సంవత్సరాల క్రితం సతీ సహగమనం హేతుబద్ధ చర్య అవునా కాదా అనేది వేరే విషయం. ఇవాళ మాత్రం అది కచ్చితంగా నిర్హేతుకమైన చర్య.

# న్యూఢిల్లీ లేఖ

అంటే సమర్థించడానికి వీలులేని చర్య

మామూలుగా హేతువుకు భిన్నంగా ఉండేటటువంటి ఒక ప్రత్యేక చర్యను సమర్థించడానికి శాస్త్ర గ్రంథాలను గాని ఇతర ప్రాచీన సాహిత్యాన్ని గాని ఉటంకించడం భారతదేశంలో ఒక అలవాటయింది. ఆర్యులకు గోమాంసం తినడం సురాపానం చేయడం అలవాటు అని చెప్పి తద్వారా ప్రస్తుత గోవధను సమర్థించుకో జూడడం ఒక ఉదాహరణ. ఐదు వేల ఏళ్ళ క్రితం వాళ్ళు గోమాంసం ఎందుకు తిన్నారనే దానికి సరైన కారణమే ఉండవచ్చును. కాని సమాజాలు మారుతుంటాయి. దానితో పాటే కొన్ని పనులు చేయడానికి, కొన్ని పనులు చేయకుండా ఉండడానికి , కారణాలు మారుతుంటాయి. ఇజ్రాయెల్‌లో ప్రస్తుతం తాల్ముద్‌లో చెప్పి ఉన్న ప్రకారమే ప్రతిదీ జరగాలనే వారికీ, తక్కువ మూఢంగా, ఎక్కువ ఆధునికంగా ఉండేటటువంటి వారికీ మధ్య ఘర్షణ జరుగుతూ ఉన్నది. హిందువులకు పురాణాలు, ఎటువంటివో, యూదులకు తాల్మోద్ అటువంటిది. ముస్లిం సమాజాలలో కూడా ఇటువంటి ఘర్షణే ఉన్నది ఇరాన్ నాయకుడు అయతుల్లా ఖొమెనీ మిగిలిన అందరితోనూ ఘర్షణ పడుతుండడానికి గల కారణాలలో ఇది ఒకటి ఇటువంటి విషయాల ఎట్ల నా దృక్పథం చాలా సూటయినది ప్రతి సమాజమూ ఏది మంచి ఏది చెడు అనే విషయంలో తన స్వంత ప్రమాణాలను అభివృద్ధి చేసుకోవాలి. ఐదువేల ఏళ్ళ క్రితం ఏమి జరిగింది అనే దాని ఆధారంగా కాక. వర్తమాన కారణాల ఆధారంగా ఇది జరగాలి. మనం ఏదయినా ఒక పని చేయడానికిగాని, నిరాకరించ డానికి గాని ఎవరో ఫలానా వ్యక్తి ఎన్నో సంవత్సరాల క్రితం చెప్పినది కారణం కాగూడదు. ఆ వ్యక్తి ఒక మహర్షి కావచ్చు. లేదా మహాత్మాగాంధీ వంటి మహానాయకుడు కావచ్చు. ఐనా సరే మన నిర్ణయంలో ప్రస్తుత పరిస్థితిని గమనంలోకి తీసుకోవాలి. ఐదు వందల ఏళ్ళ క్రితం సతీ సహగమనం సరైన చర్యే కావచ్చు. కాని ఇప్పుడది సరైన చర్య కాదు. ఎందుకంటే, భార్యంటే కేవలం ఒక భర్తకు చెందిన భోగవస్తువు కాదు. ఆమెకు తన స్వంత జీవన లక్ష్యం మీద. తన స్వంత జీవితం మీద హక్కు ఉంది. ఆమె భర్త చనిపోయినంత మాత్రాననే, ఆమె ఒక వ్యక్తిగా అంతరించి పోతుందని భావించడం మూర్ఖత్వమూ, అమానుషమూ కూడా. మనం ఇరవైయవ శతాబ్దంలో జీవిస్తున్నాం. ఇక్కడ ప్రతి వ్యక్తికీ కొన్ని మానవ హక్కులున్నాయి. వాటిని ఆయా వ్యక్తులు మాత్రమే ఇతరులకు వదలాయించ గలరు కమ్యూనిస్టు సమాజం దాని నిస్సహాయ పౌరులమీద తన నిర్ణయాలను రుద్దుతుంది గనుక మనం దాన్ని వ్యతిరేకిస్తున్నాం శాస్త్రాలలో ఆమోదం వారనే కారణంతో సతి సహగమనం పేరిట ఎట్టపగలు జరిగే హత్యను అనుమతించే సమాజాన్ని కూడా నేను వ్యతిరేకిస్తాను కమ్యూనిస్టులు మార్క్సిజం అనే తమ కొత్త మతం పేరు మీద సామూహిక హత్యల్ని సమర్థించేటప్పుడు వాళ్ళు కూడా ఒక శతాబ్దంన్నర క్రితం రాసిన తమ శాస్త్రాన్నే ఉటంకిస్తున్నారు అది ప్రస్తుత కాలానికి ఎంత మాత్రమూ సంబద్ధమైనది కాదు. అది కూడ మిగిలిన అన్ని ప్రాచీన పుస్తకాల లాంటివే.

ఈ ప్రపంచంలో ఒక మానవ ప్రాణి జీవితాన్ని కొల్లగొట్టడం కన్నా దారుణ చర్య మరేదీ లేదు అందుకే ఈ హక్కును ఏ ఒక్కరికైనా ఇవ్వడానికి నేను పూర్తిగా వ్యతిరేకం. మరణాంతకమైన క్యాన్సర్ వ్యాధితో తీసుకుంటున్న రోగికి, బాధరహిత మరణాన్ని యివ్వదలుచుకున్న డాక్టరుగాని స్టాలిన్, హిట్లర్ తమ వైభవం నడిచిన రోజుల్లో చేసినట్టు అసౌకర్యమైన ప్రత్యర్థులను చంపెయ్యదలుచుకున్న రాజకీయవేత్తకు గాని నేనీ హక్కును ఇవ్వదలుచుకో లేదు. మానవ ప్రాణికి తనదని చెప్పుకోగలిగిన ఏకైక ఆస్తి జీవితమే. అది లేనట్టయితే, అతణ్ణిగాని ఆమెనుగాని మానవ ప్రాణి అనడానికే వీలులేదు ఆ జీవితాన్ని తీసేసే ఆ వ్యక్తి ఒక జంతువు అయిపోయి ప్రతి దానికి ప్రతి ఒక్కరికి లొంగిపోయే స్థితి వస్తుంది అటువంటి మృత్యువు రావడానికి తగిన కారణం ఏదీ కచ్చితంగా లేదు □



# న్యూఢిల్లీ లేఖ

డా. జయ్ దుబాషి



సతీ సహగమనం సంఘటనపై నేనేమీ రాయలేదు ఎందుచేతనంటే నిజంగా దాని గురించి రాయడానికేమీ లేదు దేశ రాజధానికి కొన్ని వందల మైళ్ళ దూరంలోని ఒక రాష్ట్ర రాజధానికి వంద మైళ్ళ లోపున గల ఒక చోట ఒక అమాయక స్త్రీ, స్త్రీ కూడా కాదు ఒక బాలిక హత్య చేయబడినటువంటి ఈ సంఘటన దారుణమైనది రెండు వారాల పాటు ఏమీ జరగలేదు దేశంలో బహుశా అందరికంటే ఎక్కువగా లెక్కలు వేసుకొనే వాళ్ళయినటువంటి రాజకీయవేత్తలు ఇప్పటి వరకూ ఆ సంఘటన నుంచి తాము పొందగల ప్రయోజనాల్ని సాధించడానికి ప్రయత్నించారు ఒక ప్రకటన విడుదల చేయడానికి రాజీవ్‌గాంధీకి సుమారు నెల రోజులు పట్టింది ఇతర నాయకులు ఇంతకన్న భిన్నంగా ఏమి ప్రవర్తించలేదు పూర్తిగా ఒక నెల రోజుల పాటు ఒక కుట్ర అనదగిన నిశ్శబ్దం వంటిది నెలకొని ఉంది ఇందుకు కొంత కారణం ఆ సంఘటనలో ఇమిడి ఉన్న నేర భావన కావచ్చు మరికొంత కారణం మధ్యయుగాలలోకి పలాయనం చేయిస్తున్నటువంటి ఈ పరిస్థితి పట్ల ఎటువంటి స్పందన చూపాలో ఎవరికీ తెలియక పోవడం కావచ్చు

ఆ అమ్మాయి స్వచ్ఛందంగా ఇష్టానుసారం సహగమనం చేసిందా లేక ఆమె ఎందు మిత్రులు ఆమె నందుకు బలవంత పెట్టారా అనేది అంత పెద్ద విషయం కాదు భర్త మరణంతో ఆమె మ్రాన్పడి ఉండవచ్చు అది సహజమే కాని అప్పుడు ఆమెను సహగమనం నుంచి తప్పించవలసిన బాధ్యత బంధువులదీ, ముఖ్యంగా భర్త అన్నదమ్ములదీ అవుతుంది. అవసరమయితే, వాళ్ళు ఆమెను ఒక గదిలో నిర్బంధించి, పోలీసులకు కూడా సమాచారం అందించవచ్చు. దహనం అయిపోయిన తర్వాత రెండు గంటలకు పోలీసులు అక్కడికి వచ్చారని తెలుస్తున్నది- కాని కొందరు పోలీసులు స్వయంగా సహగమనం దగ్గర ఉండడం కూడా జరిగి ఉండవచ్చును. ఏది ఏమైనా వాళ్ళు కూడా ఆ సమాజంలోని సభ్యులే. పోలీసుల్లో ఆ అమ్మాయి బంధువులు కూడా ఉండి ఉండవచ్చు.

## కాలదోషం పట్టిన ఆచారాలు

పత్రికలలో వచ్చిన కొన్ని వ్యాసాలు సిగ్గుచేటయినటువంటివి. జరిగిన సంఘటన పూర్తిగా న్యాయ సమ్మతమైనటువంటిదని రుజువు చేయడానికి ఆ వ్యాసాలు హిందూ శాస్త్రాలని ఉటంకించాయి. అది తప్పు. శాస్త్రాలకు దానితో ఏమీ సంబంధం లేదు. మామూలుగా హిందూమతాన్ని విమర్శించే వాళ్ళు ఇటువంటి వికృత చర్యను హిందూమతం ఆమోదిస్తుందనే అభియోగం మోపుతున్నారు. వాళ్ళు కూడా పొరబడుతున్నారు హిందూమతానికి సహగమనానికి ఏమీ సంబంధం లేదు దాన్ని వివరించాలంటే అది మధ్య యుగాలలో ముస్లిమ్ గుంపులు మన స్త్రీజనానికి జీవితం దుర్భరం చేసిన సమయంలో తలెత్తిన ఒక ప్రత్యేక సాంఘిక ఆచారపు అవశేషంగా చెప్పాలి కాని ఆ గుంపులు వెళ్ళిపోయాయి మనకు కొత్త ఢిల్లీలో మన స్వంత ప్రభుత్వం ఉన్నది కనుక సాంఘిక పరిస్థితులు మారాయి కనుక ఇటువంటి సంఘటనలకు ఇప్పుడు ఏ కారణమూ ఉండడానికి వీలులేదు

ప్రాచీన సమాజాలలో స్త్రీలు ఎప్పుడూ అల్ప జాతి జీవులుగానే చూడబడ్డారు ఎనిమిదవ హెన్రీ తనకూ పోప్‌కూ మధ్య సంబంధాలు చెడిపోయినప్పుడు తన భార్యలలో చాలామందిని చంపివేశాడు ఆఫ్రికాలో ఒక గిరిజన నాయకుడు మరణిస్తే ఆయన భార్యలలో కొందరిని ఆయనతో పాటు సజీవంగా ఖననం చేస్తారు ఇవాళ్టికి కూడా ఒక ఎద్దు నాయకుడు చనిపోతే ఎల్లలను వదిస్తారని వి ఎస్ నయిపాల్ వంటి ప్రముఖులు చెప్పారు ఇవన్నీ భయం చేత పాలించబడే ప్రాచీన సమాజాలు అక్కడ హేతుబద్ధ వాదనకు తావులేదు అందువల్లనే హేతువుకు నిలవని మూర్ఖపు చర్యలు జరిగే అవకాశం ఉంది నాలుగయిదు వందల సంవత్సరాల క్రితం సతీ సహగమనం హేతుబద్ధ చర్య అవునా కాదా అనేది వేరే విషయం ఇవాళ మాత్రం అది కచ్చితంగా నిర్హేతుకమైన చర్య

## న్యూఢిల్లీ లేఖ

అంటే సమర్థించడానికి వీలులేని చర్య

మామూలుగా హేతువుకు భిన్నంగా ఉండేటటువంటి ఒక ప్రత్యేక చర్యను సమర్థించడానికి శాస్త్ర గ్రంథాలను గాని ఇతర ప్రాచీన సాహిత్యాన్ని గాని ఉటంకించడం భారతదేశంలో ఒక అలవాటయింది. ఆర్యులకు గోమాంసం తినడం, సురాపానం చేయడం అలవాటు అని చెప్పి తద్వారా ప్రస్తుత గోవధను సమర్థించుకో జూడడం ఒక ఉదాహరణ. ఐదు వేల ఏళ్ళ క్రితం వాళ్ళు గోమాంసం ఎందుకు తిన్నారనే దానికి సరైన కారణమే ఉండవచ్చును. కాని సమాజాలు మారుతుంటాయి. దానితో పాటే కొన్ని పనులు చేయడానికి కొన్ని పనులు చేయకుండా ఉండడానికి కారణాలు మారుతుంటాయి. ఇజ్రాయెల్‌లో ప్రస్తుతం తాల్ముద్‌లో చెప్పి ఉన్న ప్రకారమే ప్రతిదీ జరగాలనే వారికీ, తక్కువ మూఢంగా ఎక్కువ ఆధునికంగా ఉండేటటువంటి వారికీ మధ్య ఘర్షణ జరుగుతూ ఉన్నది. హిందువులకు పురాణాలు ఎటువంటివో, యూదులకు తాల్మోద్ అటువంటిది. ముస్లిం సమాజాలలో కూడా ఇటువంటి ఘర్షణే ఉన్నది ఇరాన్ నాయకుడు అయతుల్లా ఖొమెనీ మిగిలిన అందరితోనూ ఘర్షణ పడుతుండడానికి గల కారణాలలో ఇది ఒకటి. ఇటువంటి విషయాల ఎట్ల నా దృక్పథం చాలా సూటయినది. ప్రతి సమాజమూ ఏది మంచి ఏది చెడు అనే విషయంలో తన స్వంత ప్రమాణాలను అభివృద్ధి చేసుకోవాలి. ఐదువేల ఏళ్ళ క్రితం ఏమి జరిగింది అనే దాని ఆధారంగా కాక, వర్తమాన కారణాల ఆధారంగా ఇది జరగాలి. మనం ఏదయినా ఒక పని చేయడానికిగాని, నిరాకరించడానికి గాని ఎవరో ఫలానా వ్యక్తి ఎన్నో సంవత్సరాల క్రితం చెప్పినది కారణం కాగూడదు. ఆ వ్యక్తి ఒక మహర్షి కావచ్చు. లేదా మహాత్మాగాంధీ వంటి మహానాయకుడు కావచ్చు. ఐనా సరే మన నిర్ణయంలో ప్రస్తుత పరిస్థితిని గమనంలోకి తీసుకోవాలి. ఐదు వందల ఏళ్ళ క్రితం సతీ సహగమనం సరైన చర్యే కావచ్చు. కాని ఇప్పుడది సరైన చర్య కాదు. ఎందుకంటే, భార్యంటే కేవలం ఒక భర్తకు చెందిన భోగవస్తువు కాదు. ఆమెకు తన స్వంత జీవన లక్ష్యం మీద, తన స్వంత జీవితం మీద హక్కు ఉంది. ఆమె భర్త పనిపోయినంత మాత్రాననే, ఆమె ఒక వ్యక్తిగా అంతరించిపోతుందని భావించడం మూర్ఖత్వమూ, అమానుషమూ కూడా. మనం ఇరవైయవ శతాబ్దంలో జీవిస్తున్నాం. ఇక్కడ ప్రతి వ్యక్తికి కొన్ని మానవ హక్కులున్నాయి. వాటిని ఆయా వ్యక్తులు మాత్రమే ఇతరులకు బదలాయించగలరు. కమ్యూనిస్టు సమాజం దాని నిస్సహాయ పౌరులమీద తన నిర్ణయాలను రుద్దుతుంది. గనుక మనం దాన్ని వ్యతిరేకిస్తున్నాం. శాస్త్రాలలో ఆమోదించారనే కారణంతో సతీ సహగమనం పేరిట పట్టపగలు జరిగే హత్యను అనుమతించే సమాజాన్ని కూడా నేను వ్యతిరేకిస్తాను. కమ్యూనిస్టులు మార్క్సిజం అనే తమ కొత్త మతం పేరు మీద సామూహిక హత్యల్ని సమర్థించేటప్పుడు వాళ్ళు కూడా ఒక శతాబ్దంన్నర క్రితం రచించిన తమ శాస్త్రాన్నే ఉటంకిస్తున్నారు. అది ప్రస్తుత కాలానికి ఎంత మాత్రమూ సంబద్ధమైనది కాదు అది కూడ మిగిలిన అన్ని ప్రాచీన పుస్తకాల లాంటివే

ఈ ప్రపంచంలో ఒక మానవ ప్రాణి జీవితాన్ని కొల్లగొట్టడం కన్నా దారుణ చర్య మరేదీ లేదు అందుకే ఈ హక్కును ఏ ఒక్కరికైనా ఇవ్వడానికి నేను పూర్తిగా వ్యతిరేకం. మరణాంతకమైన క్యాన్సర్ వ్యాధితో తీసుకుంటున్న రోగికి బాధరహిత మరణాన్ని యివ్వదలుచుకున్న డాక్టరుగాని స్టాలిన్, హిట్లర్ తమ వైభవం నడిచిన రోజుల్లో చేసినట్టు అసౌకర్యమైన ప్రత్యర్థులను చంపెయ్యదలచుకున్న రాజకీయవేత్తకు గాని నేనీ హక్కును ఇవ్వదలుచుకో లేదు. మానవ ప్రాణికి తనదని చెప్పుకోగలిగిన ఏకైక ఆస్తి జీవితమే అది లేనట్టయితే, అతణ్ణిగాని ఆమెనుగాని మానవ ప్రాణి అనడానికే వీలులేదు. ఆ జీవితాన్ని తీసేసే ఆ వ్యక్తి ఒక జంతువు అయిపోయి బలి దానికి ప్రతి ఒక్కరికీ లొంగిపోయే స్థితి వస్తుంది అటువంటి మృత్యువు రావడానికి తగిన కారణం ఏదీ కచ్చితంగా లేదు □





# ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం హైదరాబాద్

## B.A/B.Com/BSc కోర్సులు (1988-89) ప్రవేశము కొరకు అర్హత పరీక్ష

**అర్హత నియమాలు :**

ఎవరైతే ఇంటర్మీడియట్ లేదా తత్సమాన పరీక్ష ఉత్తీర్ణులై 1988 జులై 1వతేదీకి 21సంవత్సరాలు నిండి అర్హత టెస్టు ఉత్తీర్ణులైన వారికి నేరుగ బి ఏ బి కాం మరియు బి ఎస్‌సి ఇంగ్లీషు, తెలుగుమీడియం కోర్సులలో ప్రవేశానికి దరఖాస్తులను ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం ఆహ్వానిస్తోంది

**దరఖాస్తుఫారం ఏ విధంగా పొందవచ్చును :**

ఎ) రిజిస్ట్రార్, ఏ ఓ యూనివర్శిటీ, హైదరాబాద్ పేర్న రు 15 లకు డ్రా చేయబడిన క్రాస్‌చేసిన డిమాండ్‌డ్రాఫ్టు లేదా ఇండియన్ పోస్టల్ ఆర్డర్‌ను లిఖితపూర్వకమైన అభ్యర్థన ఉత్తరంతో పాటు జతపరిచి, కంట్రోలర్ ఆఫ్ ఎగ్జామినేషన్స్‌వారి ఆఫీసు 8-3-952/10/2/1 శ్రీనగర్ కాలనీరోడ్, పంజగుట్ట, హైదరాబాద్-500016 వారికి పంపి వారి ఆఫీసునుంచి రిజిస్టర్డు పోస్టుద్వారా దరఖాస్తులు పొందవచ్చు

**బి) స్వయంగా తీసుకొనుటకు** ది రిజిస్ట్రార్ ఓపెన్ యూనివర్శిటీపేర్న రు 5/- (ఐదు రూపాయలు మాత్రం) లకు క్రాస్‌చేసిన డిమాండ్‌డ్రాఫ్టు లేదా ఇండియన్ పోస్టల్ ఆర్డర్‌ను దాఖలుచేసికొని కంట్రోలర్ ఆఫ్ ఎగ్జామినేషన్స్, ఏ ఓ యూనివర్శిటీ, 8 3 952/10/2/1, శ్రీనగర్‌కాలనీరోడ్, పంజగుట్ట, హైదరాబాద్‌వారి ఆఫీసునుండి లేదా ఈ క్రింది స్టడీసెంటర్ల యొక్క కోఆర్డినేటర్లనుండి కూడ స్వయంగా దరఖాస్తుఫారాలు తీసుకోవచ్చును

**జిల్లా స్టడీ సెంటర్లు :** 1) ఆదిలాబాద్ ప్రభుత్వ డిగ్రీకళాశాల, 2) అనంతపూర్ ప్రభుత్వ డిగ్రీకళాశాల 3) కడప ప్రభుత్వడిగ్రీ కళాశాల 4) ఏలూరు శ్రీ ఎ ఆర్ రెడ్డి కళాశాల 5) గుంటూరు జె కె సి కళాశాల 6) కరీంనగర్ ఎస్ ఆర్ ఆర్ ప్రభుత్వ డిగ్రీ కళాశాల 7) ఖమ్మం ఎస్ ఆర్ మరియు బి జి ఎన్ ఆర్ ప్రభుత్వ కళాశాల 8) కర్నూల్ సిల్వర్ జూబ్లి ప్రభుత్వ కళాశాల 9) మహబూబ్‌నగర్ ఎం ఎ ఎస్ ఆర్ట్సు మరియు సైన్సుకళాశాల, 10) నల్గొండ-నాగార్జున ప్రభుత్వ కళాశాల 11) నెల్లూరు-శ్రీ సర్వోదయ కళాశాల, 12) నిజామాబాద్-గిరిరాజ్ ప్రభుత్వ కళాశాల 13) ఒంగోలు-సి ఎస్ ఆర్ శర్మ కళాశాల 14) రాజమండ్రి- ప్రభుత్వ డిగ్రీకళాశాల, 15) సిద్దిపేట ప్రభుత్వ డిగ్రీ కళాశాల, 16) శ్రీకాకుళం- ప్రభుత్వడిగ్రీకళాశాల, 17) తిరుపతి - ఎస్ వి ఆర్ట్సు కళాశాల, 18) విజయవాడ - వి బి సిద్దార్థ కళాశాల, 19) విశాఖపట్నం — డి ఆర్ వి ఎస్ కృష్ణా ప్రభుత్వ కళాశాల, 20) విజయనగరం - మహారాజ కళాశాల, 21) వరంగల్-ఆర్ట్సు మరియు సైన్సుకళాశాల, 22) సిర్పూర్ కాగజ్ నగర్—ప్రభుత్వ జూనియర్ కళాశాల, (కాకతీయ యూనివర్శిటీ క్యాంపస్, సుబేదారి) 23) హిందూపూర్—ఎస్ డి జి ఎస్ కళాశాల 24) పోలవరం-ప్రభుత్వ జూనియర్ కళాశాల, 25) పెద్దపల్లి ప్రభుత్వజూనియర్‌కళాశాల, 26) గోదావరిఖని-ప్రభుత్వ జూనియర్‌కళాశాల, 27) కొత్తగూడెం-కె వై ఆర్ సై మరియు బి ఎన్ గౌడ్—ప్రభుత్వ జూనియర్‌కళాశాల 28) షాద్‌నగర్—ప్రభుత్వ జూనియర్‌కళాశాల, 29) అతేరు-ప్రభుత్వ జూనియర్ కళాశాల, 30) కావలి—జవహర్‌భారతి కళాశాల, 31) బన్సవాడ ప్రభుత్వ జూనియర్ కళాశాల, 32) నర్సాపురం— ఆర్ ఆర్ వి పి ఆర్ ప్రభుత్వ జూనియర్ కళాశాల, 33) కాకినాడ—పి ఆర్ ప్రభుత్వ డిగ్రీకళాశాల 34) సంగారెడ్డి తారా ప్రభుత్వ డిగ్రీకళాశాల, 35) చిత్తూరు-పి వి కె ఎన్ ప్రభుత్వ డిగ్రీ కళాశాల36) కుప్పం—ఎం ఎఫ్ సి ప్రభుత్వ జూనియర్‌కళాశాల 37) సత్యవేడు—ప్రభుత్వ జూనియర్ కళాశాల 38) మచిలీపట్నం—ఆంధ్రజాతీయ కళాశాల, 39) యలమంచిలి-ప్రభుత్వ జూనియర్ కళాశాల 40) ములుగు ప్రభుత్వ జూనియర్ కళాశాల, 41) వికారాబాద్-ఎస్ ఎ పి ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల 42) ఖమ్మం-ప్రభుత్వ డిగ్రీ కళాశాల, 43) మార్కాపూర్-ప్రభుత్వ జూనియర్ కళాశాల

**జంటనగరాలు** 44) ప్రభుత్వ సిటీ కళాశాల, హైదరాబాద్ 45) ప్రగతి మహావిద్యాలయ డిగ్రీకళాశాల, హైదరాబాద్ 46) సర్దార్‌పటేల్ కళాశాల సికిందరాబాద్ 47) రైల్వే డిగ్రీ కళాశాల సికిందరాబాద్, 48) ఎ వి కళాశాల హైదరాబాద్ (దోమలగూడ) (స్త్రీలకు ప్రత్యేకం, 49) డి బి ఎ ఎం డిగ్రీ కళాశాల (కేవి హైస్కూలు ఆవరణలో) 50) ప్రభుత్వ డిగ్రీ కళాశాల ఫర్ ఉమన్, బేగంపేట హైదరాబాద్, (స్త్రీలకు ప్రత్యేకం) 51) ప్రభుత్వ డిగ్రీ కళాశాల హైదరాబాద్ 52) ప్రభుత్వ జూనియర్ కళాశాల హైదరాబాద్, 53) సెంట్రల్ జన్ పెంగూరా హైదరాబాద్ 54) ప్రభుత్వ జూనియర్‌కళాశాల, ఎస్ పి రోడ్, సికిందరాబాద్, 55) ప్రభుత్వ జూనియర్ కళాశాల, నాంపల్లి, హైదరాబాద్ 56) ప్రభుత్వ జూనియర్‌కళాశాల (అలియా) హైదరాబాద్, 57) ప్రభుత్వ జూనియర్ కళాశాల (పాత) మలక్‌పేట హైదరాబాద్

★ దరఖాస్తుఫారాల అమ్మకానికి ఆఖరు తేదీ 24, నవంబరు 1987

★ పూర్తిచేసిన దరఖాస్తులు దాఖలు చేసుకొనుటకు ఆఖరుతేది 1, డిసెంబరు 1987

**దరఖాస్తు చేయు విధానం :** మీరు దరఖాస్తు ఫారాలను సక్రమంగా పూర్తిచేసి, కంట్రోలర్ ఆఫ్ ఎగ్జామినేషన్స్, ఏ పి ఓపెన్ యూనివర్శిటీ, 8 3 952/10/2/1, శ్రీనగర్‌కాలనీ రోడ్, పంజగుట్ట, హైదరాబాద్-500016 వారికి స్వయంగాకాని, లేదా రిజిస్టర్డు పోస్టుద్వారాకాని నిర్ణీతతేదీ అనగా 1, డిసెంబరు 1987 లోగా అందేటట్లు MO చేసుకొనవలెను

**ఎలిజిబిలిటీ టెస్టు తేది, స్థలము** ఆంధ్రప్రదేశ్ ఓపెన్ యూనివర్శిటీ స్టడీ సెంటర్లు అన్నింటిలోనూ 6 మార్చి 1988 (ఆదివారం) నాడు ఇంగ్లీషు, తెలుగు మీడియంలలో టెస్టు నిర్వహించబడుతుంది ఈ స్టడీ సెంటర్లు ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్, సికింద్రాబాద్ జంట నగరాలు, ఇతర అన్ని జిల్లాలలోనూ కలవు బయట రాష్ట్రాలలో కూడా తగినంత సంఖ్యలో అభ్యర్థులు ఉన్నట్లయితే, వారికి అక్కడ టెస్టు నిర్వహించుటకు పరిశీలింపబడుతుంది

**బి.ఏ / బి.కామ్ / బి ఎస్‌సి డిగ్రీ కోర్సులలో నరాసరి ప్రవేశము :** ఆంధ్రప్రదేశ్ బోర్డు ఆఫ్ ఇంటర్మీడియెట్ నిర్వహించిన ఇంటర్మీడియెట్ పరీక్షనుగాని, తత్సమానమైన పరీక్షనుగాని ఉత్తీర్ణులైనవారు డిగ్రీ,కోర్సులలో నరాసరి ప్రవేశానికి అర్హులు వీరు ఎలిజిబిలిటి టెస్టుకు హాజరు కానవసరంలేదు అట్టి అభ్యర్థులకు ఏప్రిల్ / మే 1988 లో ప్రత్యేకంగా ప్రకటన వెలువడగలదు

(సం) రిజిస్ట్రార్

# టీ ఎలూరి



"టక్ టక్ టక్ మంటూ ఒక బల్లమీది నుంచి మరొక బల్ల మీదికి పరుగులు పెడుతోంది శబ్దం బల్లమీద టక్‌మని శబ్దం వినిపించగానే ఫైలులో తలదూర్చి కూర్చున్న ఆ గుమాస్తా తలఎత్తి ఎదురుగా ఉన్న వస్తువును చూసి సంతోషంతో గ్లాసులోని మంచినీళ్ల గటగటా తాగేయడం రోజూ జరిగేపని

అదొక చిన్న సైజు పెద్ద ఆఫీసు మొత్తం ఒక యాభైమంది రకరకాల చిన్న పెద్ద ఉద్యోగులున్నారు వారందరూ వరుసగా క్రమంతో కూర్చుని ఉన్నట్లే ఉంటారు కానీ గుడిలోని నవగ్రహాల్లా ఒకరి ముఖం మరొకరికి కనపడకుండా కూర్చుంటారు

గడియారం సరిగ్గా 3 గంటలు కొట్టింది టక్ టక్ శబ్దం మొదలయింది ఆ శబ్దం ఎగురుకుంటూ సూపరింటెండెంట్ బల్ల మీదకివచ్చి ఆగింది అయితే ఆ శబ్దంతోపాటు ఖ ఖ ఖ అన్న గ్లాసుల శబ్దం ట్యాంగ్ ట్యాంగ్ మన్న ట్రే క్రిందపడేటప్పుడయే శబ్దం అన్నీ ఒక్కసారిగా వినిపించాయి

ఏదో అలౌకికమయిన ధ్యానంతో పని చేసుకుంటున్న ఉద్యోగులందరూ ఒక్కసారిగా తలలు ఎత్తి శబ్దాలు వచ్చిన వేపు చూసారు అందరూ తననే చూస్తున్నట్లు అనిపించి సూపరింటెండెంట్ బాబోయ్ నేనేం చెయ్యలేదు అన్నట్లుగా తల విసురుగా తిప్పేసుకున్నాడు అందరూ మామూలు ధోరణిలోకి వచ్చి అసలు విషయం కనిపెట్టారు

టీ కుర్రాడు ట్రే నిండా టీ నింపిన గ్లాసులు పెట్టుకుని దాని మీద మరో ట్రే మూత పెట్టుకుని అందరి బల్లల మీద టీ గ్లాసులు ప్రతి రోజూ పెట్టుకుంటూ వచ్చేవాడు అలాగే ఆ రోజు కూడా అందరికీ టీ ఇస్తూ సూపరింటెండెంట్ టేబుల్ మీద టీ గ్లాసు పెట్టబోతుండగా ట్రేలోని ఒకగ్లాసు ఒరిగి టీ అంతా ట్రేలో ఒలికిపోయింది

కానీ

అప్పుడే మొదలయింది అసలు కథ

ఆ టీ కుర్రాడు ఓపిగ్గా మిగిలిన టీ గ్లాసులన్నింటినీ భద్రంగా సూపరింటెండెంట్ టేబిల్ మీద వరసగా పేర్చాడు తరవాత పడిపోయిన గ్లాసుని భద్రంగా తీసి ఒలికి పోయిన టీని దానిలోకి వంచాడు గ్లాసులోకి మళ్ళీ కొలత సరిపోయింది

రెప్ప వెయ్యడంకూడా మరిచిపోయి అందరూ వాడు చేస్తున్న పనినే చూస్తున్నారు ఆ గ్లాసుని కూడా వాడు భద్రంగా సూపరింటెండెంట్‌గారి టేబుల్ మీద ఒక వారగాపెట్టాడు

సూపరింటెండెంట్‌కి కొంచెం కోపం వచ్చింది ఆయనకి ప్రతి గ్లాసూ కళ్లజోడు లోంచి రెండుగా కనిపిస్తున్నది

ఏంటయ్యా జలతరంగిణి వాయించే వాడి ముందు నీళ్ల కప్పులు పెట్టినట్టుగా వీటిని నా ముందు పెట్టావ్ తీ తీ అని విసుక్కున్నాడు

జలతరంగిణి కాదు సార్! టీ తరంగిణి అన్నాడు హెడ్ గుమాస్తా సన్నగా

కిసుక్కున నవ్వింది టైపిస్ట్ పక్కకి తిరిగి

మళ్ళీ టక్ టక్ మంటూ శబ్దం చేస్తూ టీ గ్లాసులు అందరి టేబుళ్ల మీదికి ప్రత్యక్షం అవుతున్నాయి

బల్ల మీద పెడుతున్న టీ గ్లాసుల్ని చూసి అందరూ కొండ చిలువను చూసినట్లు గబుక్కున భయపడి మళ్ళీ తెప్పరిల్లి సూపరింటెండెంట్ టేబుల్ మీద మూలగా ఉన్న గ్లాసు చూసి తృప్తిగా గాలి పీల్చి గ్లాసందుకుని టీ త్రాగు తున్నారు ఎంగిలి గ్లాసులూ మంచి గ్లాసులూ సమానంగా పెట్టుకుని వెళ్లే ట్రేలోని టీ ఎవరి కయినా ఇచ్చేస్తాడేమోనని అందరికీ ఒకటే దడ

ఎలాగయితే నేం ఆ గ్లాసు ఎవరికీ ఇవ్వకుండా మిగిలిన గ్లాసులు అందరికీ పంచిపెట్టి ఒకసారి అందరి ముఖాలలోకి చూసి ఓ చిరునవ్వు నవ్వి ఆ గ్లాసుని భద్రంగా ట్రేలో పెట్టుకుని మూత మరింత జాగ్రత్తగాపెట్టుకుని వెళ్ళి పోయాడు

అందరి మనసుల్లోనూ ఆ క్షణంలోనే ఒకే ప్రశ్న ఉదయించింది

ఆ గ్లాసు ఎవరికయినా ఇవ్వడు కదా? అని ఇంతలో మరో ఆలోచన కూడా వచ్చింది ఇలా ఎక్కడయినా జరిగితే అటువంటి గ్లాసు తెచ్చి ఇక్కడ ఇవ్వడు కదా? అని

అంతే

అందరికీ కడుపులో దేవినట్లయింది రేపటి నుండీ టీ త్రాగ కూడదు అనుకున్నారు

పాపం టైపిస్ట్ తట్టుకోలేక ఓక్ అంది

అందరూ కంగారు పడిపోయారు

అబ్బే ఆవిడ ఓక్‌కి కారణం టీ అయి ఉండదు లెండి అన్నాడు క్రొత్తగా చేరిన కుర్ర గుమాస్తా

ఆవిడ ఈ మధ్యే ఆరు నెలల క్రిందట మండు టెండల్లో ఓ 20 వేలు కట్నం తీసుకున్న ఓ మొనగాణ్ణి పెళ్ళి చేసుకుంది లెండి 



# సంపూర్ణమైన పెరుగుదల కోసం రుచికరమైన ఫారెక్స్® మార్గం.

| మీ పాపాయి పొడవు, బరువు తనిఖీ చేసుకోండి* | మగ పిల్లలు | | ఆడ పిల్లలు | |
|---|---|---|---|---|
| | బరువు | పొడవు | బరువు | పొడవు |
| **3** నెలలు | **5.2** కిలోలు | 59.1 సెం.మీ. | **4.9** కిలోలు | 58.4 సెం.మీ. |
| **6** నెలలు | **6.7** కిలోలు | 64.7 సెం.మీ. | **6.1** కిలోలు | 63.7 సెం.మీ. |
| **9** నెలలు | **7.3** కిలోలు | 68.2 సెం.మీ. | **6.9** కిలోలు | 67.0 సెం.మీ. |
| **12** నెలలు | **8.4** కిలోలు | 73.9 సెం.మీ. | **7.8** కిలోలు | 72.5 సెం.మీ. |

*ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిసెర్చి ద్వారా విడుదల చేయబడినది.

ఇవి భారతీయపిల్లల కోసం సగటు బరువు, పొడవులు మాత్రమే. వీటితో సరిపోలకపోయినా, మీ పాపాయి పెరుగుదల మీ డాక్టరుకు సంతృప్తికరంగా వుంటే ఆందోళనపడే అవసరం లేదు.

**పిల్లల పెంపకం సంబంధంగా తీసుకోవలసిన శ్రద్ధను గూర్చి తెలిపే చిన్న రంగుల పుస్తకపు ఉచిత ప్రతి కోసం వీరికి వ్రాయండి:**

**గ్లిండియా లిమిటెడ్, (FPD/57),**
**డా. అనీ బెసెంట్ రోడ్,**
**వర్లీ, బొంబాయి-400 025.**




సంపూర్ణమైన వికాసం
మరియు పెరుగుదల కోసం
మీ పాపాయికి ఇవ్వండి

# ఫారెక్స్®

పెరుగుదల కోసం
రుచికరమైన విధానం

26/244 TEL



సీరియల్

# ఈతరం యువతి

## వడ్లమన్నాటి కుటుంబరావు

(గత సంచిక తరువాయి)

ఎప్పటిలాగానే చింపాంజీ పోజులో కూర్చున్నాడు అవతారం అప్పుడే బజారు నుంచి వచ్చి కూరలు గట్రా తెచ్చి

తాయారు కూరలు తరుగుతోంది ఇంతకు ఓ పావు గంట ముందు అవతారం బయటి కెళ్ళినప్పుడు ఓ స్టాఫ్ మెంబరు లోనికొచ్చి ఏదో పాడు పని చేసి వెళ్ళిన తాలూకు వేడి వేడి అనుభూతిని నెమరు వేసుకుంటూ

నా భార్య మహా పతివ్రత కాబట్టే ఎప్పుడూ బయటికే రాదనుకుంటూ గర్వంగా నవ్వుకుంటూ ఎవరొస్తారో తమ కార్యాలయం పని నిర్వహణ కార్యక్రమానికి అనుకుంటూ కూర్చున్నాడు– అవతారం

నేను ఆర్ ఎ ఓ అదినేతను అనుకున్నాడు సగర్వంగా

నమస్కారం బాస్

నమస్తే నమస్తే న మ స్తే!

వచ్చిన వాడు వీర సుత్తి రత్తయ్య పటమట ఏరియా ఇన్‌ఛార్జి!

పాపం అతని అసలు పేరు రత్తయ్యే కానీ కనుఎంచిన శ్రోతకు వీర సుత్తి వేసి అతని నెత్తి సుత్తి కేసి బాదుకునేట్టు చేస్తాడని ప్రతీతి

తాగుడు లేకపోయినా అమూల్యమయిన వాగుడుకాడయిన, అతని ప్రతిభకు మెచ్చి శ్రోతలంతా కలిసి అతనికి మేతపెట్టి మోత లేకుండా ఇచ్చిన బిరుదు అది

ఏం వీరసుత్తి రత్తయ్యా? బాగుందా మీ అత్తయ్య? అనేసి రక్కున నాలుక కరుచుకున్నాడు అవతారం

ఓర్నీ ఎట్టతల సుత్తితో కొట్టా! మా అత్తయ్య గురించి అడుగుతున్నాడేమిటి? కొంపదీసి అది అలాంటి బాపతని వీడికి కూడా తెలిసి పోయిందా ఏమిటనుకుని పైకి మాత్రం–

అదేంటి సార్ మా అత్తయ్య గురించి అడుగుతున్నారు? అన్నాడు అమాయకంగా

మూర్ఖుడా! నీకు మనుషుల విలువలే తెలియనప్పుడు ఆ వలువలు ఎందుకురా? వులవల ద లిలో విసరెయ్!

ఏమిటి బాస్ ఈ రోజు మీరు అచ్చం పాములోర్ల బాషలో మాట్లాడుతున్నారు నాకేమి అర్థం కావటం లేదు

పామరుడా వినుకోరా?

నేను పామర్రోడిని కాదండీ బాబు బెజవాడలో పుట్టాను బెజవాడలో పెరిగాను బెజవాడలో చచ్చాను

ఓరీ మూర్ఖా! ఆ శుభ ఘడియ ఇంకా రాలేదురా చచ్చాను అనరాదురా! ఉండి చచ్చాను అను సందర్భం దర్భలు లేకుండా సరిపోతుంది!

ఏమిటో సారూ మీకు పైత్యం ఎక్కిందా ఏమిటి? కవిత్వం చెపుతున్నారు

కాదురా! పామరుడా అంటే జ్ఞానం లేనోడా అని అర్థం

జ్ఞానం అంటే?

నాకు తెలిసేడుస్తే గదా నీకు చెప్పటానికి సరే మీ అత్తయ్య ఎవరు?

మా ఆవిడ తల్లి!

అంటే ఆడదేగా?

కాదంటా రేటండీ?

కాదురా! ఆడదంటే ఆది శక్తి

అట్టాగండీ!

అవును ఆదిశక్తి అంటే జగన్మాత

ఆయ్ బాబోయ్!

ఇప్పు డర్థ మయిందటరా మీ అత్తయ్య బాగుందా అంటే జగన్మాతకి నమస్కారం చెప్పినట్టు అర్థం

ఆయ్

చేసిన తప్పును మాటలతో సర్ది చెప్పుకోటానికి తలప్రాణం తోక కొచ్చింది అవతారానికి

అయితే వీరసుత్తి రత్తయ్యా!

అడగండి బాబూ!

నువ్వేమెత్తుకొచ్చావు?

నేనేమన్నా దొంగోణ్ణంటండీ ఎత్తుకు రావటానికి?

అది కాదయ్యా సమాచారం ఏం తెచ్చావూ అని

అలా అడగండి చెపుతాను

పప్పులో ఉప్పేసినట్టు చెప్పు

చెప్పింది నేను కాదండి విన్నది మాత్రమే నేనండి

చెప్పింది ఎవరు

తంపులమారి తాయారమ్మండి

చట్! నా భార్యని గురించి అన్నావంటే పట్‌మని పళ్ళు రాలగొడతాను

మీ భార్యగారు కాదండి

జరిగిన కథ – 4 ...దమ వాచనం కూతురు ...ముల అంచగత్తె అయినా ...లంచంవాలన్నీ తిరిగిపోతుంటాయి ...ముల ...టర్ ఆక్సిడెంట్‌కు గురయి ...క యువకుడికి దెబ్బలు తగులుతాయి ఆ యువకుణ్ణి చికిత్స కోసం తమ ఇంటికే తీసుకు వెళ్తారు వారం రోజులు కదలకుండా ఉండాలని డాక్టర్ చెప్తాడు ఆయువకుడు ఎథిక్స్ లెక్చరర్ రవికాంత్ అని తెలుస్తుంది ...ములకు ఆతతనం లేదని అపహానిస్తూ ఆక్రోశాపున్న లేఖ వస్తుంది

జాయారు అంటున్నావుగా మరి

మీ బార్యగారు తంపులమారి తాయారు కాదు కదండీ వంపు సొంపుల తాయారు గానీ

తప్పు గురువుగారి బార్యనలా వర్ణించకూడదు

ఒప్పుకున్నానండి

జాయింటు లేకుండా పాయింటుకిరా చెప్పింది తంపులమారి తాయారమ్మ సరే! విన్నది ఎవరు?

కొంపలుకూల్చే కొండమ్మ

ఆమె ఏం చెప్పింది? ఈమె ఎం విన్నది

ఆమె ఎం చెప్పిందో ఈమె అదే విన్నదండీ ఈమె ఎం విన్నదో ఆమె అదే చెప్పిందండీ

ఓయ్ ఓయ్ వీరసుత్తి పగులుతుంది నీ నెత్తి

వద్దండి బాబు అసలే మెత్తంది నా నెత్తి

రా పాయింటుకి రా

చంపేత్తన్నారండి బాబు వత్తన్నానండి

కానీ కానీ

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

ఒసేయ్ కొంపలు తీసే కొండమ్మా

ఎంటే తంపులమారి తాయారమ్మా

ఇది విన్నావంటే ?

ఏందా ఇది ఎల్లాలులేని పాపాయమ్మ పెళ్లాం ఎల్లాలున్న పాపారావుతో లేచిపోవటమా?

అదికాదే

మరేంది మొగుడు ఆపీసుకు వెళ్ళగానే మార్నింగ్‌షోల కెళ్ళే పెళ్ళాం కళ్యాణి సంగతా?

అదికాదే

ఎంటే మరి? అర కిలో వెన్న కాచిన ఘుమ ఘుమలాడే నెయ్యి బదులు తీసుకెళ్ళి చెయ్యి జిడ్డు కారేలా అన్నంలో కలుపుకొని తిని తీరా తీర్చాల్సి వచ్చేసరికి ముఠిగిపోయిన కంపేశ్వరరావు కొట్లో కొన్న నెయ్యి తెచ్చిచ్చే నేతి చుప్పనాతేశ్వరి సంగతా?

అదికాదే

ఎంటో చెప్పవుగద ఇంట్లో అద్దెకున్న వాళ్ళ వస్తువుల్ని చూపిస్తాం అంటూ తీసుకెళ్ళి తన బాబుగాడి సొమ్ములా సొంతం చేసుకునే ఇంగితంలేని



సంగినాధరావు విషయమా?"

అదికాదే..."

ఏమేవ్ తమాషగుందేమిటి ? పక్క పోర్షనువాడి పెళ్ళాం స్నానం చేస్తుంటే కంతల్లోంచి చూసే ముంతముహం మోహనరావు సంగతా?

అదికాదే

మరేమిటే తను కాటికి కాళ్ళు చాచుకుని కూర్చున్నా వయసులో ఉన్న అమ్మాయిని చేసుకుని గడ్డివాము దగ్గిర కుక్కలా ఉంటే కక్కుర్తి కుక్కుటేశ్వరరావు సంగతా?

అదికాదే

ఏందేంది ఆటగుంది నీ సంగతి? చండశాసనుడిలా మండిపడుతున్న ఆఫీసర్ని కాకాపట్టలేక ఆయన పెళ్ళాన్ని కాకాపట్టి ముదుపులు గడపమీద పెట్టి ఆ ఆఫీసరు నోటితోనే నువ్వు బ్రహ్మాండమైన ఎగ్జిక్యూటివయ్యా అనిపించుకునే దాసోహంరావు సంగతా?

ఒసేయ్ కొండమ్మా! నీ వసలు జాలి గుండెలేనిదానవే

అదేందేవ్

లేకపోతే ఎమిటే కొల్లేటి చాంతాటిలాగ అలా కొనసాగిస్తానంటే ఎలాగే ఇలాంటి సంగతులు ఈ సమాజంలో వందయి వేలు ఉన్నయ్ గాక అసలు విషయానికివద్దాం

సరేనే

మనింటికి దగ్గర్లో ఓ ఎచ్చోడున్నాడుచూడు

ఇదుగో తంపులూ పుచ్చు వంకాయలు కొనుట్టుగా ఎచ్చోడి సంగతి ఎందుకే

ఎచ్చోడంటే ఎచ్చోడు కాదులే శాయిబాబా ఎచ్చోడు

ఆయనా రాఘవయ్యా?

అవునే కొంపలూ ఆయనకి పిల్లలెందరో తెలుసా?

ఒక అబ్బాయి ఇద్దరమ్మాయిలు

అబ్బాయి బ్రహ్మాండంగా ఉంటాడు ఆ రీవి ఆ నడక ఆ పొందిక

ఎందేవ్ తంపులూ లొట్టలేస్తున్నావ్ ఆ కుర్రాడినో పట్టు పడతావా?

ఒసేయ్ కొంపలూ పతివ్రతవు కబుర్లు చెప్పకు మరిదీ బావా మావా అనే పట్టింపులు లేనిదానివి

ఎయ్ తంపులూ మన గుట్టు ఎప్పుడో రట్టయిపోయింది గానీ అసలు




సంగతేమిటో కొసరి అడిగించుకోకుండా చెప్పు

ఆ అబ్బాయి అందంగా ఉంటాడు కాలేజి మాస్టారు (లెక్చరర్ కొచ్చిన తిప్పలు కాబోలు) చేస్తున్నాడు మంచి జీతం సంపాయిస్తున్నాడు అయినా ఇన్నేళ్ళనుంచి ఒక్క సంబంధం కూడా రాలేదతనికి

ఎంది తంపులూ నువ్వు చెప్పేది చాలా విచిత్రంగా ఉంది ఒక్క సంబంధం కూడా రాలేదా? మొలతాడులేని మొగవాడ్ని కూడా వేలకు వేలు కట్నాలిచ్చి తమ కూతుళ్ళకు వేలంపాట పాడేసుకుంటున్న ఆడపిల్లల తల్లిదండ్రులున్న ఈ దేశంలో ఇన్ని మంచి లక్షణాలున్న బంగారంలాంటి అబ్బాయికి సంబంధాలే రావటంలేదా? ఒసేయ్ తంపులూ నీ మహిమ ఎమన్నా చూపించావేమిటే పెళ్ళి కూతుళ్ళ తండ్రుల దగ్గర

రామ రామ నేనేపాపం ఎరగనే

మరి కారణం ఎమిటి?

దుష్ప్రచారాల దుంపతెగ్గొట్టి చెప్పింది

అదెవత్తె మన సవితా?

కాదులే మనకి తోడుగా ఉండే తోడికోడలు

ఏమని చెప్పింది

ఇలా దగ్గరకురా ఎక్కడా అనవుగదా

ఎక్కడికక్కడ ఒక్కటే ఓకన్నా ఎక్కువగా అనసులే చెప్పు

ఈ ముల్లోడు విశాఖపట్నంలో చదువు వెలగబెట్టాడంట

అయితే

అప్పుడు చదువుతోపాటు పాటు

తొరగా చెప్పేడువ

చిలకల్ని కూడా పెంపు పెట్టేవాడంట

సరే దాంట్లో ఎముంది వింత

వింతకాదే నీ ముఖం సంత కెళ్ళ విను

చెప్పు

చిలకలన్న తరవాత అన్నీ మంచివే ఉండవుగంద! మంచివుంటయ్ చెడ్డవుంటయ్ అవునా ?

అవును

దాంతో కుర్రాడి ఒళ్ళు కుళ్ళిపోయిందట రోగాల్తో

నిజమా

అబద్ధమయితే నీ కెందుకు చెపుతానే పిచ్చిమొహమా

అప్పుడేమయిందంట?

రాఘవయ్యగారు విశాఖపట్నం పరుగెత్తి కెళ్ళారంట!

వెళ్ళి

లబో దిబో మంటూ ఆస్పత్రిలో జేర్పించారంట

అప్పుడేమయిందంట?

రోగాలు బాగా ముదిరిపోయినయ్యంట

ఎం చేశారప్పుడు?

ఎం లాభం లేదు అది తీసెయ్యకపోతే పుటుక్కున చస్తాడు మా అబ్బాయ్ అంటూ కత్తులు పెట్టి దాన్ని చటుక్కున కోశారంట

ఆరె!

ఎంత రహస్యంగా దాచినా ఈ విషయం నలుగురు నోళ్ళలో పడిందట

అప్పుడు

నీ గుండెల చప్పుడు ఆగినప్పుడు

ఇదేందే తంపులూ

లేకపోతే ఏమిటే కొంపలూ

సరిగ్గాచెప్పు చావు

సరిగ్గావిని చావు

# ఈతరం యువతి

"ఊ"

నా పేరు తంపుల తాయారమ్మ నీ పేరు కొంపలుకూల్చే కొండమ్మ గనక ఈ విషయానికి మనం చిలవలు పలవలు జోడించి బ్రహ్మాండమైన ప్రచారం ఇవ్వాలి అమ్మలక్కల దగ్గర తెలిసిన వాళ్ళ దగ్గర

ఎందుకు?

నీ బొందకి మన కళ్ళు చల్లగా ఉండేందుకు

అట్టాగే లేవే తంపులూ

* * * * * * * *

అయ్యా అవతారంగారూ విన్నారా మగతనంలేని లెక్చరర్ రామయ్య కొడుకు రవికాంత్ సంగతి

ఇదిగో వీర సుత్తి రత్తయ్యా ఈ నిందని నేను నమ్మటం లేదయ్యా

ఎందుకని?

ఇదెవరో గిట్టనివాళ్ళు కల్పించిన కట్టుకథ

అయితే తంపులు కొంపలు చెప్పింది విన్నది అంతా అబద్ధమేనంటారా?

ఆహా!

అయ్యా అవతారంగారూ! మీరు ఆర్ ఎ ఓ కార్యాలయం మూసేస్తే మంచిది

ఇదేం సలహానయ్యా వీర సుత్తి రత్తయ్యా

మేం ఎప్పుడు ఏది చెప్పినా ఈ నింద నమ్మనంటూనే రేపొచ్చి డబ్బు తీసుకెళ్ళు అంటుంటారు మీ అవతారమేమిటో నాకు అర్థం కావటం లేదు"

సర్లే! వెళ్ళిరా రేపు కనుపించు నేను నిందా నివారణా కార్యాలయం అధిపతినయ్యా

వస్తానండి అంటూ వెళ్ళిపోయాడు వీర సుత్తి రత్తయ్యా

తలుపు గడియవేసి ఈల వేసుకుంటూ లోపలికి వచ్చాడు అవతారం

ఏం తాయారు తయారేనా? అన్నాడు

దేనికి? అంది ఆశ్చర్యంగా

దానికి? అన్నాడు అవతారం

అయ్యో సంబరండం అనుకుని వంట కానీండి వస్తాను అంది.

హి అంటూ మీసం మెలేసిన అవతారం చింపాంజీలా పడక కుర్చీలో కూలబడ్డాడు

ఏవండీ అంది

ఏమిటి తాయారూ? అన్నాడు అవతారం

మీరు చేసే పని ఇతరులమీద వచ్చే నిందలు నిజం కావని రుజువు చెయ్యటమేనా?

అవును

మరి పేరంటాలకి పొరుగు ఇళ్ళవాళ్ళకి వెడితే నన్ను గౌరవంగా చూడరెందుకని?

ఏమంటున్నారేమిటి?

నన్నో పురుగున్ను చూసినట్టు చూస్తున్నారు సూటీ పోటీ మాటలంటున్నారు

ఏమని?

మీ ఆయన బలే ప్రజాసేవ చేస్తున్నాడమ్మా

అలాంటి మొగుడు దొరకటం నీ అదృష్టం

ఎన్ని పూజలు చేసుకుపుట్టావో ఆయనకి భార్య కావటానికి

ఇంతేనా ఇంకేవాన్నా అంటున్నారా?

ఎందుకనరండీ వాళ్ళలా అనేది

మంచి పని చేసే వాళ్ళని ఈ సంఘం ఎప్పుడు మెచ్చుకుంది తాయారూ? నువ్వేం దిగులు పడకు"

మీరేం పని చెయ్యటం లేదుగదా మరి మీకు కొంతమంది డబ్బెందుకిస్తున్నారు

ఓసి ఎర్రి మొహమా! నిందలు మోసేవాళ్ళు మన పుణ్యమా అని వాటి నుండి విముక్తులవుతున్నారుగదా అందుకని ప్రతిఫలంగా కొంత డబ్బిస్తారు కూరలక్కడ పడేసిరా నిన్ను కొరుక్కుతింటాను

అంతలో వీధి తలుపులమీద దన్ దన్మని చప్పుడు వినిపించింది కంగారుగా పరుగెత్తాడు అవతారం

తలుపులు తీసి అక్కడ నిలబడ్డ వ్యక్తిని చూసి నిర్ఘాంతపోయాడు అవతారం

నువ్వెందుకొచ్చావ్? కబురుచేస్తే నేనే వచ్చేవాణ్ణి కదా అన్నాడు కంగారుగా

అదేమో నాకు తెల్దు కరుకుగా అన్నాడా వచ్చిన వ్యక్తి అయ్యగారు నిన్ను ఉన్నపళాన తీసుకు రమ్మన్నాడు రా! మోటారు సైకిలెక్కు"

ఇప్పుడు కాదు తరవాత వస్తాను ముందు నువ్వెళ్ళు అన్నాడు అవతారం సందేహిస్తూ




ఏందిబే తల తిరుగుతోందా? వస్తావా మోటారు సైకిలు చక్రానికి కట్టి ఈడ్చుకెళ్ళమంటావా?

నే నెవరనుకుంటున్నావ్ ఆర్ ఎ ఓ అధినేతను కొంచెం మర్యాదగా మాట్లాడు

హె అంటూ తలెగరేశాడు వాడు ఎక్కు అన్నాడు

ఆగవయ్యా కనీసం చొక్కా లాగు అన్నా తొడుక్కురానీయవా? అన్నాడు

తొరగా కానీయహె అన్నాడు వాడు మొరటుగా

ఎవరండీ వాడు? అంది తాయారు లోపలికొచ్చిన అవతారంతో

నాకు ప్రాణ స్నేహితుడులే ఓ గంటలో వస్తాను జాగ్రత్తగా ఉండు అంటూ బట్ట లేసుకుని ఆ వచ్చిన వ్యక్తి మోటారు సైకి లెక్కి వెళ్ళిపోయాడు అవతారం ఓ అయిదు నిముషాల్లో జమ్మి చెట్టు దగ్గరున్న ఓ స్టాపు మెంబరు తాయారు దగ్గరకు వచ్చాడు లోపలికి తగలడు ఎవరన్నా చూస్తారు అంది నవ్వుతూ

* * * * * * * *

మృదుల వాళ్ళ ఇంట్లో రవికాంత్ బాగా రికవర్ అయ్యాడు దాదాపు అన్నీ తానే అయ్యి బాగా కనిపెట్టుకునుంది మృదుల రేపు ఇంటికి వెళ్ళిపోవచ్చు అని

# ఈతరం యువతి

చెప్పాడు డాక్టర్

మంచం మీద పడుకున్న రవికాంత్ ఇంటివేపు పరికించి చూశాడు

అంత చవంతి కూడా నిశ్శబ్దంగా ఉంది నర్స్ దూరంగా కూర్చొని ఏదో వారపత్రిక చదువుకుంటోంది

మదుసూదనంగారు సుదర్శనం ఉదయం ఎనిమిది గంటలకే షాపుకు వెళ్ళిపోతారు కార్లో

రాజేంద్ర అడ్రస్ ఇంట్లో దొరకటం చాలా కష్టం

ఎప్పుడూ ఫ్రండ్స్‌తో ఏవో ప్రోగ్రామ్స్ ఉంటూ ఉంటా యతనికి

రుక్మిణమ్మగారిని ఇంట్లో ఉండనీయరు మహిళా మండలి కార్యక్రమాలు వగైరాలతో చాలా బిజీగా ఉంటా రావిడ

కోడలు లక్ష్మిరాణికి సినిమాల పిచ్చి ఎక్కువ ఇరుగు పొరుగు ధనవంతుల ఇళ్ళల్లోని కోడళ్ళతో కలిసి సినిమాలు బాగా చూస్తుంటుంది

ఇల్లంతా దాదాపు నౌకర్లు చాకర్లు వంట మనుషుల అధీనంలో ఉంటుంది ఎక్కువ కాలం

వాళ్ళకి గనుక కోపం వచ్చి స్ట్రైక్ చేస్తే ఆ ఇల్లంతా దుమ్ము పేరుకుపోతుంది ఇంట్లో వాళ్ళకి తిండే ఉండదు

ధనవంతుల ఇళ్ళల్లో సుఖ సౌభాగ్యాలకు లోటు ఉండదనే మాట పూర్తిగా కరెక్టు కాదని అది పని వాళ్ళమీద చాలావరకు ఆధారపడి ఉంటుందని తెలుసుకున్నాడు రవికాంత్

అయినా తన కెందుకీ పరిశీలన పరిశోధన ? అని సరిపెట్టుకున్నాడు

అందరిలో కీ రవికాంత్‌కి బాగా నచ్చింది మృదుల వ్యక్తిత్వం

బాంక్‌కి వెళ్ళిన టైము మినహా మిగతా సమయంలో ఎక్కువబాగం తనకే వినియోగించటంవల్ల ఆమెతో ఎక్కువ చనువు సాన్నిహిత్య మేర్పడింది రవికాంత్‌కి

క్రితం రాత్రి ఆమె తన మంచం దగ్గరలో కుర్చీ వేసుకు కూర్చుంది తెల్లటి డ్రస్సులో దేవకన్యలా మెరిసిపోతోంది

నర్స్ ఏవో టాబ్లెట్లు తెస్తానంటూ బయట కెళ్ళింది

సమయం రాత్రి ఏడు గంట లయింది మదుసూదనంగారు సుదర్శనం ఇంకా ఇంటికి రాలేదు

అత్తా కోడళ్ళిద్దరూ కలిసి జాయింటుగా ఏదో ఫంక్షను కెళ్ళారు

నౌకర్లు చాకర్లు వాళ్ళ ధోరణిలో వాళ్ళున్నారు

ఎల్లుండి ఉదయం మీరు మీ ఇంటికి వెడుతున్నారు అవునా?

అవును ఇదంతా మీ చలవ

అలా అనకండి నా విధి నేను నిర్వర్తించాను

థాంక్యూ

థాంక్స్ సరే

ఏమిటో చెప్పండి

వెళ్ళిపోతున్నాననుకుంటే మీ కేమీ అనిపించటంలేదా?

అంటే

బాధగాగానీ ఆనందంగాగానీ

లేదే ?

అయితే మీకు లేదన్నమాట

ఏమిటి? అదిరిపడ్డాడు

హృదయమనేదే లేదన్నమాట అందులో అనుభూతులసలే లేవన్నమాట

ఒక్క క్షణం మౌ                , రవికాంత్

ఏం మాట్లాడరే రెట్టించింది

ఏం మాట్లాడమంటారు?

మీకు నేను యాక్సిడెంటు చేశాను ట్రీట్‌మెంట్ చేయించుకుని మీరు

# డాక్టర్ సలహాలు

డా॥ కె.వెంకటేశ్వరరావు



**ఆర్ వి ఆర్ బిలాయి**

మలములో నులిపురుగులు నివారణకై మీ సలహా మేరకు పైపర్ జిన్ సిట్రేట్ రెండు బాటిల్స్ 15 రోజుల పాటు రోజూ రాత్రి రెండు టీస్పూనులు వాడినాను తాత్కాలికంగా ఉపశమనము పొందినాను మరల రెండు నెలల తదుప ప్రారంభమయినవి శాశ్వత నివారణకు సలహా కోరుతున్నాను వ్యక్తిగత అలవాట్లలో మార్పులు అవసరం అన్నారు టీ కాఫీ సిగరెట్లు అలవాట్లున్నవి ఇవి కారణమయి వుండవచ్చునా? ఇవి మానుకొనవలెనా?

మలవిసర్జన తర్వాత సబ్బుతో చేతులు కడుక్కోవటం మల విసర్జన సమయంలో పాద రక్షలు వాడటం గోళ్ళను కత్తిరించటం కాయగూరలు బాగా కడిగి వాడటం ఇవి కడుపులో పురుగులు రాకుండా చూసుకో తగిన ముందు జాగ్రత్తలు

ఒకే కుటుంబంలో కొందరు సభ్యులకి ఈ పురుగులు ఉన్నప్పుడు అందరూ ఒకేసారి పై మందుని వాడటం అవసరం టీ కాఫీ సిగరెట్లు వల్ల ఈ పురుగులురావు ఎటుని మానటం ఆరోగ్య దృష్ట్యా మంచిదే

**ఎ జె కె బీమవరం**

మా బాబు వయస్సు 3 సంవత్సరములు సంవత్సరం క్రితం చెవి ప్రక్కన గ్లాండ్స్ వచ్చాయి డాక్టర్ దగ్గర చూపించాము ఎక్సరే తీసి అవి టి బి గ్లాండ్స్ కావన్నారు మందులు వాడాము అప్పుడు తగ్గాయి కాని విపరీతంగా జలుబు చేసినప్పుడు మళ్ళీ కనబడతాయి ఆసమయంలో ఎల్లాడు చాలా నీరసంగా కనిపిస్తాడు తగ్గితే మళ్ళా మామూలు గానే వుంటాడు

గొంతు భాగాన్ని ముక్కు భాగాన్ని ఇ ఎన్ టి వైద్యుల చేత పరీక్ష చేయించండి అడినాయిడ్స్‌గాని టాన్సిల్స్ గాని వాచినపుడు ఇలా మెడమీద లింప్ గ్రంథులు వాచే అవకాశం వుంటుంది టాన్సిల్స్ అడపాతడపా వాస్తున్నప్పుడు వాటిని శస్త్ర చికిత్స ద్వారా తీసివేయటం మంచిది

**ఎస్ ఆర్ ఆర్ హిందూపురం**

నాకు 6 నెలల నుండి శరీరంపై తెల్లని మచ్చలు కనిపిస్తున్నాయి స్పర్శజ్ఞానం వున్నది ఏ మందులు వాడాలి?

శరీరంలో తెల్లని మచ్చలు చాలా కారణాల వల్ల ఏర్పడతాయి ఎటులైగో ల్యూకోడెర్మా అనేవి పుట్టుకతోనే సంక్రమించి కొన్ని సంవత్సరముల తర్వాత శరీరం మీద కనబడతాయి ఈ మచ్చలకి చికిత్స కష్టం ఫంగస్ ఇన్‌ఫెక్షన్‌ల వల్ల ఏర్పడే తెల్ల మచ్చలు మందుల వాడకం వల్ల తగ్గిపోతాయి సోరియాసిస్ అనే రోగం వల్ల వచ్చే మచ్చలకి చాలా కాలం పాటు మందులు వాడాలి లెప్రసీ వల్ల వచ్చే మచ్చలలో స్పర్శజ్ఞానం వుండదు ఈ మచ్చలు డాప్సోన్ అనే మందు వాడితే తగ్గిపోతాయి □

---

వెడుతున్నారు మీ మనసులోని భావం ఇంతేగా?

కాదంటే మీరు ఒప్పుకుంటారా?

మృదుల కళ్ళెత్తి ఆశ్చర్యంగా చూసింది

సరిగ్గా చెప్పండి

ఈ ఆరు రోజుల్లో మీరంటే గుండెలనిండా ఎంతో అభిమానం నింపుకున్నాను మృదులా ఎల్లుండినుంచీ మీరు కనపడరంటే ఇప్పటినుంచే గుండె ఎంతగా బరువెక్కిపోతోందో మీకు తెలుసా?

యాక్సిడెంట్ చేసిన నామీద మీకు అంత అభిమానం ఎందుకు కలగాలి?

పంటితో కింది పెదవిని నొక్కి పట్టింది

కారణం చెప్పలేను అది మీ మంచితనం వ్యక్తిత్వంవల్ల కావచ్చు నాపట్ల మీ శ్రద్ధవల్ల కావచ్చు

ఓ కె ఇకనుంచీ నన్ను చూడటానికి అప్పుడప్పుడూ వస్తూండరా?

రావాలనే ఉంది కానీ తరచు రాలేనుకదా

ఎందుకు రాలేరు?

అది బాగుండదేమో అని నా అభిప్రాయం

అదలా ఉంచండి మీ రెంత స్వార్థపరులండీ అంది మృదుల హఠాత్తుగా

నేనా? స్వార్థపరుడినా? ఆశ్చర్యంగా అడిగాడు

మీరే పచ్చి సెల్ఫిష్!

ఎందుకని?

ఇన్నాళ్ళూ దాదాపు మిమ్మల్ని కనిపెట్టుకుని పర్సనల్‌గా అటెండయ్యాను కదా నన్ను మీ ఇంటికి రమ్మనాలనీ ఆహ్వానించాలనీ కూడా కనీసం అనిపించటంలేదా మీకు?

ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయిపోయింది రవికాంత్ మనస్సు

మృదులా! నిజంగా మీరు మా ఇంటికి వస్తే అంతకన్నా సంతోషకరమైన విషయం ఏదీ ఉండదు నా జీవితంలో కానీ మీరు వస్తారా మా ఇంటికి

ఏం నేను మనిషిని కాదా నాకు మమత అనేవి ఉండవా?

అదికాదు

మరేమిటి

శిఖరాగ్రంమీదున్నారు మీరు కొండ అడుగుభాగాన ఉన్నాను నేను

ఆ భావం నాలో ఉంటే మీమీద ఇంత శ్రద్ధ చూపించనుకదా

ఎందుకు నామీద మీ కంత అభిమానం? నాలో ఏం చూసి

దానికి కారణం నేనూ చెప్పలేను అదంతే అతని వేపదోలా చూసి తలదించుకుంది

థాంక్యూ మిస్ మృదులా మీరు మా ఇంటికి రోజూ రావాలి

ఇప్పుడు థాంక్స్ చెప్పవలసిన బాధ్యత నాది రోజూ కాదు గానీ అప్పుడప్పుడు వస్తాను

మీ ఇంట్లో ఏమీ అనరా?

నా వ్యక్తిత్వానికి ఎవరూ అడ్డు రారు మీరు కూడా మీ యాక్సిడెంట్ స్నేహితురాల్ని మరచిపోకండి అప్పుడప్పుడూ వస్తూ ఉండండి

మిమ్మల్ని చూస్తే నాకొకటి గుర్తొస్తుంటుంది

ఏమిటది

సృష్టిలో తీయనిది స్నేహమేనోయీ అన్నది

స్నిగ్ధంగా నవ్వింది మృదుల

ఈలోపుగా నర్స్ టాబ్లెట్లు తీసుకురావటంతో వారి సంభాషణ అక్కడితో ఆగిపోయింది

గుండెలనిండా హాయిగా గాలి పీల్చుకున్నాడు రవికాంత్ తృప్తిగా నిట్టూర్చాడు ఆ సాయంత్రం

**(ఇంకా ఉంది)**

# భారత దేశానికి శాశ్వతంగా రావటం యిష్టం లేదు

అమెరికన్ తెలుగు యువతీ యువకులలో ఎక్కువ బాగం అక్కడ పుట్టిన వారే మిగిలిన వారు నాలుగైదు సంవత్సరాలు ఆంధ్రప్రదేశ్‌లో పెరిగి ప్రస్తుతం అక్కడే వుంటున్నారు వీరికి తెలుగు సంస్కృతిని గురించి జీవన విదానం గురించి కొద్దిగా తల్లి తండ్రుల ద్వారా తెలిసినప్పటికీ అప్పుడప్పుడు ఆంధ్రప్రదేశ్‌కు వచ్చినప్పుడు తెలుసుకున్న విషయాలే వారి మనస్సుకు ఎక్కువగా హత్తుకు పోయాయి వివిద విషయాలపై ఐదుగురు అమెరికన్ తెలుగు యువతీ యువకులతో జరిపిన ప్రత్యేక యింటర్వ్యూ వారి మనోభావాలకు అద్దం పడుతుందని చెప్పవచ్చు మిగిలిన విషయం ఎట్లా వున్నా ఆంధ్రప్రదేశ్‌కు తిరిగి వచ్చి స్థిర నివాసం ఎర్పరచుకునే విషయంలో మాత్రం అందరూ ఎకాబిప్రాయాన్నే వ్యక్తం చేశారు అడపాదడపా వచ్చి వెళ్లటానికి అబ్యంతరం లేదుకాని శాశ్వతంగా తిరిగి ఇండియా రావటానికి మాత్రం అమెరికన్ తెలుగు యువత అంత యిష్ట పడటం లేదు

## కవిత యలమంచిలి

తొమ్మిదవ తరగతి చదువుచున్న 14 సంవత్సరాల యలమంచిలి కవిత భారతదేశానికి శాశ్వతంగా తిరిగి



రావటం యిష్టం లేకపోయినా తెలుగు సంస్కృతి ఆచార వ్యవహారాల పట్ల పూర్తి అబిమానాన్ని యిష్టాన్ని వెలిబుచ్చింది. అమెరికన్ సంస్కృతిలోని డేటింగ్ ప్రేమ వివాహాలు తనకు నచ్చవని తమ తల్లితండ్రులు మిత్రుల తల్లితండ్రుల మధ్య వున్న ప్రేమ అప్యాయతలు యిక్కడ అమెరికన్లలో కనిపించటం లేదని అందుచేతనే తనకు తెలుగు సంస్కృతి అలవాట్లు యిష్టమనీ కవిత అబిప్రాయపడింది

అంత యిష్టంగా అబిమానించే తెలుగు సంస్కృతి పుష్కలంగా లబించే ఆంధ్రప్రదేశ్‌కు తిరిగి రావచ్చు కదా అన్న ప్రశ్నకు సమాధానమిస్తూ యిక్కడ వున్న విద్యా ఉద్యోగ అవకాశాలు అక్కడ లేవని యిక్కడ వున్న ఆదునిక సౌకర్యాలు అక్కడ లేవని సుఖమయమైన జీవితం అక్కడ లేదని అందుచేతనే తాను యిక్కడే వుండి పోవాలను కుంటున్నానని అమెరికాలో వున్నా పూర్తి తెలుగు సంప్రదాయంతో బ్రతకవచ్చునని కవిత అభిప్రాయం వ్యక్తం చేసింది

తనకు హిందూ మతం అంటే యిష్టమని, తమ యింట్లో పూజలు చేసుకుంటామని, తనకు భజనలంటే యిష్టమని, తన తల్లిదండ్రులు తనను స్వేచ్ఛగా వుంచుతారని వాళ్ల అబిరుచులు తనపై రుద్దరని కవిత గర్వంగా చెప్పింది తెలుగు కొద్దిగా మాట్లాడ గలిగిన కవిత బరతనాట్యం కూడా నేర్చుకుంటున్నది

## శ్రీనివాస్ దండమూడి

తనకు అమెరికన్ తెలుగు సంస్కృతులు రెండూ యిష్టమేనని సుఖంగా బ్రతికే అవకాశాలు వున్న ఎక్కడైనా వుండవచ్చునని అయితే బారతదేశంలో వనరులు వున్నా అవకాశాలు వున్నా వాటిని సద్వినియోగం చేసుకోలేని కారణంగా అక్కడి వారు సుఖంగా వుండలేక పోతున్నట్లు తనకు అనిపించిందని అందుచేత తాను అమెరికాలోనే వుంటానని అంటున్నాడు 10వ తరగతి చదువుచున్న 14 సంవత్సరాల దండమూడి శ్రీనివాస్ తెలుగు మాట్లాడగలనని అయితే ఉచ్చారణ సరిగా వుండని కారణంగా మాట్లాడనని తన 3వ సంవత్సరంలోనే అమెరికా వచ్చేసానని చెప్పాడు ఎప్పుడైనా చుట్టం చూపుగా బారతదేశం వస్తే చూడటానికి ఎదో ఒక చేంజ్ లాగ బాగానే వుంటుందని అబిప్రాయం తెలియజేశాడు స్కూల్‌లో గాని యింటిలో గాని తనకు సమస్య లేమీలేవని వుంటే వాటిని తాను పరిష్కరించుకోగలనని ఆత్మ విశ్వాసం వ్యక్తం చేశాడు శ్రీనివాస్ హిందూ మతం పట్ల పెద్ద ప్రేమ



అట్లాగని వ్యతిరేకత రెండూ లేవని చెప్పిన శ్రీనివాస్ తెలుగు సంస్కృతి తెలుగు మహాసభలు మొదలైన వాటిని గురించి ప్రశ్నించగా వాటిని పెద్దగా పట్టించుకొనవలసిన అవసరం లేదని, ఎదో జరుగుతుంటాయి అని సాదారణ బావం వ్యక్తం చేశాడు

## సునీత అనంతనేని

బారతదేశంలో కాకుండా అమెరికాలోనే స్థిర నివాసం ఎర్పరచుకోవటం యిష్టమని అందువల్ల కొన్ని లాబాలు కొన్ని నష్టాలు వున్నాయని అయితే లాబాలే ఎక్కువని అబిప్రాయ పడింది సునీత సునీత వయస్సు 13 సంవత్సరాలు 9వ తరగతి చదువుచున్నది తెలుగు వ్రాయలేను గాని చదవటం మాట్లాడటం వచ్చని చెప్పింది తమను యిక్కడి అమెరికన్ ఎల్లలు వేరుగానే చూస్తారని తమకు అది ఒక విదంగా బాదను కలిగిస్తుందని అయితే మాదక ద్రవ్యాలు మొదలగు చెడు అలవాట్లతో వుండే వాళ్ళతో కలిసేకంటే విడిగా వుండటమే తమకు హాయిగా వుంటుందని సునీత అబిప్రాయ పడింది తాను బరతనాట్యం నేర్చుకుంటున్నానని చెప్పిన సునీత తెలుగు మహాసభ

# అమెరికన్ తెలుగు యువత స్పష్టీకరణ

లలో ప్రదర్శన కూడా యిచ్చింది. మన పండగలంటే ఎంతో యిష్టమని, తెలుగు సంస్కృతి, ఆచార



వ్యవహారాలు బాగా నచ్చుతాయని చెప్పిన సునీత తనకు యింటిలో గాని, స్కూల్‌లో గాని ఏ విధమైన సమస్యలు లేవని చెప్పింది.

## సుంకర శైలేంద్ర

తెలుగు సంస్కృతి పట్ల వ్యతిరేకత లేకపోయినా తనకు అమెరికన్ సంస్కృతి పట్లే ఎక్కువ యిష్టమని, ఎవరి పని వారు చేసుకోవటం, డిగ్నిటీ ఆఫ్ లేబర్ వంటి కారణంగా తాను అమెరికన్ సంస్కృతిని ప్రేమించటానికి కారణమని 12వ తరగతి చదువుచున్న 18 సంవత్సరాల సుంకర శైలేంద్ర అన్నాడు. స్కూల్ పరీక్షలలో రాష్ట్ర స్థాయిలో అమెరికన్ పిల్లలకంటే కూడా చక్కటి ప్రతిభను కనపరచి వారిని ఆశ్చర్య పరచిన శైలేంద్రకు వివిధ విషయాల పట్ల స్పష్టమైన అవగాహన వుంది. తెలుగు వ్రాయటం, చదవటం రాదని, మాట్లాడ గలనని, ఎవరేనా మాట్లాడితే, అర్థం చేసుకో గలనని చెప్పాడు. సుఖమయమైన జీవితం చక్కటి విద్యా, ఉద్యోగ అవకాశాలు పూర్తిగా వున్న అమెరికా వదలి భారతదేశం తిరిగి రావటం పిచ్చితన మవుతుందని శైలేంద్ర అభిప్రాయపడ్డాడు. తమకు స్కూల్‌లో వు అమెరికన్ సంస్కృతి యింటిలో తోటి తెలుగు మిత్రులు కారణంగా తెలుగు సంస్కృతి వున్న కారణంగా రెండింటి పట్ల పూర్తి అవగాహన



వున్నదని. దేనిలో మంచి ఎక్కువగా వుంటే దానిని గ్రహించవచ్చుని శైలేంద్ర చెప్పాడు. యిక్కడ తమ తల్లిదండ్రులు తమకు ఎక్కువ స్వేచ్ఛ నిస్తారని అంతమాత్రంచేత తాము దానిని దుర్వినియోగం చెయ్యమని శైలేంద్ర ధృడంగా చెప్పాడు.

## పోలినేని కవిత

మీరు రెండు దేశాలు చూశారు. మమ్మల్ని చూశారు. మీరే చెప్పండి. మేము ఇండియా వస్తే మాకు బాగుంటుందా? అని గడుసుగా ప్రశ్నించింది. 11వ తరగతి చదువుచున్న 16 సంవత్సరాల పోలినేని కవిత. ఎంతో పరిశుభ్రమైన వాతావరణంలో పెరిగిన తాము, దుమ్ముతో, ధూళితో నిండిన రోడ్లతో, అశుభ్రమైన స్నానాల గదులతో, వాతావరణంతో కూడిన భారతదేశంలో శాశ్వతంగా వుండటానికి రాలేమని, అప్పుడప్పుడు తాత ముత్తాతలను చూడటానికి వస్తామని చెప్పింది కవిత. తెలుగు చదవటం, వ్రాయటం రాకపోయినా, మాట్లాడ గలనని, అర్థం చేసుకోగలనని, భరతనాట్యం అంటే చాలా యిష్టమని అందుచేత భరతనాట్యం నేర్చుకుంటున్నానని చెప్పన కవిత తన భరత నాట్యంతో స్కూల్‌లోని అమెరికన్లను ఆశ్చర్యపరచి బహుమతులు కూడాగెల్చుకుంది.

తెలుగు సంస్కృతిని గురించి అడిగిన ప్రశ్నలకు సమాధానంగా, సాధారణంగా అమెరికన్ తెలుగు యువతుల తల్లిదండ్రలకు తమ ఆడపిల్లలు సాంప్రదాయంగా పెరగాలనీ వుంటుందని అయితే యింటా బయట వున్న సంస్కృతుల భిన్నత్వం కారణంగా అది సాధ్యపడదని, తమ పిల్లలు తెలుగు సంప్రదాయబద్ధంగా, పెరగాలనే కోరిక కలిగిన తల్లిదండ్రులు పంచె. చొక్కా, చీర, ధరించి తమ వృత్తులకు ఎందుకు హాజరు కారని ప్రశ్నిస్తూ ఎక్కువమంది అమెరికన్ తెలుగువారు "ద్వంద్వ ప్రవృత్తి"తో జీవిస్తున్నారని స్పష్టంగా చెప్పింది కవిత. తమ తల్లిదండ్రులు సంకుచిత మనస్తత్వంతో వుండరని, తమను గురించి ఎక్కువ శ్రద్ధ తీసుకుంటారని చెప్పిన కవిత మాదక ద్రవ్యాలు, తాగుడు మొదలైన చెడు అలవాట్లు వున్న అమెరికన్ సహ విద్యార్థులతో తాము స్నేహం చెయ్యలేక పోతున్నామని. అందుచేత ఎక్కువగా



తెలుగు వాళ్ళమె కలసి వుంటామని అభిప్రాయం వ్యక్తం చేసింది.

—ఇంటర్‌వ్యూ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్

# ప్రశ్నావళి — కె. రామలక్ష్మి



**జి.ఆర్. పి. రాయగడ**

★ ఈ దేశంలో గౌరవం అనేది ఎప్పుడు తెలుస్తుంది?

● ఏ విషయంలో?!

★ నిజమైన ప్రేమికులు అయితే ఏమి చేస్తారు??

● పెళ్ళి అయ్యేదాకా వేచి వుంటారు!!

**కె. ఎ. ఎం. చీరాల**

★ వ్యక్తిత్వాల పేరుతో సంసారాలను నాశనం చేసుకొనే చదువుకున్న స్త్రీ పురుషులను చూస్తుంటే నాకు సహ్యం వేస్తుంది. చదువు సదవగాహన పెంపొందించాలి గాని ఇలా అహంకారాన్ని పెంపొందించకూడదు. ఏమంటారు?

● కొనుక్కున్న చదువు కనుక అహంకారాన్నే పెంచుతుంది. సదవగాహన, పరస్పర గౌరవాభిమానాలు- సంస్కారం వల్ల వస్తాయి. వాటిని పెంచడం అంత సులభంగాదు సరికదా ఒకొక్కప్పుడు చేతకానితనంగా కన్పిస్తాయి.... డబ్బిచ్చి సీటు, కట్నం పుచ్చుకుని పెళ్ళాన్ని సాధించుకున్న వారికి- అహంకారమే "ఊతకర్ర". దానితోనే జీవితాన్ని నెట్టుకొస్తారు!

**ఎస్. వి. ఆర్. జువారినగర్, గోవా**

★ భార్యలు భర్తలను పేర్లు పెట్టి పిలవకూడదని చెప్తున్నా ఇప్పటి భార్యలు పేరు పెట్టి పిలుస్తున్నారు. ఇది సంప్రదాయ విరుద్ధం కాదా!

● సంప్రదాయం కాలానుగుణంగా మారుతుంది. అన్నీ మారిపోతూంటే అదొక్కటే మారకుండా ఎలా వుండిపోతుంది?? పేరుపెట్టి పిలవడంలో ఆప్యాయత, ఆరాధన, అనురాగం, సమానత్వం- అన్నీ ధ్వనిస్తాయని మీ కెందుకు తోచలేదు?!

**మోహన్, కోటబొమ్మాళి**

★ రామలక్ష్మిగారూ నేను మొట్ట మొదటిసారిగా మంచి సీరియల్ నవల రాయాలనుకుంటున్నాను. అనుభవం గల రచయిత్రిగా మీ అభిప్రాయం తెలుపగలరు.

● రాయాలనుకోడం ఏమిటి రాయడం ప్రారంభించడమే! తరువాత దాని మంచి చెడులు- ఆయా సంపాదకులకు మీ పట్ల గల 'అభిమానాన్ని' 'ఆదరణని' పట్టి నిర్ణయం అవుతాయి! ఆ బెంగ ఈ రోజుల్లో రచయితకి అక్కర్లేదనుకుంటా.

**డి. ఆర్. ఆర్. ఖర్గపూర్**

★ దేశం ఒక పక్క ఆధునిక వూహలతో ముందుకు సాగుతుంటే మరో పక్క మూఢ నమ్మకాలతో మత్తులో నిద్రిస్తూంది. వీటికి విరుగుడు లేదా?

● పాపం! మీ మూఢ నమ్మకాలకి దేశం ఏం చేస్తుంది!! మీ ఆధునిక భావాలకీ- మీ అధోగతికీ మీరే కారకులుగాని దేశం కాదే!!

**ఎ. కె. ఆర్. అనకాపల్లి**

★ తాను అనుకున్నది సాధించలేని నాడు ఏం చేయాలి?

● ప్రయత్నిస్తూనే వుండాలి. ఒక్క గెంతుతో సాధించలేని ఎత్తు... మెట్టు మెట్టుగా ఎక్కి సాధించగలం. మరిచిపోయారా?!

★ జీవితం అంటే కామెంట్ ప్లీజ్.

● దిన దిన గండం- డబ్బున్నా- లేకున్నా.

**ఎన్. ఆర్. బి. హైదరాబాద్**

★ ఆంధ్రాలో వుంటూంటే ఒళ్ళు మండుతూంటుంది. రాజకీయాలు చౌకబారుగా తయారయినందు కంటారా కె. రా గారూ?

● అయిందొచ్చు. చుట్టూ వాతావరణం చౌకబారుగా తయారయితే- వూపిరి సలపదు.

★ సినిమాలలో నవరసాలు ప్రదర్శిస్తే ఫరవాలేదు. మరి రాజకీయాలలో చూపితే మోసం చేయడమేకదా?

● సినిమా మటుకు మోసం కాదా ఏమిటి? రెండు రంగాలూ వూసరవెల్లులే!!

★ సినీ నటులు రాజకీయాలలోకి వస్తున్నారు. మరి రచయితలు కవులు రాడం లేదేం!

● వీరికి కాస్త అహంకారం, కాస్త పౌరుషం, కాస్త వ్యక్తిత్వం అనే రోగ లక్షణాలు వుంటాయి. అవి రాజకీయాలకి పనికిరావు!

**జి. ఎమ్. ఆర్. విజయవాడ**

★ మీరు గొప్పగా దేన్ని భావిస్తారు?

● నన్ను అసహ్యించుకునే వారినే!

★ గెలుపు ఎలా సాధ్యం?

● నిజాయితీ... నిజాయితీ.... నిజాయితీ.... లేదూ! క్యూరియాసిటీ... క్యూరియాసిటీ- మార్గం చూపుతుంది.

**వి. ఎల్. పోచంపాడు**

★ మీరు సమస్యలకి పరిష్కారం సూచించ కలరా? ప్రశ్నలకి సమాధానం యివ్వడమేనా?

● సూచించ వచ్చు. కాని- ఆ పరిష్కారం నా వ్యక్తిగత అనుభవాల్ని, పరిజ్ఞానాన్ని బట్టి వుంటుంది. అది ఎదుటి వారు ఎంతవరకు అన్వయించుకో కలరో వారు తెల్సుకోవాలి. మీ జోడు మిమ్మల్ని ఎక్కడ కరుస్తూందో- నేనెలా వూహించి చెప్పను? కొత్త జోడుకి ఆముదం రాయండి అని చెప్ప కలనుగాని!

**పి పి ఎస్ ఆర్ పలమనేరు**

★ మాది కులాంతర వివాహం మా పిల్లలని కుల ప్రసక్తి లేకుండా చదివించడ నికి వీలుందా?

● ఉంది. కులం- కాలమ్- నింపకుండా వుండడమే. కాని అది నింపకపోతే "అప్లికేషన్ పరిపూర్ణంగా లేదు" అని వాకవక్యంగా నిరాకరిస్తాయి సంస్థలు! ఎందు కిలా చేస్తాయి అని అడిగితే- స్టాటిస్టిక్సు కోసం అంటారు. అవి ఎందుకు? ఉద్ధరించ డానికి కాదు ఓట్లు వేటాడడానికే ☐

## సరికొత్త సైన్స్ క్విజ్
## గడువు తేదీ పొడిగింపు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక- రవి కళాశాల సంయుక్త ఆధ్వర్యంలో నిర్వహిస్తున్న సరికొత్త సైన్స్ క్విజ్ ప్రశ్నలకు సమాధానాలు పంపడానికి వ్యవధి తక్కువగా ఉందని, గడువు తేదీని పొడిగించవలసిందనీ ఎక్కువ మంది పాఠకులు కోరిన దృష్ట్యా ఈ సైన్స్ క్విజ్‌లో ఎక్కువ మంది పాల్గొనడానికి వీలుగా గడువు తేదీని 19-12-'87కి పొడిగిస్తున్నాము పాఠకులు గమనించకోరుతున్నాము.

—సం

# చెప్పలేని సమస్య

## చిన్నకోట సుశీలాదేవి

ఆవిడతో నాకెటువంటి పరిచయమూ లేదు!

ఎప్పుడూ మాట్లాడలేదు! అసలావిడ ఎవరో కూడా నాకు తెలీదు!

దబ్బపండు శరీరచ్ఛాయ!

తెల్లబడిన జుట్టు ముడతలుపడిన ముఖం తెల్ల చీర కట్టుకుని మా ఎదురింటి వాకిట్లో కూర్చొని వుంటుంది

గత స్మృతులలో తేలుతూ వచ్చే పోయే వాళ్లను పలకరిస్తూ మధ్య మధ్య ఏదేదో గొణుక్కుంటూ చీకట్లు వ్యాపించే వరకూ వినీలాకాశంలో ఎగిరే ఒంటరి పక్షిలా కూర్చుంటుంది

ఆ తర్వాత మెల్లగా లేచి లోపలకు వెడుతుంది

సరిగ్గాఎదురిల్లే ఆమెది

కానీ ఇల్లు లోపలకు వుంటుంది ఆమె కాక ఇంకా ఆ ఇంట్లో ఎవరున్నారో కూడా నేను గమనించలేదు పట్టించుకోలేదు

ఈ ఇంట్లోకి మేము వచ్చి నెల అవుతోంది

ఈ నెల రోజులూ చల్లని సాయంత్రం వేళలో ఆవిడను చూస్తూ కూర్చోవడం నాకొక కార్యక్రమం అయింది

నాకు తెలీకుండానే ఆవిడతో నాకేదో అనుబంధం ఏర్పడిపోయింది!

ఒక్క రోజు చూడకపోతే వెర్రిగా వుండేది! నా శ్రీమతి సరోజ ఒక ఉదయాన్నే అడిగింది

రోజూ అలా ఎదురింట్లోకి చూస్తారు కదూ ఎవరు కనిపిస్తారక్కడ?

ఆ మాటల్లో అనుమానం కూడా తొంగి చూస్తోంది!

నేను నవ్వేస్తూ

"సాయంత్రం చూపిస్తాలే" అన్నాను.

ఆ సాయంత్రం... స్నానం చేసి వచ్చాక... వీధి గదిలో కిటికీ దగ్గరగా కుర్చీ జరుపుకుంటుండగా సరోజ కాఫీ కప్పుతో వచ్చింది

ఎవరున్నారక్కడ

చుట్టూ చూస్తోంది!

ఎదురింటి గుమ్మంలో కూర్చున్న వ్యక్తిని చూడు

ఆ ముసలావిడను చూసి సరోజ ఆశ్చర్య పోయింది!

'ఆమెనా మీరు చూసేది? అపనమ్మకంగా అడిగింది

అవును సరోజా! మా అమ్మే బ్రతికుంటే ఇప్పుడు అచ్చు అలాగే వుండేది కదూ అమ్మంటే నాకెంత ఇష్టమో నీకు తెలుసు కదా

అమ్మని తలుచుకోవడంతో నా కళ్ళు చెమ్మగిల్లాయి

సరోజ నన్ను అపార్థం చేసుకున్నందుకు నొచ్చుకుంది

వెరీ సారీ

పర్వాలేదులే ప్రేమ వున్న చోట అనుమానం వుంటుంది ఇంతకీ ఆవిడెవరో నీకు తెలుసా!

ఆ వచ్చిన మర్నాడే మన పనిమనిషి అన్ని వివరాలు చెప్పింది! వాళ్లింట్లో కూడా ఆ మనిషే చేస్తోంది

ఏమిటవి?

ఆ ఇల్లు ఆమెదే ఎప్పుడో ఆమె భర్తగారు కట్టించి పోయారుట ఆవిడకు ఇద్దరు మగపిల్లలు ఒక ఆడపిల్ల పిల్లలందరూ ఇంకా చిన్న వయసులో వుండగానే భర్త గతిస్తే ఈమె తాను ఒక్క గదిలో వుంటూ ఇల్లంతా అద్దెకిచ్చి ఆ డబ్బు చాలకపోతే... తాను చిన్న వుద్యోగం చేసి-పిల్లల్ని అతి కష్టం మీద పెంచి పెద్దవాళ్లను చేసిందట. కొడుకులిద్దరూ మంచి వుద్యోగాల్లోనే వున్నారు...ఆడపిల్లకూ పెళ్లయిపోయింది..."

సరోజ చెప్పిన వివరాలన్నీ శ్రద్ధగా విన్నాను...

"అయితే ఆవిడకిప్పుడేం సమస్యలూ లేవన్న మాట... కష్టపడిన దానికి మంచి ఫలితమే దక్కింది. ఇప్పుడావిడ ప్రశాంతంగా కాలం వెళ్లబుచ్చుతూ వుంటుంది.

"కానీ... కోడళ్ళు సరిగ్గాచూడరుట..."

"కొడుకులైనా బాగా చూస్తారా-" అనడిగాను.

"ఏమో! ఆ వివరాలు తెలీదు..." సరోజ లోపలకు వెళ్లింది.

నేను సరోజ చెప్పిన విషయాలనే ఆలోచించ సాగాను.

ఒంటరి స్త్రీ ముగ్గురి పిల్లలతో ఎన్ని కష్టాలనుభ వించి వుంటుందో...

ఏదైతేనేం... కొడుకులు వృద్ధిలోకి వచ్చారు. తమకోసం కష్టపడిన తల్లిని ఎంతో ఆదరంగా చూసుకుంటారు. పరాయి ఇంటి నుండి వచ్చిన కోడళ్లకు అంత ప్రేమ లేకపోవచ్చు కానీ కనీసం మానవతా దృష్టితోనైనా లేక భర్తలను చూసైనా ఆదరిస్తారు

ఆవిడ అదృష్టవంతురాలు కాబట్టి ఈ వయసులో ప్రశాంతమయిన జీవితాన్ని గడుపుతోంది అనుకున్నాను

* * * * *

ఒక రోజు ఆవిడ కనబడలేదు ఎందుకనో అని వూరుకున్నాను ఎక్కువ పట్టించుకోలేదు

ఆ రోజే కాదు మరో వారం వరకూ ఆమె కనబడలేదు!

సరోజని పిలిచి అడిగాను

ఆవిడిక కనబడదు! అంది సరోజ

ఏం?

ఆమెకి పక్షవాతం వచ్చిందట

నా మనస్సు విషాదంతో నిండిపోయింది

ఆవిడను తలచుకుంటూ విచారపడ్డాను

నెల రోజులు గడిచాయి

కానీ ఆవిడ జాడ లేదు

ఆమెకా వ్యాధి ఇంకా తగ్గి వుండదు

బహుశ తగ్గదేమో కూడా పక్షవాతం అన్నింటికంటే భయంకరమైన వ్యాధి అందులోనూ ఈ వయస్సులో

కదల్లేక మంచంలో పడివుంటే ఆప్యాయంగా సేవ చేసే వాళ్ళుంటే పర్వాలేదు కానీ లేకపోతే ఆ జీవితం నరక సదృశమే

కానీ ఆవిడకు అటువంటి హీన స్థితి రాదు ఆవిడకు ప్రయోజకులైన ఇద్దరు కొడుకులున్నారు! వారామెను ప్రేమగా చూసుకుంటారు.

అనుకుంటూ నేను తృప్తి పడ్డాను తలో

సరోజ నా దగ్గరకు గబగబా వచ్చింది

ఏవండోయ్! ఆ అరుపులు వింటున్నారా? అంది

నేను ఆవిడను గురించి ఆలోచిస్తూ బాహ్య ప్రపంచాన్ని విస్మరించాను

సరోజ అలా అనగానే నాకు చైతన్యం కలిగి ఇంద్రియాలు పనిచెయ్యడం మొదలెట్టాయి

ఎదురు గుమ్మంలో నిలబడిన ఇద్దరాడవాళ్ళు మరొకామెతో బిగ్గరగా ఏదో చెప్తున్నారు

నేను జాగ్రత్తగా వినసాగాను

మా అత్త మంచంలో పడటం మా ప్రాణానికి వచ్చింది ఆవిడకు సేవ చేయలేక చస్తున్నాం



ఎప్పుడు ఈ పీడ విరగడవుతుందో కానీ ఆ రోజున దేవుడికి పది కొబ్బరికాయలు కొడ్తాను

ఏవేవో ఇంకా శాపనార్థాలు పెడుతున్నారు

వాళ్ళిద్దరూ ఆవిడ కోడళ్ళు అంది సరోజ

వాళ్ళ మాటల్ని బట్టి ఆవిడ పరిస్థితి ఎలా వుండి వుంటుందో వూహించాను మంచినీళ్ళు కూడా ఇచ్చేవాళ్ళు లేక

పక్కంతా మలమూత్రాదులతో నిండిపోయి ఆప్పైనవూహించడానికె భయం వేసింది

సరోజా! ఆవిడను మనింటికి తీసుకొస్తే హరాత్తుగా అన్నాను

సరోజ క్షణకాలం నివ్వెరపోయింది!

మీకేమన్నా పిచ్చా! ఆవిడెవరు! మనమెవరు! ■ ఇంట్లోవాళ్ళు ఒప్పుకుంటారా అసలు!

సరోజా! ఆవిడకూ మనకూ బంధుత్వం లేకపోవచ్చు! కాని సాటి మనిషి ఆ ఇంట్లో వాళ్ళంటావా సంతోషంగా అంగీకరిస్తారు

ఎన్నటికీ ఒప్పుకోరండీ ఇంట్లో తామెలా వున్నా ప్రతి మనిషీ సంఘం గురించి ఆలోచిస్తాడు బయట లభించే గౌరవ ప్రతిష్టకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తాడు మీ కోరిక వింటే నలుగురూ మిమ్మల్ని తిడతారు కానీ ఇక వూరుకోండి అంటూ చివాట్లేసింది

■ తర్వాత తీరుబడిగా కూర్చుని ఆలోచిస్తుంటే సరోజ మాటల్లో ఎంతో నిజం వుందనిపించింది

మళ్లా ఆ విషయం ఎత్తలేదు

మరో రెండు రోజుల తర్వాత నేను ఆఫీసు పనిమీద మద్రాసు వెళ్లాల్సి వచ్చింది

తిరిగి వచ్చేసరికి పది రోజులయింది రైలు దిగి ఇంటికొచ్చేసరికి సాయంత్రం ఆరు గంటలయింది

స్నానంచేసి పైజామా లాల్చీ వేసుకుని వీధి గదిలో ఎప్పటిలా కూర్చుని ఎదురింటి వేపు చూశాను!

ఎదురింటి ప్రహరీ గోడ ముందు లోపలా కూడా రెండు షామియానాలు వేసి వున్నాయి వాటిని చూసి నేను ఆశ్చర్యపోయాను

సరోజా అంటూ కేక పెట్టాను! నా అరుపుకు

ఆదిరిపోయి సరోజ లోపల నుండి పరుగెట్టుకు వచ్చింది

ఎందుకండీ! అంత కంగారుగా పిలిచారు? ఎం జరిగింది? అనడిగింది

ఆ షామియానాలేమిటే?

ఓ అదా మద్యాహ్నం ఆవిడ చనిపోయిందండీ?

విచారంగా చెప్పింది

శివ శివా! అంటూ రెండుచెవులూ మూసుకున్నాను

పాపం ఆవిడ

అంటూ సరోజ ఎదో చెప్పబోయింది

సరోజా ఆవిడ గురించేం చెప్పకు నేను వినలేను చివరిసారిగా ఆవిడను చూం వస్తాను అంటూ లేచాను

టిఎను చేసాను తిని వెళ్లండి అంది

వద్దు తినలేను

"పోనీ కాఫీ త్రాగండి

వూహు నా మనస్సేం బాగాలేదు నన్ను విసిగించకు వెళ్లనీ

సరోజ మాట్లాడలేదు

నేను ఎదురింటి వేపు నడిచాను

గేటు దాటి లోపలకు వెళ్లాను వరండాలో ఆవిడను పడుకోబెట్టారు బయట షామియానా క్రింద చాలామంది ఆడా మగా కూర్చుని వున్నారు

నన్ను చూచి ఒక వ్యక్తి ఎదురొచ్చాడు!

రండి సార్ కూర్చోండి మిమ్మల్ని ఆ ఇంట్లో చూడడమే కానీ ఎప్పుడూ పరిచయ బాగ్యం కలగలేదు ఆవిడ మా అమ్మగారు మద్యాహ్నం చనిపోయారు అతడు మా అన్నయ్య ఆ ప్రక్కన కూర్చున్న వ్యక్తి మా బావగారు ఆ ప్రక్కన మా బాబాయ్ అంటూ షామియానా క్రింద కుర్చీల్లో కూర్చున్న వ్యక్తులను వేలెత్తి చూపుతూ పరిచయం చేస్తున్నాడు

నా మనసుకు ఆ పరిచయ వాక్యాలేమీ ఎక్కడం లేదు

ఆవిడనే చూస్తున్నాను!

జీవితమంతా ష్టాలనుబవించింది!

ఇప్పుడు కష్టాలు లేని లోకాలకు వెళ్లిపోయింది!

కూర్చోండి సార్ కుర్చీ జరిపాడు! నేను కూర్చున్నాను

అతడూ నా ప్రక్కనే కూర్చున్నాడు నా వుద్యోగ విషయాలు అడుగుతున్నాడు

నేను యాంత్రికంగా జవాబిస్తున్నాను

ఇంతలో

పార్వతీ! ఫలహారాలు తయారయాయా? అంటూ అతని అన్నగారు కేకపెట్టాడు!

ఆ తీసుకొస్తున్నా నాన్నా!

ట్రేలో ప్లేట్లతో వచ్చింది ఒకమ్మాయి

ఆ ప్లేట్లలో పకోడీలున్నాయి!

అందరికీ తలొకటీ ఇచ్చింది

నాకూ ఇవ్వబోయారు!

వద్దని తిరస్కరించాను

వాళ్లందరూ ఇంకా ఇంకా అడిగి మరీ పెట్టించుకొని తింటున్నారు!

నాకు ■ దృశ్యం చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది

ఇదేమిటి! ఎదురుగా శవాన్ని వుంచుకుని వీళ్లిలా తినగలుగుతున్నారు?

అమ్మాయి! జీడిపప్పు పకోడీలు చేయించక పోయావా? 'ఎవరో అడుగుతున్నారు

మావారు తినరు బాబాయ్! ఆయనకి ఉల్లిపాయలే వుండాలి పెద్ద కోడలు వివరిస్తోంది

అందరు కబుర్లు చెప్పుకుంటూ తింటున్నారు!

ఎరా రామం! మీ అమ్మాయికి పెళ్లెప్పుడు చేస్తావ్! పెద్దకొడుకుని ఎవరో అడిగారు

ఈసంవత్సరం చేయాలనుకుంటున్నాను! నీకు తెలిసిన సంబందం వుంటే చెప్పు

ఉన్నాయిలే ఒకటి రెండు ఆ వ్యక్తి సంబందాల వివరాలు వాళ్లకు కట్నకానుకలపై వున్న ఆశను వివరిస్తున్నాడు

మగాళ్లు పెళ్లిళ్లు వాటిల్లో వుండే సాదక బాదకాల గురించి మాట్లాడుకుంటున్నారు

కమలా! ఈ ఊళ్లో మీ అబిమాన హీరో సినిమా ఆడుతోంది! చూస్తావా?

అలాగా ఇంతవరకూ చెప్పావు కావే వదినా!

నువ్విప్పుడేగా వచ్చావ్!

ఎలాగైనా రేపెళ్లాలి వదినా!

నేనూ వస్తా కమలా ఒకసారి చూశాననుకో! మళ్లీ చూడాలని వుంది మీ హీరో చాలా బాగా చేశాడులే

ఆడాళ్ళు సినిమాల కబుర్లు చెప్పుకుంటున్నారు!

వదినా కాఫీ అయిందా!

ఆ తెస్తాను

నాకు కాఫీ వద్దు టీ ఎవరో అరిచారు

నాకు చక్కెర లేకుండా కాఫీ తీసుకురా అమ్మాయ్

అలాగే

పావు గంట తర్వాత కాఫీలు టీ లు వచ్చాయి అందరూ త్రాగుతున్నారు నేను తీసుకోలేదు

ఇప్పుడు వాళ్ల టాపిక్కులు మారిపోయాయి

మగాళ్ళు వాళ్ల ఉద్యోగాల్లోని సమస్యల గురించి మాట్లాడుకుంటోంటే

ఆడవాళ్ళు క్రొత్తగా చీరల గురించి చేయించుకున్న నగల గురించి చెప్పుకుంటున్నారు

ఆ దృశ్యాలు చూస్తూ వాళ్ల మాటలు వింటుంటే నా తల దిమ్మెక్కి పోతోంది

అది శవం వున్న ఇల్లా?

లేక పెళ్లివారి ఇల్లా? అనే సందేహం కలిగింది క్షణకాలం

ఒక్కరూ చనిపోయిన వ్యక్తిని గురించి మాట్లాడుకోవడం లేదు

ఆమె తోటి అనుబందాన్ని కానీ ఆ బందంలోని మధురమయిన జ్ఞాపకాలను కానీ వాళ్ళు తలుచుకోవడం లేదు

ఆమె తమ కోసం పడిన కష్టాలన్నీ ఆలోచించటం లేదు గడిచిపోయిన ఆమె జీవితాన్ని గురించి జాలిపడటంలేదు

వాళ్ల నయనాలు చెమ్మగిల్లటం లేదు

దుఃఖంతో కుమిలిపోవడం లేదు!

బరువు గుండెలు లేవు
బాధల పల్లవులు లేవు

సరదాగా వినోదయాత్రకు వచ్చినట్లుగా వున్నారు!

వీళ్లసలు ఆవిడ పిల్లలేనా?

వీళ్ళు ఎందుకిలా వున్నారు?

కాఫీ టీల మీదనున్న ఆసక్తి అబిమానం తమకోసం జీవించి చివరకు శవంగా మారిన అమ్మ మీద ఎందుకు లేదు!

వీళ్లలో మమతానురాగాలనే ఆ సున్నిత బావాలు లేవా అస్సలు? వుంటే ఏమయినాయి?

పూర్వం ఒక ఇంట్లో మనిషి చనిపోతే ఆ శరీరాన్ని కాల్చేసే వరకూ ఆ వీదిలోని వాళ్లంతా ఏం తినేవాళ్ళు కాదుట

కానీ వీళ్ళు ఆ శవం ఎదుటే పకోడీలు తింటున్నారు

ఇదెలా సాధ్యం!

కాల ప్రబావమా ఇది! లేక మనుషుల్లో వచ్చిన మార్పా? లేక మనిషి రాను రాను కఠిన సదృశుడు అవుతున్నాడా?

ఎందువలన వచ్చిందీ మార్పు?

ఈనాటి మనుషులంతా ఇంతేనా?

నాలో ఎన్నో ప్రశ్నలు తలెత్తాయి కానీ అవన్నీ జవాబులు దొరకని ప్రశ్నలు

ఇలా ఆలోచిస్తూ ఆవిడ వేపు చూశాను

శవంగా మారినాఆ సౌజన్యమూర్తి సజీవ రూపమే

రోజూ నేను చూసే ఆ పవిత్ర ముఖమే నా కళ్ల ముందు నిలిచింది!

ఆవిడతో నాకుపరిచయం లేదు!

ఎన్నడూ మాట్లాడలేదు! ఆవిడ గురించి కూడా ఎక్కువగా ఏమీ తెలీదు! కానీ ఆవిడను తలచుకుంటున్నకొద్దీ నా మనస్సెందుకో ఆర్ద్రమౌతోంది

కళ్ళు చెమ్మగిల్లుతున్నాయి!

ఏనాటి అనుబందమో ఇది! ఆ క్షణంలో నాలో కలుగుతున్న ఆ దుఃఖానికి కారణం ఏదో నేను చెప్పలేను

నా కళ్ళు మాత్రం వర్షిస్తూనే వున్నాయి చుట్టూ వున్నవాళ్ళు ఎందుకో బిగ్గరగా నవ్వారు

అది చూసి నా మనస్సు మరింత బాదపడింది

మనిషి కోరుకునేది ఒక్కటే తాను చనిపోయిన నాడు తనకోసం తనవారు విడిచే కన్నీటి బిందువుల్ని

కానీ వీళ్ళు

సిగరెట్లు కాలుస్తూ విలాసంగా కూర్చుని ఖుషీగా మాట్లాడుకుంటున్నారు!

బగవంతుడా ఈ స్థితి పగవాళ్లకు కూడా రానివ్వకు

అని మూగగా ప్రార్థిస్తూ ఇక అక్కడ క్షణం కూడా వుండలేక బయటకు వచ్చేశాను! □

# 230 భాషలు నేర్చిన ఘనాపాఠి



డెన్మార్క్‌కి చెందిన ప్రొఫెసర్ రాస్మస్ క్రిస్టియన్ రాస్క్ 1787 - 1832 మధ్య జీవించాడు కొబెన్‌హావెన్ యూనివర్శిటీలో ఈయన బాషా శాస్త్రాచార్యుడిగా ఉండేవాడు. పరాయి బాషలు నేర్చుకోవడంలో ఈయనకు అసమానమైన ప్రతిబా సామర్థ్యాలు ఉండేవి ఈ విషయంలో అయన అప్పటి వరకూ వండర్‌మాన్ గా పిలువబడుతూ వచ్చిన మేజాఫాంటీని మించిపోయాడు జీవించింది కేవలం నలభై అయిదు సంవత్సరాలే అయినా ఈయన 230 బాషలను మాట్లాడే నేర్పు సంపాదించాడు అంతేకాదు ఈ దిగువ పేర్కొన్న 28 బాషలకు డిక్షనరీలు వ్రాశాడు

అల్బేనియన్ అలూషియన్ ఎక్వాంబిస్క్ అర్మీనియన్ బాస్క్ సెల్టిక్ ఫారో ఎస్నిష్ ఫ్రీషియన్ గాలిక్ గోథిక్ గ్రీన్‌లాండిష్ గ్రుసీనియన్ గినీ హిందూస్థానీ ఐబీరియన్ ఐస్‌లాండిక్ లాప్ లాట్వియన్ లిథుయానియన్ మలే హిబ్రూవీ పెర్షియన్ సంస్కృతం సింహలీస్ ట్రాన్సయన్ యానూల్ జండ్

ఇవికాక ఈ దిగువ పేర్కొన్న 15 బాషలలో అసాధారణ పాండిత్యం గడించాడు రాస్క్

అరబిక్ డానిష్ ఇంగ్లీష్ ఫ్రెంచి జర్మన్ గ్రీక్ హీబ్రూ ఇటాలియన్ లాటిన్ నార్వీజియన్ పోర్చుగీస్ రష్యన్ స్పానిష్ స్వీడిష్ టర్కిష్

ఇవేకాక ఇండియాలోని 50 చిన్న చిన్న బాషలు ప్రపంచంలో వివిధ దేశాలకు చెందిన 146 చిన్న భాషలు ఉప బాషలు కూడా ధారాళంగా మాట్లాడడం నేర్చుకున్నాడు

అయన తర్వాత ఇప్పటి వరకూ రాస్క్‌తో పోల్చదగ్గ మేథావి ఇంకెవరూ జన్మించలేదు

– కె ఆర్ మోహన్




# మారని వివాహ వ్యవస్థ

మారిపోతున్న నేటి సమాజంలో, ఎంత ముందంజ వేశామనుకున్నా ఈ నాటికీ మారనిది మహిళల వివాహ వ్యవస్థ. సమాజం మారింది. శతాబ్దాలు గడిచాయి. యుగాలు గడుస్తున్నాయి. ప్రపంచంలోని మనిషి వేషభాషలు నాగరికత పెరిగింది కాని ప్రవర్తన, పద్ధతుల్లో మానవుడు మారలేదు. "ఎక్కడ వున్నావే గొంగళీ' అంటే వేసిన చోటనే' అన్నట్లుగా తరాలు మారినా, శతాబ్దాలు గడిచినా, ఎంత సమాన హక్కులు సాధించామనుకున్నా, అన్నిరంగాలలో పురోభివృద్ధి పొందామన్నా వనితల్లో వారి సమస్యల్లో మార్పు లేదంటే అతిశయోక్తి కాదు. 'మారుతున్న సమాజంలో మారనిది మన ఈ నాటి వివాహ వ్యవస్థ.

కడుపుతో వున్నది లగాయతు కనే దాక మగపిల్లవాడైతే బాగుండును – అని అనుకోని వనితలున్నారా? కారణం ఏమిటి? ఆడపిల్లలయితే అడుగడుగునా సమస్యలే. ముఖ్యంగా ఆమె వివాహం. చదువు వస్తుంది కదా అని అవకాశాలున్నాయని చదువుతున్నారు; ఊరికే ఉండటమెందుకని ఉద్యోగాలు చేస్తున్నారు ఆర్థిక స్వాతంత్ర్యం ఏర్పడుతోంది. కుటుంబ ఆదాయాభివృద్ధికే తోడ్పడుతున్నారు. ఆర్థికంగా స్వాతంత్ర్యం పొందితే, వ్యక్తిత్వం పెరుగుతుంది. సమస్య లుండవనుకోవటం పొరపాటు. ఈ నాడు స్త్రీల వివాహాలు, వారిపై అత్యాచారాలు, మానభంగాలు ఒక సమస్య. స్త్రీ ఈ నాడు ఒక సెక్సు సింబల్. రక్షణ లేదు.

తన కొక తోడు, నీడ జీవితంలో కావాలనుకుంటుంది స్త్రీ. సనాతన సంప్రదాయ బద్ధమైనప్పటికీ, మార్పు చెందని కొన్ని సమాజ ప్రక్రియల్లో మూఢాచారంగ ఈ నాటికీ మారకుండా పరిగణించబడుతూ వస్తున్నది పెళ్లి చూపుల తతంగం. సంతలో పశువులా బేరం. అడ్డమైన అవకతవక ప్రశ్నలకు అభిమానం చంపుకుని అవమానంతో జవాబిచ్చి, పెళ్లి చూపులయాక తన కెన్ని డిగ్రీలున్నా, వంపలు సంపాదించే ఉద్యోగం వున్నా కట్న పిశాచి వికటాట్టహాసం ముందు తలవంచి, వివాహం చేసుకోవలసి వస్తుంది. లేదా పరిస్థితులు అనుకూలించక పోతే కన్యగానే మిగిలిపోతోంది. పెళ్లి కాని వనితకు రక్షణ లేదు. ఎంత తోసి పారేసి, నాగరికతా ముసుగులో నాట్యమాడదామన్నా పెద్దలు చెప్పినట్లు బాల్యంలో తల్లి దండ్రులు, యౌవనంలో భర్త, వృద్ధాప్యంలో పిల్లలు స్త్రీకి రక్షణ తప్పడం లేదు.

ఎన్ని చట్టాలు చేసినా ఈ నాడు ఆడపిల్లల పాలిట శాపం 'వరకట్నం' అబ్బాయి పుట్టినపుడు ఉగ్గు పాలకైన ఖర్చు దగ్గర్నుంచీ, చదువు, ఇంటర్వ్యూలు, ఉద్యోగం వచ్చే దాక అయిన ఖర్చంతా కట్న రూపంలో గుంజాలనుకుంటాడు అబ్బాయి తండ్రి. అబ్బాయి చదువు ఖర్చయిందన్న ఆలోచనేకాని అమ్మాయి చదువు కెంతయిందన్న ఆలోచన రాదు అమ్మాయి ఉద్యోగం చేసి సంపాదించే నెల జీతం లెక్క వేస్తే (జీవితాంతం) ఎంతవుతుందన్న ఆలోచన లేదు

చదువుకున్న ఎల్ల కావాలి ఉద్యోగస్థురాలు [illegible] ం కూడా కావాలనే గొంతెమ్మ కోరికతో కట్నం నచ్చకపోతే పిల్ల నచ్చలేదనో జాతకాలు కలవలేదనో వంక పెట్టేస్తారు చదువు లేకపోతే లేదు ఉంటే ఉద్యోగం లేదు లేదా ఉద్యోగం చేస్తున్నమ్మాయి చెప్పిన మాట వినదేమో – ఇట్లా కట్న రూపంలో శక్తి కొద్దీ రాబట్టాలన్న దురాలోచన గల తల్లితండ్రులే తప్పు. అమ్మాయి చదువు, ఖర్చు, ఆ తల్లితండ్రుల స్తోమత ఆలోచించే వారు లేరు.

వివాహం అనేది రెండు జీవితాలకు సంబంధించిన నూరేళ్ల పంట అనే ఆలోచన గల తల్లితండ్రు లెందరున్నారు? అంతస్థులూ, ఐశ్వర్యాలు, కట్నాలు, కానుకలూ – ఈ దురాలోచన మారితే తప్ప ఈ దురాచారం అంతం కాదు. పెద్దలు ఉదార స్వభావంతో పిల్లలను అర్థం చేసుకునీ, వారికి వివాహాది విషయంలో తగిన సలహాలిచ్చి, ప్రోత్సహించి స్వేచ్ఛనిచ్చి సమస్య పరిష్కరించాలి. అట్లాగే ప్రతీ యువతి ఒక నిశ్చయానికి వచ్చి, నిశ్చలంగా వుండాలే తప్ప, సినిమాలు చూచి వాస్తవాన్ని దూరంగా పోయి జీవితాలను కన్నీటిమయం చేసుకో కూడదు.

కట్నం ఒకటే కాదు. ఆడబడుచు లాంఛనాలు, అత్తగారి ముద్దు ముచ్చట్లు, అప్పగింతల బట్టలు, కాపురాన్కి వెళ్లేటపుడు సారె – ఇట్లా గొంతెమ్మ కోరికలతో ఆడపిల్ల తండ్రి ఆఖరి ఔన్సు రక్తం పీల్చేస్తారు మగ పెళ్లివారు. 'లక్షల కట్నం కాదు – లక్షణమైన అమ్మాయి కోడలు కావాలి అనీ ప్రతీ వారు భావించాలి రూపం కాదు గుణం ప్రధానం కట్నం కాదు కన్య ముఖ్యం అనుకొన్న నాడు సమస్యలే వుండవు తనకే కూతుళ్ళున్నారు అనే ఆలోచన వుండాలి

ఇక ఆడపిల్లలు తల్లితండ్రులు కూడ కట్నం లేకుండా ఉదారాశయంతో ముందుకు వచ్చిన యువకుని అతని వ్యక్తిత్వం గుర్తించి వివాహ మాడాలే తప్ప అతనితో ఏదో లోపం వుందని అందుకే కట్నం లేకుండా ముందుకు వచ్చాడనీ చిన్నచూపు చూస



అవమానించ కూడదు. బాహ్య సౌందర్యం కాక, అంత స్సౌందర్యాన్ని ప్రేమించి ఆరాధించిన నాడు వారి వైవాహిక జీవితం అన్యోన్యంగా, ఆదర్శంగా సాఫీగా గడిచే అవకాశం వుంది

ప్రభుత్వం 1961 లో వరకట్న నిషేధ చట్టం అమలు చేసింది. కాని ప్రయోజనం? కథ మామూలే. చట్టాలు శాసనాలు ఏమీ చేయలేవు. మనిషిలో మార్పు రావాలి. మనస్తత్వం మారాలి. వివాహ వ్యవస్థ మారడం పురుషుల కంటె స్త్రీల చేతిలోనే వుంది. స్త్రీలు పురుషుల్ని దుయ్యబట్టకుండా కృషి చేస్తే సమస్య రూపుమాస్తుంది. పెద్ద ఉద్యోగం పెద్ద కుటుంబం (ఐశ్వర్య వంతుడు) తల్లులు తమ భర్తలు వద్దన్నా తమ హోదాకు, అంతస్థుకు తగ్గట్లు కట్నం తీసికొంటేనే గౌర వంగా భావించడం మానాలి. కట్నకానుకలకు ఆడపిల్లల తల్లి తండ్రులను బాధించి, వేధించి వారిని మనస్తాపాన్కి గురి చేయరాదు.

నలుగురిలో గొప్పగా చెప్పుకోవా లని తమ కుమారుని విలువ అంచనా కట్టడం హాస్యాస్పదం. క్షమించాలి. ఈ నాటి ఈ కట్న దురాచారాలకుతల్లులే ఎక్కువ బాధ్యులు. తనను పెంచి పెద్ద చేసిన తల్లితండ్రుల్ని ఎదిరించలేక గౌరవ భావంతో అబ్బాయి మనోవేదన పొందుతాడు. తన అభిప్రాయాలు, ఆశయాలకు తిలోదకాలిస్తాడు. యువతీ యువకుల జీవితంలో ఒక ముఖ్యమైన మలుపు ప్రాముఖ్యము కల్గిన ఈ వివాహ వ్యవస్థ, దివ్యానుభూతినీ, మధురత్వాన్ని నింపి నూరేళ్ల పంటగా విలసిల్లవలసిన ఈ వివాహ వ్యవస్థ, కట్న ఏశాచి విలయతాండవంతో మొగ్గలోనే మాడిపోతోంది.

దీనికి పరిష్కారం ఏమిటి? తాను నమ్మిన ఆరాధించి ప్రేమించిన యువకుని కట్న కానుకల ప్రసక్తి లేకుండా కులమత ప్రసక్తి లేకుండా స్వేచ్ఛగా ఆదర్శంగా వివాహం చేసుకునే అవకాశం తల్లితండ్రులు తమ పిల్లలకు కలిగించాలి.

వారణాసి జానకీదేవి,
అమలాపురం

# విడాకులు-పునర్వివాహాలు

నేటి యువకులు మద్యపానమును ఒక స్టేటస్ సింబల్‌గాను, క్లబ్బులు, పార్టీలు, ఆడవారితో స్నేహాలు ఒక ఫాషన్‌గానూ భావిస్తున్నారు. వివాహమైన తరువాత కూడా ఈ పద్ధతిలోనే సంచరించడం వలన, వైవాహిక జీవితము రంగుల కలగా, సుందర స్వప్నంగా భావించి వైవాహిక జీవితంలో అడుగు పెట్టిన యువతులకు నిరాశా, నిస్పృహలు ఎదురవుతున్నాయి. ఆ పరిస్థితులలో ఇమడలేక, వ్యసనపరులయిన భర్తలను మార్చ లేక ఎంతో మనఃక్షోభకు గురిఅవడం మనం చూస్తున్నాం. కొంత మంది త్రాగుడు మైకంలో తమ భార్యలను ఇతరులకు అప్పచెప్పిన సందర్భ ములు, ఇతరులను అల్లరి పెట్టిన సందర్భములు మనకు తెలిసినవే. అటువంటి పరిస్థితులలో చిక్కుకున్న యువతులకు విడాకులొక్కటే శరణ్యం. తల్లిదండ్రులకు తెలియ కుండా ముందే వివాహమయినవారు, లేక ఇతర స్త్రీలతో సంబంధం కలిగియున్నవారు కొందరు తల్లి దండ్రుల మాటకు కట్టుబడినట్లుగా నటించి కట్నం కొరకే వివాహం చేసుకుని, కట్నం చేజిక్కిన తరువాత భార్యలపై లేనిపోని అపవాదులను సృష్టించి, విడాకులను తీసుకోడం కూడా నేటి యువకులలో లేకపోలేదు.

విడాకులు తీసుకున్న స్త్రీకి బంధువులుగాని, స్నేహితులుగాని చేయూతనిచ్చి, ఏదైనా ఉద్యోగం ఇప్పించడమో లేక ఆర్థికంగా తన కాళ్లపై తాను నిలబడేటట్లు చేయడమో చేస్తే కొంత సమస్య ఉండదు. సరియైన సహాయం చేసేవారు లేక మోసగాళ్ళ కోరలతో చిక్కుకున్న వారికి సమస్యలు ఎక్కువ అవుతాయేగాని విముక్తి ఉండదు.




నేడు అటువంటి మోసగాండ్ర సంఖ్య ఎక్కువగా ఉన్నది. యువతులు వీరిబారిన పడకుండా జాగ్రత్త వహించడం చాలా ముఖ్యం.

కన్నె పిల్లలకే కష్టతరమౌతున్న మన వివాహ వ్యవస్థలో పునర్వివా హము అందుబాటులో ఉంటుందను కోడం ఎండమావే. ఒంటరిగా ఉన్న స్త్రీలను అవమాన పరచడానికి ప్రయత్నిస్తారుకాని, వివాహం చేసుకుని బాధ్యతను స్వీకరించడానికి ఎక్కువమంది ముందుకు రారు. ఒకవేళ నిజముగా ఎవరైనా ఆ బాధ్య తను స్వీకరించడానికి ముందుకు వచ్చినా వారి బంధువులు, స్నేహి తులు వారు తప్పు చేస్తున్నట్లు భావించి వారిపనిని హర్షించక పోవడంతో వెనుకంజ వేస్తారు. అందరినీ ఎదిరించి ఒకవేళ వివాహము చేసుకున్నా, పునర్వివాహము చేసు కున్న యువతి వివాహం చేసుకోడం ఎంతో పెద్ద నేరమయినట్లు భావించి ఇల్లు అద్దెకు ఇవ్వడానికి నిరాక రించడం, నలుగురిలో సూటిపోటి మాటలతో బాధించడమేగాక, ఏవో లొసుగులు ఉండబట్టే వివాహము చేసుకున్నాడు గాని ఆదర మేమీ లేదంటూ ప్రచారంచేసి ఆ యువతికి మనోక్లేశాన్ని కలిగిస్తారు

బలీయమైన పరిస్థితులలో తప్ప ఏ భార్యా భర్త నుండి విడాకులు తీసుకుని అపనిందలపాలు కాదని విడాకులు తీసుకున్న స్త్రీని వివాహం చేసుకోడం నేరం కాదని సానుభూతితో ఆలోచించరు ఒకరిద్దరు సాను భూతితో ఆలోచించడానికి ప్రయ త్నించినా ప్రజలు సానుకూల పడనివ్వరు

విడాకులు తీసుకున్న యువతుల పరిస్థితులను వివేకంతో అర్థం చేసుకుని వారికి తగు చేయూత నివ్వడానికి సమాజం ప్రభుత్వం స్వచ్ఛంద సేవా సంస్థలు ముందుకు రావాలి యువకుల ప్రవృత్తిలో మార్పును కలిగించడానికి ప్రయత్నిం చాలి

–ఏ వి సరోజినీదేవి
సికింద్రాబాద్ ☐

# తెగింపు

కొడవంటి కాశీపతిరావు

రాజేశ్వరికి బాదగా వుంది ఇప్పుడు కాదు ఈ రోజు కాదు నిన్నా కాదు రేపూ కాదు పెళ్ళయిం దగ్గర్నుండీను అంటే మూడేళ్ళయి బాదపడని రోజు లేదు క్షణం లేదు

ఏ ముహూర్తాన అయ్యిందో పెళ్ళి' ఆ ముహూర్తానే పేచీ మామూలే కట్నం పేచీ లాంచనాల పేచీ పీటల మీద కూర్చున్న ఆడకూతురి వూసే లేదు ధ్యాసే లేదు

పదివేలు కట్నానికొప్పుకున్నాం ఆడపడచు కట్నం వెయ్యి ఎల్లుడికి ఉంగరం వాచీ సరేసరి మరిప్పుడు అయిదు వేలు చేతిలో పెట్టి తర్వాతిస్తానంటారేం ఎయ్యవరాలు నెగ్గదీసింది ఇదిగో శ్రీవారు ప్రబాకరం గారున్నారా వారి తల్లి కమలమ్మ

పోనీ తండ్రి సబబుగా మాట్లాడేడా ఊహు

అవున్నిజవే మిగతాది ఎరు బాటు కాలేదు తర్వాతిస్తానని ఎతిమాలుకుంటున్నాగా అయినా ఎల్లుకి నాలుగు తులాల బంగారం పెడ్తానని చెప్పి మీరు రెండు తులాలే పెట్టలేదూ మిలాగా నిగ్గదీసేనా

మాతో మీకు పోలికా

ఆడపిల్ల తండ్రివని కాబూ అలుసు

అవునని వేరే చెప్పాలా

మీకూ ఉన్నారు ఆడపిల్లలు

ఉంటే?

ఎద్ద మనుష్యులు జోక్యం చేసుకున్నారు ఇలా కాపరం సాగుతోంది గతుకుల రోడు మీద అతుకుల ఎండిలాగ మూడేళ్ళుగా సాగుతోంది ఏడాది ఎల్లడు కూడాను అయినా నిత్యపూ పేచీలే

ఏ కూర వేసేద" అనడిగితే తప్పు ఎవున్నాయ్ మీ నాన్న తెచ్చి పడేసినవి ఉన్నవా పుచ్చొంకాయ లొక్కటిగా అవే తగలెయి

పోనీ అడక్కుండా చేసినో అదంతకన్నా రాద్ధాంతం మా యిష్టాయిష్టాలక్కర్లేదా ఏం పెడితే అదే తినాలనా నీ ఉద్దేశ్యం' అంటారు

ఇక పండక్కి పబ్బానికీ ఉండనే వుంది రగడ

ఈ పండక్కయినా బాకీ చెల్లేస్తాడా మీ నాన్న?

వడ్డీ సంగతి దేవుడెరుగు అసలైనా ఇస్తే చాలు

మిగిలిన అయిదు వేలూ ఎదేయమను పండగ కట్నానికో నమస్కారం

ఇలా రయ్ రయ్‌మని పోతోంటే తనేం చేసుంది'

ఏం చెప్తుంది? అటు చూస్తే

ఏం పారిపోతానా ఎంతసేపూ డబ్బు డబ్బంటాడు మీ ఆయన

సమయం సందర్భం లేదూ పండక్కొచ్చి సరదాగా గడపకుండా

అయినా నన్నడగొచ్చు కదా

ఇదీ నాన్న వరస

అటో కుక్క ఇటో కుక్క తనని పీకి ముక్కలు చేస్తున్నాయ్ తను నోరు విప్పితే పది తప్పులు ఎత్తి చూపిస్తారు నోరు విప్పకపోతే ఒక్కటే తప్పు

బెల్లం కొట్టిన రాయిలా మాట్లాడదని

అదే ఉత్తమం

ఇప్పుడిదిగో ఇన్‌లాండు కవరు అడ్రసు కూడా రాసేసి ముఖం మీద విసిరేసేరు అయ్యగారాపీసుకు వెంచేసేరు వచ్చేలోగా రాసేయాలట నాన్నకి కట్నం డబ్బు పంపించు అని అదీ శాసనం రాస్తున్నదీ లేనిదీ కమలమ్మగారి అజమాయిషీ

నాన్న ఇబ్బందులు తనకి తెలుసు అలా అన్నెప్పు మూడేళ్ళుగా ఒప్పుకున్న డబ్బు ముట్ట చెప్పక పోవడం అదీ సమర్ధించలేదు పోనీ పలాని అప్పుడిచ్చేస్తానని చెప్పి ఖచ్చితంగా చెప్పాలి ఇవ్వాలి అదీ లేదు ముంచడూ తేల్చడు

పోనీ ప్రబాకరం ఓ రోజు సెలవు పెట్టి వెళ్ళి నాన్నతో అమీ తుమీ తేల్చుకోకూడదూ? ఊహు నామోషీ తనని సాధిస్తారు పండక్కి వెళ్ళినప్పుడైనా తేల్చుకోవాలా? అబ్బే సుబ్బరంగా మెక్కడం ఒకవేళ సందర్భం వచ్చినా కుక్కల్లా కాట్లాడుకోవడం

ఎలా చచ్చేది?

అవును చావాలి అప్పుడే తనకి విముక్తి

కిరసనాయిలు పోసుకుని కాల్చేసుకుంటే తనని తగలెట్టే ఖర్చయినా జమ అవుతుంది లాభం గూపెల్లోకి రావాలి తన చావుకి కారణం ప్రబాకరం కమలమ్మా అని చీటీ రాసి పెట్టేస్తే అంతే కావాలి చచ్చి సాదించొచ్చు కాని మంటలు అమ్మో బాద కనీసం అరగంటైనా మంటల్లో మాడితేనేగాని చావు రాదేమో అన్నంగిన్నె ముట్టుకుని కాలితేనే బొబ్బలెక్కి పోతుంది అరగంట మంటలు అబ్బ తల్చుకుంటేనే ఒళ్ళు గగుర్పాటు వద్దు బాబూ

నూతిలో దూకేస్తేనో అవును ఆ నూతి నీళ్ళు



వాడిక్కి పూజకి పనికి రాకుండా పోతే కమలమ్మ గారి ముఖం చూడాలి ఆ ముఖం మాటకేం తనెలా వుంటుంది? శవం ఉబ్బిపోయి వికారంగా గబ్బు కంపు నీళ్లలో పడగానే చావొస్తుందా? పావు గంటైనా పాటుపడాలేమో? ముక్కులోకీ నోట్లోకీ నీళ్లు పోతూ కాళ్లకి నేల దొరక్కుండా కళ్లకేం కనిపించకుండా గాభరాగా ఉక్కిరిబిక్కిరిగా అబ్బ ఇప్పుడే ఊపిరి సలపడంలేదు

బలవంతపు చావు చావడం చచ్చే చావు బాబూ అర క్షణంలో చచ్చే మార్గం వుంటే తప్ప చావలేదు తను లేదూ వీళ్లు పెట్టే హింసలు అనుభవించాలి

కేకలు

పక్క వాటాలోంచి ఎవరూ వనజా వాళ్లాయనా వనజకు కేకలేయడం కూడా వచ్చునే! మాట్లాడ్డమే అపురూపం

తను వారపత్రికిస్తుంది వనజ పేపరిస్తుంది విశేషాలు మాట్లాడుకోవచ్చుగా సీరియలు కథ ఎలా వుందీ చెప్పొచ్చుగా ఊహు తను చెప్తే వినడమే ఏమైనా అడిగితే చిన్న నవ్వు లేకపోతే ఔను కాదు అంతే

అవును వనజ గొంతే!

ఇంకెక్కడి బాకీ ఎప్పుడో చెల్లయింది

ఇంతకు మునుపు తను విన్నదే ఎదురింటావిడ కమలమ్మతో చెప్పులేదూ ఎంత మోరవమ్మా అని ఈ కమలమ్మే నోరు నొక్కుకుంది కూడాను

నన్ననుభవిస్తున్నందుకు రోజుకు పది రూపాయల చొప్పున లెక్క కడితే మీ బాకీ ఎప్పుడో జమయిపోయింది నా తిండి ఖర్చుకీ మీ ఇంటి చాకిరీకి చెల్లు

అబ్బ ఎలా మాట్లాడుతోంది?

ఇలాంటి డైలాగులు నాకు చెప్పకు వద్దీ ఎవడిస్తాడే

ఓహో మీకంతా కోష్ బేరాలే కావాలి కదూ నా ఒళ్లు రోజువారీ ఎవడికైనా తాకట్టు పెట్టుకుని మరో పది ఎక్కువ జమచేసుకోండి

ఛీ సిగ్గులేని

ఆపండి ఆడాళ్లకార్థిక స్వాతంత్ర్యం లేకపోబట్టి

ఆ మాట అనవలసి వచ్చింది మీ డబ్బు కాపీనం చూస్తుండబట్టి అలా అన్నాను

ఎంత తెగేసి చెప్పింది వనజ? ఇప్పుడు వాళ్లాయన వనజని తన్ని తగలేస్తే ఏం చేస్తుంది? రోజూ వాతలు పెట్టి హింసలపాలు చేస్తే కూడా ఇలాగే మాట్లాడగలదా? బయటపడి బతకగలదా?

రాజేశ్వరి మనసులో ప్రశ్నలు ప్రశ్నలు

అనుమానాలు అనవసరం ప్రశ్నలు దండగ భవిష్యత్తు అప్రస్తుతం ఫలితం ఏమైతేనేం? వనజ ఎదిరించిన తీరుకు అభినందించాలి ఆ ఎదురీతకి ప్రవాహమే ముడిపోవాలి మనిషి అనగా ఎంత? తనకీ ఏదో మార్గం కనిపిస్తోంది

వనజని మనసులో మెచ్చుకుంది రాజేశ్వరి 

సీరియల్

# మంజీరనాదం

రావినూతల సువర్ణకన్నన్

(గత సంచిక తరువాయి)

"ఆ పక్షి చాలా బావుందికదూ? అంది దాయమ్మ

అవును అన్నారిద్దరూ

రసన్! ఒక్కసారి ఆ పక్షిని దగ్గరికెళ్ళి చూసొద్దామా? పసిపిల్లలా అడిగింది దాయమ్మ

దాయమ్మ చిత్రమైన కోరికకి మొహాలు చూసుకున్నారు ప్రేమికులు

నాకు దాన్ని దగ్గర్నించి చూడాలనుంది రసన్! మళ్ళీఅంది దాయమ్మ ఆ పక్షికేసే చూస్తూ

కానీ అది ఎంత ఎత్తు నుందో తెలుసా? అన్నాడు రసన్ ఆమెకోరికకి మనసులో నే తెల్లబోతూ

తెలుసు! మెల్లగా వెళ్దాం

ఒద్దు దాయమ్మా! అది కొండ శిఖరాన వున్నట్టుంది నువ్వు ఎక్కలేవు అంది చందన

మీరనుకున్నంత ముసలిదాన్ని కాదు నేను పందెం వేసి ఎక్కితే మీకన్నా నేనే ముందు ఎక్కగలనా కొండని నవ్వింది దాయమ్మ

చందన కూడా నవ్వింది

నిజమే దాయమ్మా! కానీ మనం కష్టపడి అక్కడికి ఎక్కామే అనుకో తీరా మనం అక్కడికి చేరుకునే సరికి పక్షి కాస్తా ఎగిరి పోతే? తన అనుమానం వెలిబుచ్చాడు రసన్

చూద్దాం నువ్వన్నట్టు అది ఎగిరి పోతే అక్కణ్ణుంచి అడివంతా ఓ సారి పరికించి చూసి తిరిగొచ్చేద్దాం! ఇంకెప్పుడూ ఇటుకేసి రాంకదా అంది దాయమ్మ

సరే త్వరగా నడవండి అన్నాడతను

దాయమ్మ మొహం వెలిగి పోయింది

చిన్న పిల్లలకి అందమైన అపురూపమైన బొమ్మ దొరికినంత సంబరపడి పోయింది వాళ్ళకన్నా ముందుగా చక చక కొండ ఎక్కసాగింది

ఆశ్చర్యంగా చూస్తూ ఆమె ననుసరిస్తున్నారు చందన రసన్

చకచకా నడుస్తూ మధ్య మధ్యలో ఆగి కొండమీది పక్షిని చూస్తున్నారు

ఆ పక్షి అలాగా కూర్చుని ఇటూ అటూ చూస్తోంది మధ్యమధ్య చెవులు చిల్లులు పడేలా అరుస్తోంది

కొండమీదికి ఎక్కుతున్న కొద్దీ జలపాతాల హోరు ఎక్కువవుతోంది

అంతెత్తునించి దూకిన నీరు ఈశునదిగా అడవి మధ్యనించి పరవళ్ళు తొక్కుతూ సాగిపోతోంది

అతి ప్రయాసగా నడుస్తోంది చందన

చిత్రంగా అందరికన్నా ముందు పరిగెడుతున్నట్టు నడుస్తోంది దాయమ్మ

ఆమె ప్రవర్తన వింతగా తోచింది రసన్ చందనలకి

ఎలాగో పడుతూ లేస్తూ శిఖరం మీదికి చేరుకున్నారు అయితే వాళ్ళు అక్కడికి చేరుకునేసరికి ఓ సారి చివ్వున తలతిప్ప వాళ్ళకేసి చూసిన పక్షి వికృతంగా అరుస్తూ ఎగిరి పోయింది

కృంగిపోయారు రసన్ చందనలు

దిగులుగా దాయమ్మ కేసి చూశారు

ఆమె అదేం గమనించనట్టు ఇంకా అడుగులు వేస్తూనేవుంది

దాయమ్మా! వెనకనించి పిల్చింది చందన

ఆమె తిరిగి చూసింది

పక్షి ఎగిరి పోయింది దాయమ్మా? వుసూరుమన్నట్టు చెప్పింది చందన

దాయమ్మ అటు కేసి చూసింది

అంతవరకు పక్షి కూర్చున్న రాయి బోసిగా కనిపించింది

వెళ్ళిపోదామా దాయమ్మా? అన్నాడు రసన్

జరిగిన కథ – 15 స్వామీజీ దగ్గరికి తీసుకెళ్తున్నానని చెప్పి దాయమ్మ చందనని రసన్ దగ్గరికి తీసుకు వెళ్తుంది చందన రసన్‌లు ఒకటవుతారు వీడ్కోలు తీసుకుని వెళ్ళిపోవడానికి వచ్చిన చందన ఆ విషయం పూర్తిగా మర్చిపోతుంది దాయమ్మ గుర్తు చేసిన మీదట రసన్, చందనలు మళ్ళీ కలుద్దామనే నిర్ణయంతో విడిపోవడానికి నిశ్చయించుకుంటారు ఒక వింత పక్షి వాళ్ళ కంట బడుతుంది

ఎలాగూ ఇంత దాకా వచ్చాంగా ఒక్కసారి కొండ మీద ఎలావుందో చూద్దాం రసన్ అంది దాయమ్మ

ముగ్గురూ శిఖరాగ్రానికి చేరుకున్నారు

అక్కడున్న చెట్లని జలపాతాలనీ చూసి మురిసి పోయింది దాయమ్మ పసిపిల్లలా కేరింతలు కొట్టింది

అబ్బ! ఎంత బావుందీ దృశ్యం! తుళ్ళి పడుతున్న లేడి పిల్లల్ని గుర్తుకు తెస్తోందీ జలపాతం! రసన్! అలనాటి ఆకాశగంగ భగీరదుని మీదికి దూకినట్టు లేదూ ఇది చూస్తుంటే నీకు అద్భుతమైన చిత్రం గియ్యాలని ఎంచడం లేదూ? ఎంతో ఎత్తునించి కిందికి దూకే నీళ్ళని తన్మయత్వంగా చూస్తూ అంది దాయమ్మ

ఆమె వుత్సాహానికి మరోసారి మొహాలు చూసుకున్నారు ప్రేమికులు

కొండని గురించి అక్కడి చెట్లని గురించి కొండ మీంచి కనిపించే నగరాన్ని గురించీ ఏవేవో మాట్లాడేస్తోంది దాయమ్మ

దాయమ్మకి కవిత్వం వచ్చేస్తోంది! తన బాధని తాత్కాలికంగా మర్చిపోయిన చందన నవ్వుతూ అంది

కవిత్వం రాయి దాయమ్మా! రసన్ కూడా నవ్వుతూ అన్నాడు

దాయమ్మ కూడా నవ్వింది

ఆమె కళ్ళు ఎప్పుడూ లేనంత కాంతితో తళతళ లాడుతున్నాయి

మెల్లగా పచ్చని పువ్వులతో నిండివున్న ఓ చెట్టు కిందికెళ్ళింది దాయమ్మ చందన రసన్ అనుసరించారు

అక్కడ కూలబడింది దాయమ్మ

వాళ్ళూ కూర్చున్నారు

ఈ కొండనీ ఈ కొండమీది అడివినీ ఈ జలపాతాల్నీ ఈ చెట్లమీది పక్షుల



కుఒంపల్ని రతిమన్మధుల్లా వున్న మీ జంటనీ చుస్తుంటే నాకో టనిపిస్తోందర్రా' అంది దాయమ్మ

ఏమిటి దాయమ్మా? ఆతృతగా అడిగారిద్దరూ ఒకేసారి

నేను మనరాజ్యానికి ఒంటరిగావెళ్తేనే బావుంటుందనిపిస్తోంది! అంది దాయమ్మ ఏదో ఆలోచిస్తూ

దాయమ్మ! తృళ్ళిపడింది చందన

బిత్తర పోయాడు రసన్

అవున్రా! అదే న్యాయం అనిపిస్తోంది!

నిజమా దాయమ్మా? ఆమెని పట్టి కుదిపేస్తూ అంది చందన

ఊఁ కళ్ళతో నే నవ్వింది దాయమ్మ

ప్రేమికుల హృదయాలు పొంగి పోయాయి

ఇప్పుడు మీ ఇద్దరికీ పెళ్ళి చెయ్యాలి!

పెళ్ళా?

అవును మీ పెళ్ళికి నేనే పెద్దని నేనే చేస్తాను! స్థిరంగా వుంది దాయమ్మ గొంతు

రసన్ గుండె జల్లుమంది

ఏం చెప్పమంటావ్ అబ్బాయ్, లోకంలో ఒక్కో మొగాడిది ఒక్కో విషాద గాథ, వాళ్ళావిడ డాక్టర్ కదా కోపం వచ్చినప్పుడల్లా ఇంజెక్షన్‌తో గుచ్చేస్తుందట!

Gowtham

చందన అనుమానంగా చూసింది

దాయమ్మ మళ్ళీ నవ్వింది

చందమ్మా! నాకు మతి పోయిందనుకుంటున్నావా?

అలాగే అనిపిస్తోంది దాయమ్మా! లేకపోతే మా ఇద్దరికి పెళ్ళి చేస్తావా? ఇంతకు ముందు దాకా అన్ని నీతులు చెప్పి ఇప్పుడు హఠాత్తుగా పెళ్ళి చేస్తానంటే గంభీరంగా అంది చందన

పిచ్చి చందమ్మా! నేను మామూలుగానే వున్నానమ్మా! కాకపోతే ఇప్పుడు జ్ఞానోదయం అయింది అందుకే మీ ప్రేమికులిద్దర్నీ ఒకటి చేసి నేను ఒంటరిగా వెళ్ళి పోతాను మీ పెళ్ళికి ఈ పంచ భూతాలే సాక్షులు! ఈ అడవిలోని అల్పప్రాణులే పేరంటాలు ఆ జలపాతాల హోరే మంగళ వాద్యాలు! రండి! ఉద్వేగంగా లేచింది దాయమ్మ

ప్రేమికుల కళ్ళు తళుక్కుమన్నాయి

అమ్మతో ఏం చెప్తావ్? భయంగా అంది చందన

ఏదో ఒకటి నేను చెప్పుకుంటానుగా మీరు దంపతులయ్యాక ఇంక నగరం కేసి రావద్దు! ఇద్దరూ చెట్టా పట్టాలేసుకుని ఏ అడవుల్లోకో వెళ్ళి పొండి! మానవమాత్రులు లేని కారడవుల కైనాసరే వెళ్ళిపోండి దొరికింది తిని ఏటి నీళ్ళు తాగి హాయిగా బతకండి ఈ మనుషులకన్నా క్రూరమృగాలు ప్రమాద మైనవికావు! దాయమ్మ కళ్ళు నీళ్ళతో నిండి పోయాయి

ప్రేమికుల ఆనందాని కంతం లేదు

దాయమ్మా! నువ్వెంత మంచిదానివి అంటూ ఆమె కాళ్ళకి చుట్టేసుకున్నారు

ఆమె వాళ్ళిద్దర్నీ లేవదీసి కళ్ళు తుడిచింది ఓదార్చింది తొందరపెట్టింది

తామిద్దరూ పెళ్ళి చేసుకుని హాయిగా వుంటామన్న ఆనందంలో నే దాయమ్మని రాజావారు ఏం చేస్తారో స్ఫురణకి వచ్చిన రసన్ ఒణికి పోయాడు

దాయమ్మా! వద్దు దాయమ్మా!– మమ్మల్ని వదిలి నువ్వు ఒంటరిగా వెళ్తే రాజావారు ముందు నిన్ను వురితీయిస్తారు! మామూలుంగా నీ ప్రాణాలు పోవడం మేం సహించలేం అన్నాడు ఏడుస్తూ

చల్లగా నవ్వింది దాయమ్మ

అదంతా నాకొదిలెయ్యండి రసన్! రాణీగారు నమ్మేలా నేనేదో ఓ కథ అల్లి చెప్తానుగా అంది

ఊహూఁ! నాన్నగారి సంగతి నాకు తెలుసు అంతతేలిగ్గా ఎవర్నీ క్షమించరు నీకట్టు కథలూ నమ్మరు! నేను కనిపించక పోవడంతో కథంతా బైట కొస్తుంది నీకు కచ్చితంగా మరణ శిక్షపడుతుంది అందుకే ప్రస్తుతం ఓసారి తాత గారి దివాణానికెళ్ళి రెండు రోజులుండి మన రాజ్యానికి వెళ్ళి పోదాం అంది చందన

వద్దు చందమ్మా! నా మాట విని మీరు వెళ్ళిపోండి! ఇప్పుడు మీరు వెళ్ళకపోతే జీవితంలో వెళ్ళలేరు ఇంతకన్నా మంచి సమయం రాదు నేను చెప్తున్నానుగా ముందు మీరు లేవండి కంగారుగా అంది దాయమ్మ

మొహాలు చూసుకున్నారు రసన్ చందనలు

వాళ్ళ మాటల్ని లక్ష్య పెట్టకుండా గబగబా అక్కడున్న అడవి తీగలనించి చెట్లనించి ఒడినిండా పూలు కోసుకొచ్చి చెట్టు నారనే తీసి పెద్ద పెద్ద దండలు రెండు తయారు చేసింది

వాళ్ళిద్దర్నీ దగ్గరికి తీసుకుని చెరోదండ ఇచ్చింది మనసులో ఏదో స్మరించుకుని–

దండలు మార్చుకోండి అంది

అప్రయత్నంగా వాళ్ళిద్దరూ దండలు మార్చుకున్నారు

ఆశ్చర్యానందాలతో చూస్తున్న ఇద్దర్నీ చెరో చేత్తో పొదివి పట్టుకుని–

ఇక నించీ మీరిద్దరూ దంపతులు! నిండా నూరేళ్ళూ హాయిగా కలిసి బతకండి అంటూ దీవించింది దాయమ్మ

ఆమె కళ్ళలో వేయి చంద్రుల కాంతి తొంగి చూస్తోంది

చందన రసన్ నీళ్ళు నిండిన కళ్ళతో వంగి ఆమె పాదాలకి నమస్కరించారు

మళ్ళీ వాళ్ళిద్దర్నీ అక్కున చేర్చుకుంది దాయమ్మ

దాయమ్మా! నీ మేలు ఈ జన్మలో నేకాదు ఎన్ని జన్మలెత్తినా తీర్చుకోలేం దాయమ్మా! గద్గదస్వరంతో అంది చందన

ఒక్క తీర్చుకోవచ్చు! కొంటెగా అంది దాయమ్మ

నూతన దంపతులు కుతూహలంగా చూశారామెకేసి

మీ కొడుకు పుడితే నాపేరు పెట్టుకోండి!

దాయమ్మనా? నవ్వుతూ అన్నాడు రసన్

అవును! ఏం బాగలేదా? పోనీ కూతురు పుడితే

ఛ! పోదాయమ్మా! సిగ్గుపడి పోయిన చందన దాయమ్మ ఎదలో తలదాచుకుంది

ఆనందమో ఆవేదనో తెలియనట్టు ముగ్గురి హృదయాలూ బరువుగా అయి పోయాయి

అయిదు నిమిషాల తర్వాత–

మరి నేనింక వెళ్ళనా? అంది దాయమ్మ

# రచయిత్రి జవాబులు



## ఉత్తమ ప్రశ్న

అభినయ రాయవరం

ప్ర నేడు వస్తున్న చాలా నవలల్లో 'కథా శిల్పాన్ని' శైలి డామినేట్ చేస్తోందని నా అభిప్రాయం మరి మీరేమంటారు?

■ నిజమే కానీ ఒకో రచన విషయం ఏం లేకపోయినా శైలినిబట్టి హాయిగా సాగిపోతుంది కొన్ని రచనలు శిల్పం వున్నా పేజీ ముందుకి జరగదు.

మిక్కిలినేని అర్జునరావు బొంబాయి

ప్ర సువర్ణా కన్నన్‌గారూ! నేను కూడా చిన్నప్పుడు తోటలో మామిడి జామ, సపోట, నారింజ లాంటి పళ్ళు దొంగతనం చేసేవాణ్ని. కానీ తేనెఫలం అన్న పండు పేరైనా విన్లేదు. అది ఏం పండో చెప్పగలరా?

జ మీకు తెలియదా! అవి రాజా పాంధూ వాళ్ళ తోటలో తప్ప వుండవు అంటే వందనా వాళ్ళ తోటలో నన్నమాట తేనెఫలాన్ని గురించి తెలుసుకోవాలన్న కుతూహలంతో అక్కడి కెళ్ళేరు! చాలా డేంజర్!!

కె వి ఎస్ ప్రసాద్ కందుకూరు

ప్ర : విఠలాచార్య చిత్ర లని ఎగతాళి చేస్తూనే, అంత కంటే ఘోరమైన ఇంగ్లీష్ చిత్రాలని తెగ మెచ్చుకునే ఆంధ్ర పాఠకులకు జానపద, చారిత్రాత్మిక సాహిత్య విలువలు తెలుస్తాయంటారా?

జ అంతకంటే ఘోరమైన అంటున్నారు. అంటే విఠలాచార్య చిత్రాలు ఘోరం అని మీరే అంటున్నట్టుంది కానీ చిన్నప్పుడు మేం ఎంత ఇష్టంగా చూసేవాళ్ళమో ఆ సినిమాలు!

కె. ఆంజనేయకుమార్, విజయవాడ

ప్ర : మీరు రాసేది పాఠకుల కోసమా?, మీ తృప్తి కోసమా? (2) కథలోని కథనమే రచయిత్రి స్థాయిని నిర్ణయిస్తుందనడం ఎంతవరకు సమంజసం? (3) జీవితం బుద్బుదప్రాయమంటారు, అనంతమైందనీ అంటారు. ఏది నిజం!

జ : (1) నా తృప్తి కోసమే! (2) నూటికి నూరు పాళ్ళూ! (3) రెండూ నిజమే! అయితే కాస్త తేడా, జీవితం బుద్బుదప్రాయమే. కానీ జీవించి వుండగా చేసే మంచి పనుల వల్ల వచ్చే ఖ్యాతి అనంతం!

పి. ఎస్. నిసర్బాషా, గుంతకల్

ప్ర: నేటి సాహిత్యం? కామెంట్ ప్లీజ్!

జ : కలగూరల గంప!

టి. రేవతీ కృష్ణమూర్తి, యాగిక్షారం

ప్ర : (1) స్వాతంత్ర్యం ఎవరి కొచ్చింది? (2) రవి (సూర్యుడు) రచయిత, వీరిలో ఎవరు గొప్ప? (3) నేను రాసిన నవల మీరు చూస్తారా?

జ : (1) అంగబలం, అర్థబలం వున్న వాళ్ళకి (2) రవికి, రచయితకి సహస్రాంతం తేడా వుంది. రవి "అనంతం" అయితే రచయిత అణువు. మీ మూడో ప్రశ్న నాకు అర్థం కాలేదు.

ఫనాజ్ అలా, జహిదా, ఫాతిమా, మెహరున్నిసా, మంథిని.

ప్ర: 1. 'మంజీరనాదం' సీరియల్ యదార్థమా లేక కేవలం కల్పితమా? 2. 'ప్రేమకు మరణం లేదు' అని మేమంటాము. మరి మీరేమంటారు?

జ: 1. నూటికి నూరుపాళ్ళూ కల్పితం 2. నేనన్న తర్వాతే మీరన్నారు అంటాను.

ఇ. ఎస్. హరిబాబు, పాకాల.

ప్ర: పాలి భాష ఏ కాలంలో వుండేదో కాస్త వివరిస్తారా!

జ: గౌతమబుద్ధుడి కాలంలో వుండేది

కొల్లి శ్రీదేవి వైజాగ్

ప్ర: 1. పాఠకులకు మంచి సీరియల్ అందిస్తున్నాను అనే తృప్తి మీరు ఏ సీరియల్లో పొందారు. 2. మంజీరనాదంలో అరవింద్‌తో కాంతిని పంపించడానికి కాంతి తండ్రి అంగీకరించాడు కానీ నిజ జీవితంలో అది అసాద్యం అంటాను

జ: 1. ప్రభ (డైలీ)లో వచ్చిన పరాదీన అన్న నవలలో. 2. అసాధ్యం కాదుగానీ అరుదు

ఎస్. రాజి, ఒరిస్సా

ప్ర: ప్రియమైన రచయిత్రిగారూ! మీ నవలల్లో హీరోయిన్స్‌కి ధైర్యం సాహసం పూర్తిగా పోస్తున్నారు నిజ జీవితంలో మీ హీరోయిన్లలాంటి అమ్మాయిలు ఎదురైతే అభిమానిస్తారా లేక సాధారణ గృహిణిలా ఈ సాహసాలు నీకెందుకమ్మా ఆడపిల్లవి' అంటారా!

జ: అభిమానించడమే కాదు అభినందిస్తాను కూడా.

చెట్టా రమణి మోహన్ కడప

ప్ర: స్త్రీకి గానీ పురుషునిగ్గానీ సంస్కారం అన్నది విద్య వల్ల వస్తుందంటారా?

జ: సంస్కారానికి విద్య కొలబద్ద ఎప్పుడూ కాదు

కొత్తపల్లి సాంబశివరావు జానపాడు

ప్ర: మీరే వుద్దేశ్యంతో రచనా వ్యాసంగాన్ని చేపట్టారు. అదెంత వరకు నెరవేరింది?

జ: సరదాగా పొద్దు పోవడం కోస రచనలు చెయ్యడం మొదలు పెట్టాను అదెంత వరకు నెరవేరిందో మీరు చెప్పాలి 

దీనంగా చూశారిద్దరూ

దాయమ్మ వాళ్ళిద్దర్నీ పొదివిపట్టుకుని తలల మీద ముద్దు పెట్టుకుం--

కష్టమైనా సుఖమైనా సమంగా పంచుకోండి స్వర్గమైనా నరకమైనా బ్రతుకైనా మృత్యువైనా విడిపోకుండా ఒకటిగా బతకండి! ఇదే ఈ మీ దాయమ్మ ఆశీస్సు కోరికా కూడా!" దాయమ్మ కంటినించి అశ్రువులు టప టపమంటూ వాళ్ళ తలల మీద పడ్డాయి

మరి నేనొస్తాను కంపిస్తున్న స్వరంతో అంది దాయమ్మ మౌనంగా తలలూపారిద్దరూ

ముగ్గురి కళ్ళూ ధారలై వర్షిస్తున్నాయి

దాయమ్మ నాలుగడుగులు వేసి మళ్ళీ వెనక్కి తిరిగి రెండు చేతులూ జోడించి ఆకాశం కేసి చూస్తూ--

భగవాన్! 'ఈ ప్రేమికుల్ని ఎప్పుడూ విడదియ్యకు' ఇంతకన్న నాకింకే వరమూ అక్కర్లేదు గొణిగినట్టు అంది

పుచ్చపువ్వులాంటి వెన్నెల కిరణాలతో పరిసరాలన్నింటినీ అందంగా ఆహ్లాదకరంగా మలుస్తున్నాడు చంద్రుడు

మరోసారి వాళ్ళకి చెప్పి మెల్లగా వూరుకేసి నాలుగడుగులు వేసింది దాయమ్మ కొండదిగడానికి

మసకబారిన కళ్ళతో బరువెక్కిన హృదయాలతో అలా చూస్తుండి పోయారు ప్రేమికులిద్దరూ ఓ సారి వెనక్కి తిరిగి చిన్నగా నవ్వుతూ చెయ్యి వూపింది దాయమ్మ వాళ్ళూ వూపారు

దాయమ్మా! వెనకనించి పిల్చింది చందన

క్షణం ఆగింది దాయమ్మ

అమ్మని క్షమించమను!

అలాగే నవ్వింది దాయమ్మ కదులుతూ

నిల్చున్న చోటే కూలబడి పోయింది చందన

ఆమెని సముదాయిస్తున్నట్టు పక్కన కూర్చుని ఆమె తల మీద చెయ్యి

# మంజీరనాదం

వేశాడు రసన్

వెక్కి వెక్కి ఏడుస్తున్న ఆమెని వూరడిస్తూ దాయమ్మ కేసి చూశాడు

తృళ్ళిపడ్డాడు

కారణం దాయమ్మ దారి తప్పినట్టుంది మరోవైపు నడుస్తోంది

దాయమ్మా! అరిచినట్టు అన్నాడు

అతని అరుపుకి కిందకూలబడిన చందన దూరంగా వున్న దాయమ్మ కూడా కంగారుగా చూశారు

దాయమ్మా! అటు దారికాదు! అది చాలా ప్రమాదమైన చోటు! కంగారుగా అరిచాడు రసన్

చందన గుండె కూడా వేగంగా కొట్టుకుంది

దాయమ్మా! అలా వెళ్తే కిందపడిపోతావ్! ఇలా వెళ్ళు అంది కంగారుగా అరుస్తూ

దాయమ్మ జవాబుగా నవ్వింది తిరిగి నడక ప్రారంభించింది

రసన్! ఏమిటి దాయమ్మ అటెళ్తోంది? ఏడుస్తూ అంది చందన

రసన్‌కేదో అనుమానం వచ్చింది

కళ్ళు ముడుచుకున్నాయి క్షణం ఆలస్యం చెయ్యకుండా దాయమ్మా! ఆగు అంటూ అరుస్తూ అటు కేసి పరిగెత్తాడు చందనకూడా విషయం అర్థంకాక అతని వెంట పరిగెత్తింది

చిత్రంగా దాయమ్మ కూడా పరిగెత్తింది

రసన్ గుండె ఆగుతున్నట్టయింది

దాయమ్మా! ఆగు! అక్కడికి పోతే మామీద ఒట్టే గొంతు చించుకుని మరీ అరిచాడు

ఆమె గలగల నవ్వింది

ఆమె నవ్వు నీళ్ళ హోరులో కలిసిపోయింది

రసన్ వేగంగా అటుకేసి పరుగెడుతూనే వున్నాడు వాళ్ళిద్దరికీ మధ్య ముప్పయ్యడుగులు మాత్రమే దూరం వుంది మరో అరనిమిషంలో కొండఅంచుకు చేరుకుంది దాయమ్మ ఓ సారి వెనక్కి తిరిగి చూసి

సెలవు రసన్! చందమ్మా! సెలవుతల్లీ! మీరిద్దరూ నూరేళ్ళూ హాయిగా వుండండి అంటూ అంత ఎత్తునుంచి లోయలోకి దూకేసింది దాయమ్మ

ఠక్కున ఆగిపోయాడు రసన్

కొయ్యబారి పోయింది చందన

జరిగిందేమిటో గ్రహించడానికి కొన్ని క్షణాలు పట్టింది ఇద్దరికీ

దాయమ్మా! దిక్కులు పిక్కటిల్లేలా అరుస్తూ పరిగెత్తబోయిన చందనని చటుక్కున చెయ్యి పట్టి ఆపేశాడు రసన్

కొండరాళ్ళు తగిలి పగిలిపోయిన దాయమ్మ తలనించి చిందిన రక్తాన్ని తనలో కలిపేసుకుంటూ పూలు ఆకులతో పాటు ఆమె పుణ్యశరీరాన్ని కూడా పల్లానికి పుత్సాహంగా లాక్కుపోయింది భూమికి దిగిన ఆకాశగంగ

* * * * * * * * *

వెళ్ళగానే వివరంగా లేఖరాసి మనిషికిచ్చి పంపుతానని దాయమ్మ మమతాదేవికి వాగ్దానం చేసింది కానీ ఆమె చందనని తీసుకెళ్ళి అప్పుడే ఇరవై రోజులు దాటిపోయింది ఇంతవరకూ ఆమె దగ్గర్నించి ఎలాంటి కబురూ రాకపోవడంతో మమతాదేవికి కంగారుగా వుంది

ఒకటి రెండు సార్లు రాజావారూ అడిగాడు కూతుర్నిగురించి అయితే ఏవేవో కథలల్లి చెప్తోంది భర్త తమ పుట్టింటికెళ్తే విషయం ఎక్కడ బైట పడుతుందో అని అతని ప్రయాణాన్ని ఎన్నోసార్లు తెలివిగా ఆపింది- అయితే అది ఇంక ఎక్కువ రోజులు కుదరదని గ్రహించింది

ఆమెకి దడగావుంది

చందననీ దాయమ్మనీ కూడా తిట్టుకుంది ఉత్తరం రాయనందుకు

ఆమె భయపడ్డంతా అయింది

కూతురి మీద బెంగగా వుందని భర్త బయల్దేరతాననే సరికి ఆమె పై



ప్రాణాలు పైనే పోయాయి అయితే రాత్రే ఆమె అన్న బగత్ వూడ పడ్డాడు అదీ రాజా పాండూ ఇంటలేని సమయంలో

మమతాదేవి ప్రాణం లేచొచ్చింది అన్నగార్ని గదిలోకి లాక్కెళ్ళింది

చందనెలావుంది? అంది రహస్యంగా

చందనా?" అతను తెల్లబోయాడు.

చందన అక్కడికొచ్చిందిగా?"

చందన అక్కడికి రావడం ఏవిఁటి మమతా?"

దానికంతా ఓ కథుందిలే!.... కానీ ఓసారి మనింటికి తీసుకెళ్ళి ఆ తర్వాత తీసకెళ్తానందే దాయమ్మ!" తనలో తాను అనుకున్నట్టు అంది మమతాదేవి.

దాయమ్మేవిఁటి. చందాని తీసుకురావడం ఏవిఁటి. అసలు చందా మన ఇంటికొస్సైనా రాలేదు. అసలు మన రాజ్యం తను వచ్చినట్టే మా కెవరికీ తెలియదు! అన్నాడు భగత్.

ఒణికిపోయింది మమతాదేవి.

ఎం జరిగింది మమతా?" అనునయంగా అన్నాడు భగత్.

మమతాదేవి ఏడుస్తూ వున్నదున్నట్టు చెప్పింది.

నిర్ఘాంత పోయాడతను.

వెంటనే కళ్ళు చిట్లించి ఆలోచనలో పడ్డాడు.

అన్నగారి మౌనం ఆమెని మరీ ఒణికించింది.

అన్నయ్యా.... ఏం జరిగుంటుందంటావ్?" అంది బేలగా.

నువ్వు చాలా పొరపాటు చేశావమ్మా!" మెల్లగా అన్నాడతను.

నిజమే అన్నయ్యా! ఇప్పుడు నాకూ అలాగే అని పిస్తోంది. కానీ దాని పరిస్థితి నువ్వు చూడలేదు. చాలా దారుణంగా తయారయింది. చివరికి ఆరసన్ కోసం ప్రాణాలు తీసుకోవడానిక్కూడా సిద్ధ పడింది. దాని మనసుని వేరే వైపుకి మళ్ళించాలని....." బాధగా అంది మమతాదేవి.

నిజమేనమ్మా!.... కానీ దానికిదా మార్గం? ఏదో పసితనం వల్ల ఆ రసన్ అంటే ఇష్టపడిందే అనుకో. మెల్లగా నచ్చచెప్పాలిగాని బావగారికి తెలియకుండా ఇంత సాహసం చేస్తావా? ప్చ్! ఏం బాగాలేదమ్మా!" గంభీరంగా అన్నాడు బగత్.

అవునన్నయ్యా!.... నాకేదో దెయ్యం పట్టింది! మీ బావగారి స్వభావం తెలిసిన నేను అమ్మాయిని ఆయనకి తెలియకుండా దేశమే దాటించానంటే! ఛ..... నాకే సిగ్గుగా వుంది. అసలిదంతా ఆ దాయమ్మ మూలానే జరిగింది!..... ఇప్పుడు చూడు పీకల మీది కొచ్చింది. మీ బావగారు చందాకోసం మనింటికి బయల్దేరాలనుకుంటున్నారు!.... ఏంచెయ్యాలా అని హడిలి పోతున్నాను. ఆ బగవంతుడే పంపినట్టు నువ్వొచ్చావ్!" అంది మమతాదేవి గద్గదస్వరంతో.

తృళ్ళిపడ్డాడు బగత్

అయితే ఇప్పుడేం చేద్దాం? అన్నాడు కంగారుగా

ఏం లేదు చందనని నేనే తీసుకొచ్చిదించుతానని చెప్పు మీ బావగారికి!

తరవాత?

వెంటనే నువ్వెళ్ళి చందనని తీసుకొచ్చెయ్యి!

ఎక్కణ్ణుంచి?

అదేవిఁటన్నయ్యా! దాయమ్మ వూరు ఇల్లు నీకు తెలుసుగా?

అయితే చందన ఇంకా ఆదాయమ్మ ఇంట్లోనే వుందని నీ అనుమానమా?

దాయమ్మ ఇంట్లో లేక పోయినా గాలి మార్పుకోసం ఆ ప్రాంతాల్లోనే ఎవో సుందర ప్రదేశాలకి తీస కెళ్తానని చెప్పింది నువ్వెళ్తే అన్ని విషయాలూ తెలుస్తాయి

ఊఁహుఁ! నాకా నమ్మకం లేదు! భారంగా అన్నాడతను

అంటే? తడారిపోతున్న గొంతుతో అంది మమతాదేవి

నా వుద్దేశం చందన దాయమ్మ దగ్గరలేదు!"

న్నయ్యా! కంగారుగా అందామె

అవును మమతా! నాకో అనుమానం వుంది!

ఎవిఁటన్నయ్యా?

రసన్ అక్కడే వున్నాడుగా

అయితే?

"తనూ రసన్ దగ్గరే వుండి వుంటుంది!"

"అన్నయ్యా" కోపంగా అంది మమతాదేవి

"ఆవేశపడకు మమతా!..... ఇప్పుడు ఆవేశం కాదు కావల్సింది ఆలోచన!

"అన్నయ్యా!..... ఎంతయినా చందన నా రక్తం పంచుకుని పుట్టిన బిడ్డ! ఇంత నీచమైన పనిచేసి నాకు తలవంపులు తేదు! అంది మమతాదేవి బాధగా

అతను జాలిగా చూశాడామెకేసి. ఆచూపుని భరించలేక పోయిందామె

"అన్నయ్యా!.... రసన్ మీ కళ్ళెదుట వుండి చిత్రాలు చిత్రిస్తున్నాడు అవునా?" గంభీరంగా అంది.

"అవును!"

"అలాంటప్పుడు నీకీ అనుమానం ఎందుకొచ్చింది?

"అంటే?"



"రసన్ ప్రతిక్షణం మీక్కనిపిస్తూనే వుంటాడనీ, వూరి పొలిమేర ఎక్కడా దాటడనీ ఆమధ్య నాన్నగారు లేఖ రాశారు అదేనిజమైతే చందన అతని చాయలకెలా వెళ్ళగలదు? దాయమ్మ మన ఇంటిదాన నాకు తల్లిలాంటిది అలాంటి దాయమ్మ నాకు ద్రోహం చేస్తుందా? ఆవేదనగా అంది మమతాదేవి

అలాగే అనుకుందాం! ఒక వేళ రసన్ మన వూళ్ళో లేక పోతే రసన్ దగ్గరికి ఆమె వెళ్ళడానికి అపకాశం వుందా? అన్నాడు బగత్

మమతాదేవి మాట్లాడలేదు

మమతా! మెల్లగా అన్నాడతను

ఆమె తలెత్తి చూసింది

ఓ మాట చెప్పనా?

ఏవిఁటి?

ఇప్పుడు రసన్ అక్కడ లేదు

ఏవిఁటి! ఎదుగు పడ్డట్టు చూసింది మమతాదేవి

అవును అతను వున్నట్టుండి మాయమైపోయాడు భారంగా అన్నాడు బగత్

అంతే! కళ్ళు తిరిగి పడిపోయింది మమతాదేవి

(ఇంకా ఉంది)

# వ్యక్తిగతం

## కాంగ్రెస్ (ఐ)కి మద్దతా?

రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ ప్రకటనలు సాధారణంగా వివాదాస్పదంగా మారుతుంటాయి మహాత్మా గాంధీని హత్య చేశారన్న ఆరోపణ నుంచి అత్యవసర పరిస్థితిని సమర్థించడం వరకు ఆర్ ఎస్ ఎస్. అధినేతల ప్రకటనలు తీవ్ర విమర్శలను ఎదుర్కొన్నాయి ప్రస్తుతం సంఘ్ స్థాపన దినమైన విజయదశమి నాడు శ్రీ బాలా సాహెబ్ దేవరస్ చేసిన ప్రకటన చాల సందేహాలను రేకెత్తిస్తున్నది. ఆయన ఆ ప్రకటనలో "కాంగ్రెస (ఐ)కి సరైన ప్రత్యామ్నాయం రూపొందే అవకాశం లేదని" అభిప్రాయపడ్డారు. పరోక్షంగా ఇది కాంగ్రెస్ (ఐ)కి మద్దతు ప్రకటించడమేనని, శ్రీ విపిసింగ్‌తో



పొత్తు పెట్టుకోగూడదని భారతీయ జనతా, పార్టీని హెచ్చరించడానికే ఆయన ఈ ప్రకటన చేశారని విమర్శలు చెలరేగుతున్నాయి

## ఇల్లొదలనంటున్న వి పి. సింగ్!

శ్రీ విశ్వనాథ ప్రతాప్ సింగ్ ప్రధాన మంత్రి ఆదరణను మంత్రిత్వ పదవిని వదులుకున్నారు గాని మంత్రిగా పొందిన ఇంటిని కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా పొందిన పార్లమెంటు సభ్యత్వాన్ని వదులుకో లేదేమని



కాంగ్రెస్ ఐ ప్రధాన కార్యదర్శి ప్రశ్నిస్తున్నారు. ప్రధాని ఇంటికి సమీపంలో గల తీన్‌మూర్తి రోడ్‌లో ఒకటో నెంబరు విశాలమైన భవనాన్ని శ్రీ వి. పి. సింగ్ మంత్రిగా ఉన్నప్పుడు కేటాయించారు. ఇప్పుడు ఆ ఇల్లు ఖాళీ చేసి మరొక చిన్న ఇంటికి వెళ్ళాలని, పార్లమెంటు సభ్యత్వాన్ని వదులుకోవాలని శ్రీ గులాంనబీ ఆజాద్ రాశారట. మంత్రివర్గం నుంచి వైదొలగిన శ్రీ వి. ఎన్. గాడ్గిల్, శ్రీ అరుణ్‌సింగ్, శ్రీ ఘనీఖాన్ చౌదరి, శ్రీ ఆరిఫ్ మహమ్మద్‌ఖాన్, శ్రీ అరుణ్ నెహ్రూ, శ్రీ వి. సి. శుక్లాలు కూడా పాత ఇళ్ళను ఖాళీ చేయలేదు గదా అని శ్రీ వి. పి. సింగ్ జవాబిచ్చారట....

## స్వామినాథన్‌కు మరొక బహుమతి

మనదేశంలో హరిత విప్లవ నిర్మాత, ప్రణాళికా సంఘం మాజీ సభ్యుడు శ్రీ ఎం. ఎస్. స్వామినాథన్ గతంలో



సాధించిన ఎన్నో ప్రతిష్ఠాత్మక బహుమతులకు తోడుగా ఈ సంవత్సరం జనరల్ ఫుడ్స్ వరల్డ్ ఫుడ్ ప్రైజ్ పొందారు. ప్రతిష్ఠాత్మకమైన ఈ బహుమతి నోబెల్ బహుమతితో సమానమైనది. స్మిత్సోనియన్ ఇన్‌స్టిట్యూట్‌లో శ్రీ స్వామినాథన్‌కు ఈ బహుమతితో పాటు అమెరికా అధ్యక్షుడు రొనాల్డ్ రీగన్, నోబెల్ శాంతి బహుమతి గ్రహీత నార్మన్ బోర్లాగ్, ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యదర్శి జేవియర్ పెరెజ్ డిక్యులర్ ఇచ్చిన ప్రశంసా పత్రాలను కూడా అందజేశారు. ఈ బహుమతి విలువ రెండు లక్షల డాలర్లు. శ్రీ స్వామినాథన్ ప్రస్తుతం ఫిలిప్పైన్స్‌లోని మనిలాలో అంతర్జాతీయ పరిశోధనా సంస్థకు డైరెక్టర్ జనరల్‌గా ఉన్నారు...

## పాదయాత్రకు తారు అడ్డంకి!

రాజకీయవేత్తగా పెద్ద అనుభవం లేక పోయినా తండ్రి కీ. శే. చరణ్‌సింగ్ చలువతో పార్టీ అధినేత అయిన శ్రీ



అజిత్‌సింగ్ ప్రజాభిమానాన్ని చూరగొనేందుకు చాలా ప్రయత్నాలు చేస్తున్నారు. ఆ ప్రయత్నాలలో భాగంగానే ఉత్తర ప్రదేశ్‌లోని ఆటావా జిల్లాలోని బందిపోటు పీడిత ప్రాంతాలలో ఆయన పాదయాత్రకు సంకల్పించారు 500 మంది లోక్‌దళ్ అనుచరులతో యాత్రకు బయల్దేరిన శ్రీ సింగ్‌కు ఆదిలోనే హంసపాదు ఎదురైంది శ్రీ సింగ్‌కు ప్రదాన ప్రత్యర్థి లోక్‌దళ్ (బహుగుణ) రాష్ట్ర నాయకుడు శ్రీ ములాయాసింగ్ యాదవ్ మనుషులు ఈ పాద యాత్రికుల దారిలో ఒక టాంకర్ నిండా తారు తెచ్చి వెద జల్లారట ఒకటిన్నర కిలో మీటర్ల దూరం రోడ్డు నిండా తారుండడంతో పాద యాత్ర ఆగి పోక తప్పలేదు

## నరహంతక ధరాధిపతికి విడాకులు

"నేను నరమాంసాన్ని రుచి చూశాను కాని ఉప్పుగా ఉంటుందంతే అని



బహిరంగంగా చెప్పిన ఉగాండా మాజీ అధినేత ఇదీ అమీన్ మళ్ళీ ఒకసారి వార్తల్లోకొచ్చాడు. ఉగాండాలో సైనిక తిరుగుబాటు జరిగి అమీన్ పదవీ చ్యుతుడై పారిపోయిన తర్వాత ఆయనతో విడిపోయిన సారా అమీన్ మూడు సంవత్సరాల తర్వాత ఇప్పుడు పశ్చిమ జర్మనీలోని బాన్ నగరంలోని న్యాయస్థానంలో విడాకులకై దరఖాస్తు చేసింది సారా వయసు 32 సంవత్సరాలు □

## స్టేషన్‌మాస్టర్ లో ప్లేటు పిరాయింపు

అమ్మగారూ అమ్మగారూ!

తలుపులు (వేలు) కేకలు విని లక్ష్మి (అన్నపూర్ణ) వెనుదిరిగి కటికీ దగ్గరకొచ్చి విస్తుపోయింది

ఎంటీ తలుపులూ! ఎం జరిగింది?

ఎం లేదమ్మా! ఎదో రాత్రి రాత్రి కొంచెం తాగొచ్చానని నా పెళ్లాం నన్ను గదిలో పెట్ట తాళం వేసిందండీ. రాత్రంతా నేల మీదే తొంగున్నాను. నొళ్ళంతా ఒకటే నొప్పులు. అసలు గదిలో పెట్టి తాళం వెయ్యడానికి నేనేమన్నా కుక్కనా, నక్కనా. పందినా, పిల్లినా? విడాకులకు కూడా సిద్ధంగా ఉన్నాను".

ఇంతలో అటు వచ్చిన పోలమ్మ (వై. విజయ)ను చూసి లక్ష్మి "ఏమే, పోలమ్మా! నిజమేనా? నీకు బుద్ధి లేదే! మొగుడ్ని అలా వేసెచ్చా? వాడక తాగటానిక ఇచ్చేది నువ్వే తాళం వేసేది నువ్వేనా? ఛీ- ఛీ!" అని కోప్పడంది

పోలమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి అది చూసి తలుపులు ఎంటమ్మగారూ అంత గట్టిగా తిట్టేస్తున్నారు? ఎదో కేకలెయ్యమన్నాను గాని ఇంత గట్టిగా కేకలెయ్యమన్నానా? దాని మొగుడ్ని తాళం వేసే హక్కు దానిక లేకపోతే, పక్కింటి వాళ్ళకుంటుందా? రావే పోతీ పోదాం" అన్నాడు.

"మామా, సాయంత్రం తొందరగా రా! నీకోసం పెసరట్టు, కల్లు సిద్ధం చేస్తాను", అంది పోలమ్మ.

నిర్ఘాంతపోయిన లక్ష్మి వంక అప్పుడే వచ్చిన మధు (రావుగోపాలరావు) చూస్తూ-

"ఇదిగో, లక్ష్మీ! పులి నోట్లో తలకాయ పెట్టినా ఫరవాలేదు.... బ్రతుకుతావు. కాని, మొగుడూ పెళ్లాల మధ్య తలదూర్చితే ఇలాగే అవుతుంది" అన్నారు.

కోడి రామకృష్ణ దర్శకత్వంలో ఎస్. జయరామారావు నిర్మాణ సారధ్యం వహించిన ఆర్. జె. ఆర్. ప్రొడక్షన్స్ వారి "స్టేషన్ మాస్టర్" చిత్రానికి ఎస్. అంబరీష్ నిర్మాత.

## "దొంగ కాపురం"లో చలపతి ఆగమనం

భారతి (రజని)ని చూడ్డానికి చలపతి (డి. పి. రాజు) ఆ ఇంట్లోకి "బారూ! బారూ!" అంటూ ప్రవేశించాడు అరిటిపళ్ళ గెలతో.

హాలులో ఉన్న సుందరమూర్తి (గొల్లపూడి)కి చిరాకేసింది. "అబ్బా! మందు మానేసి నేనేడుస్తూంటే, బారూ బీరూ అని గావు కేకలేమిటయ్యా, బాబూ! పొద్దున్నే నల్ల కాకి అరిసినప్పుడే అనుకున్నానయ్యా ఆ జాతివాడెవడో వస్తాడని... అవునూ- పుస్తకాలు అమ్ముకోవడం మానేసి, పళ్ళు అమ్ముకుంటున్నావా?"

"పళ్ళు అమ్ముకోవల్సిన ఖర్మ నాకేం పట్టిందండి? భారతిని చూసి పోదామని వచ్చాను. వట్టి చేతులతో రావడం ఇష్టం లేక ఈ పళ్ళు తీసుకొచ్చాను. ఈ మధ్యన మన కలరు కొంచెం ఎరుపెక్కిందిగా అందుకే గుర్తు పట్టలేకపోయారు," అన్నాడు చలపతి ధీమాగా.

"పళ్ళు రాలిపోతాయి జాగ్రత్త!" అరిచాడు సుందరమూర్తి.

"ఆఁ!" త్రుళ్ళిపడ్డాడు చలపతి.

"అదేనయ్యా! ఈ అరటి పళ్ళు రాలిపోతాయి. కాస్త జాగ్రత్తగా దింపు అంటున్నాను," అన్నాడు సుందరమూర్తి.

"హమ్మయ్య," అనుకున్నాడు చలపతి.

కళ్యాణచక్రవర్తి హీరోగా కోడి రామకృష్ణ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తయారయ్యే నవభారత్ ఆర్ట్ మూవీస్ "దొంగ కాపురం" చిత్రానికి డి. ప్రతాప్‌రాజు నిర్మాత □

# అసలు, మేంగోషేక్ ఎక్కడైనా కారంగా ఉంటుందా?



ఉండకూడదుమరి. కాని ఒకే ఒక జార్‌గల మిక్సర్‌లో చేస్తే అలాగే ఉంటుంది.

ఈ సంగతి తెలిసి ఉండే, గోపి కంపెనీలోని మేము లిక్విడైజింగ్, వెట్ గ్రైండింగ్ డ్రై గ్రైండింగ్ వంటి వేరు వేరు పనులకుగాను మూడు విడి విడి జార్‌లు సమకూర్చాము దీనివల్ల వివిధ ఆహారపదార్థాల రుచులు కలిసిపోకుండా ఉంటుంది. అంతేకాకుండా, ఒకే జార్‌లోని బ్లేడ్‌లతో అన్ని పనులు సరిపెట్టుకునే బదులు, విడి విడి జార్‌లను ఉపయోగిస్తే మరింత సులువుగా ఉంటుంది.

## 100% సురక్షితమైనది, షాక్‌ప్రూఫ్

మీరు తడిచేతులతో పనిచేసినా కూడా గోపి, పూర్తిగా సురక్షితమైనది, షాక్‌ప్రూఫ్ ఎంతో సులువుగా, అనువుగా పనిచేయించవచ్చును ఒక్క మాటలో చెప్పాలంటే, గోపి కిచెన్ మెషీన్‌ని గృహిణుల భద్రతని, సులువుని ముఖ్యంగా దృష్టిలో ...ఉకుని రూపకల్పనచేసి, తయారుచేశారు.

## ...గా పనిచేసేందుకు అత్యంత దృఢమైన మోటారు

...థమిక మెషీన్‌ని వీలైనంత ఎక్కువ దృఢంగా ఉండే మోటారుతోను, కప్లింగ్ వ్యవసతోను డిజైన్ చేశారు. దినివల్ల అది, అనేక అటాచ్‌మెంట్‌ల లోడ్‌ని. యితర ఒత్తిడులను బాగా తట్టుకుని, పనిచేస్తుంది.

మరింత అధునాతన జీవన శైలిగల గృహిణులకుగాను, కావాలనుకుంటేనే తనుకునేందుకు, మేము అనేక రకాల అటాచ్‌మెంట్‌లను సమకూరుస్తున్నాం. ఉదాహరణకు: సెంట్రిప్యూగల్ జ్యూసర్, సిట్రస్ జ్యూసర్, మీట్ మిక్సర్, గోదుమ పిండి కలిపే "అటా నెడర్", గైండింగ్ మిల్ కూడా ఆ విధంగా ఒకే మెషీన్, అనేక మెషీన్‌ల పనులు నిర్వహిస్తుంది.





మీరు ఒకసారి మా మెషీన్‌ని కొన్నారంటే, గోపి కంపెనీకి చెందిన మేము, అది నిత్యం చక్కగా పనిచేస్తు ఉండేలా చూడటం మా విధిగా భావిస్తాం.



Kitchen Machine

# మన సంస్కారాలు ॐ విశేషాలు

ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రి

(గత సంచిక తరువాయి)

## వీర్య సంరక్షణావశ్యకత

పైన చూపిన శాస్త్రీయ ప్రమాణ వచనాలనుబట్టి చూస్తే శుక్రం అనబడే ఈ రేతస్సు ఒక్కొక్క బిందువు దగ్గర నుంచి శక్తిమంతమై మన శరీరమంతా వ్యాపించి మొత్తం శరీరానికి బల కాంతి పుష్టి శక్తి సామర్థ్యాదులను సర్వదా కలిగిస్తూంటుందని తేలింది. ఇట్లు మన శరీర ప్రాణధారణకు మన మనుగడకు మూలమై క్షణక్షణం మన ఆనందమయ జీవికకు అత్యవసరమైన ఈ శుక్రధాతువు క్రమాభివృద్ధి చెందడానికి కావలసిన సర్వవిధ సాధన సంపద బ్రహ్మచర్య నియమ పాలనం లో మాత్రమే స్థిరంగా నిలిచి ఉన్న సంగతి స్మృతి నిదర్శనాల ద్వారా ఋజువయింది కనుక ప్రతి జీవికి ప్రాణశక్తి ప్రదమైన ఈ శుక్రధాతువు తాలూకు ఒక్క బిందువును కూడా దాని అపరిణామదశలో ఏ ఒక్కడూ నష్టపరచకూడదు. ఈ ముఖ్య ధాతువు తాలూకు బిందుపతనం జీవిత పతనం వంటిదనీ ఈ శుక్రం తాలూకు బిందు ధారణం జీవిత ధారణం వంటిదనీ వాగ్భట గ్రంథం వ్యక్తం చేసింది కదా! ఈ విశిష్ట విషయాన్ని శివ సంహిత లోని సూక్తి కూడా ఇలా అనువదించింది

మరణం బిందుపాతేన జీవితం బిందుధారణాత్!

తస్మాదతి ప్రయత్నేన కురుతే బిందుధారణం"

ఈ విధంగా సర్వవేళలా సర్వ విధాలా సర్వ ప్రయత్నాలతో చేసిన వీర్య సంరక్షణమే అనగా ఇంద్రియ నిగ్రహమే నిజమైన శాస్త్రోక్తమైన సర్వ శ్రేయస్సందాయకమైన బ్రహ్మ చర్యం అని ఎంచుకోంటుందని సారాంశంగా తేలిన సిద్ధాంతం

## వీర్య సంరక్షణ విధానం

మానవుని బంధమోక్షాలకు అతడి మనస్సే ముఖ్య కారణమౌతుందని

మన ఎవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయో అనే స్మృతి వాక్యం చాటుతూంది కనుక తన జీవిత శ్రేయస్సును కాంక్షించేవాడు తన మనస్సును దుష్ట సంకల్పాలనుండి దూరం చేసి సత్సంకల్పాలకోసి తన మనస్సును మరల్చడం ఎంతో అవసరమై ఉంది

ప్రస్తుతంలో బ్రహ్మచారియొక్క శుక్ర సంరక్షణం శుక్రపతనం అనేవి కూడా అతడి మానసిక స్థైర్యంమీదను మానసిక భావాలపైనను ఆధారపడి ఉన్నాయి దుష్ట సంకల్పాలకు మన మనస్సు అధీనమైనపుడు అట్టి చిత్తం చాంచల్యం చెంది పటుత్వం స్థిరత్వం తప్పి ఉండడం సహజం తత్ఫలితంగా స్వప్నాలలో తరచుగా వీర్యస్ఖలనం కలుగుతూండడం దాని ఫలితంగా ఆ బ్రహ్మచారి తన శారీరక మానసిక బౌద్ధిక శక్తులు క్రమంగా క్షీణించడం వంటివి మొదలై అట్టి జీవితం అనర్థ పరంపరలో చిక్కుకుంటుంది దుష్ట సంకల్పాల ప్రభావమే అంతటిది కనుకనే దుష్ట విషయాలకు చెందిన స్మరణాదులు బ్రహ్మచారికి ప్రబల శత్రువుల వంటివని తెలుసుకొన్న మహర్షులు వాటిని, ఈ వ్రత నిర్వహణ కాలంలో పూర్తిగా నిషేధించారు అట్టి దుష్ట స్మరణాదులను అష్ట విధ మైథునాలు అంటారు వాటి స్వరూపం ఇలా ఉంటుంది తరచుగా స్త్రీ సంబంధమైన స్మరణం ఆమెకు చెందిన మాటలు చెప్పనితో కలిసి ఆడుతూ నట్లు భావించడం ఆమెకు చెందిన చిత్రాలు ఆసక్తితో చూస్తూండడం ఆమెతో రహస్య సంభాషణం తత్సమ్మేళన భావనలు ఆ భావనలు మనసులో దృఢం చేయడం వాటిని క్రియా రూపంలోకి తెచ్చినట్లు భావించడం అనే ఇవి అష్ట విధ మైథునాలు అని ఆలంకారికులు ఇలా నిర్ణయించారు

స్మరణం కీర్తనం కేళి ప్రేక్షణం గుహ్యభాషణం
సంకల్పో ధ్యవసాయశ్చ క్రియా నిష్పత్తి రేవచ
ఏతన్మైథున మష్టాంగం ప్రవదంతి మనీషిణః
విపరీతం బ్రహ్మచర్య మనుష్ఠేయం ముముక్షుభిః

ఈ 8 దుష్టభావాలను తన మనస్సులోనికి రానీయక బ్రహ్మచారి ఆ దుష్ట స్మరణాదులను దూరంగా పారద్రోలి వీటికి విపరీతమైన పవిత్రవేదా ధ్యయనాదులతో తన మనస్సును నిర్మలం చేసి తన్మూలకమైన ఇంద్రియ నిగ్రహాన్ని చిత్తస్థైర్యాన్ని అలవర్చుకొని తద్వారా అతడు తన వీర్య సంరక్షణం చేసుకోవలసి ఉంది ఈ విధానం కర్తకు వీర్య పటుత్వ సంపాదకమై అదే క్రమంగా అతడి మోక్ష ప్రాప్తికి కూడా కుదురయిన కారణమౌతుంది

యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యహం

అనే గీతా వాక్యం చాటుతూంది మన పగటి భావనలే రాత్రి స్వప్నాలుగా మారి అవి తదుకు తగిన ఫలితాలనే కర్తచే అనుభవింపచేయడం మన అనుభవంలో నిదేకదా!

కనుక బ్రహ్మచారి తన బ్రహ్మచర్యాశ్రమానికి విరుద్ధమైన దుష్ట స్మరణాదులను పూర్తిగా వర్జించి ప్రతిదిమల పవిత్ర భావనా ప్రేరకాలైన వేదాధ్యయన అధశ్శయన భిక్షాచరణ క్షారలవణవర్జన సాత్వికాహారాది కఠోర బ్రహ్మచర్య వ్రత నియమ పాలనంతో తన మనస్సును ఇంద్రియాలను నిగ్రహించడం ద్వారా వాటిని తన స్వాధీనంలోనికి తెచ్చుకోవడమే వీర్య సంరక్షణమునకు శాస్త్రోక్త విధానమని విశదమయింది ఇంకా దీని సంరక్షణకు ఉపయోగించే ఎన్నో శాస్త్రీయ ప్రక్రియలను మన మహర్షులు లోక శ్రేయస్సంపాదన ధ్యేయంతో ఈ ప్రథమాశ్రమానికి ఆధారమైన ఉపనయన



సంస్కారాంతబాగంలో శాసన రూపంలో విదించారు

(బ్రహ్మచార్యస అపోశాన కర్మ కురు మానుషుత్వాః

(దివాబాగే) బిక్షా చర్యం చర ఆచార్యా దీనోబవ మొదలైనవి)

ఈ ప్రక్రియలన్నీ బ్రహ్మచర్య వ్రత నియమ పాలనకు పరమ సహకారులై బ్రహ్మచారియొక్క ఇంద్రియ నిగ్రహ రూప క్రియా సిద్ధికి పూర్తిగా దోహదం చేస్తాయి ఆ నియమాలలో మరికొన్ని ఇవి

బ్రహ్మచారి తాంబూలం వేసుకోరాదు

అతడు అద్దంలో తన ముఖాన్ని చూసుకోరాదు.

పరుపుమీద పరుండరాదు

పుష్పమాలలను దరించరాదు

తన శరీరమునకు మంచి గందాదులను పూసుకోరాదు

ముట్టుతలతో మాట్లాడరాదు

తన మనస్సునకు ఇంద్రియాలకు అవేశాలు ప. ఉద్దీపన ఉద్రేకాలను కలిగించే ఏ ఒక పనినీ చేయరాదు ఇంద్రియోత్తేజకాలైన మాటలను కూడా మాట్లాడరాదు

గురు గురుపత్నుల ఆజ్ఞలను మీరరాదు

వారి ఆసనాలపై కూర్చుండరాదు ముఖ్యంగా మదుకర వృత్తితో సంపాదించిన బిక్షాన్నమునే ఆరగిస్తూ రాజస హారాన్ని పూర్తిగా విసర్జించాలి ఇంకా ఇట్టి నియమా లెన్నిటినో బ్రహ్మచారి ప్రతీరోజూ పాటిస్తూ వీని ప్రకారంగా తన ధైనందిన జీవిత ప్రవర్తనను మలచుకొనవలసి ఉంది ఇట్టి పరిస్థితిలో యువతీ యువకులు కలసి ఒకే స్కూలులో చదవడమనే నేటి కో ఎడ్యుకేషన్ విదానం బ్రహ్మచారులకు ఎన్నో విదాలుగా పరమ శత్రువు వంటిదే ఔతుందనడంలో సందేహంలేదు మహర్షులచే విదింపబడిన మీది నియమాల స్వరూప స్వబావాలను పరిశీలించినచో బ్రహ్మచారి యొక్క ఇంద్రియ (వీర్య) చలన స్ఖలనోత్తేజనాదు

# మన సంస్కారాలు విశేషాలు

లకు కారణమైన ఏ ఒక్క పనినీ అతడు చేయరాదని మన మహర్షుల మహితా శయమై ఉన్నట్లు స్పష్టమయింది శుక్రమునకు అపరిణాకు దశయైన బ్రహ్మచర్య వ్రత కాలంలో వీర్యబిందుపతనం అనేది బ్రహ్మచారికి మరణంవంటిదే ఔతుందని తెలుసుకొన్నాంకదా! ఈ విశిష్ట విషయాన్ని ఋజువు పరచే లౌకిక నిదర్శనమిది

గాలి దెబ్బ తినక చెట్టుని ముగ్గి పరిపక్వదశను పొందిన కొబ్బరిపండు విత్తనంగా పాతబడినచో ఆ విత్తనం తాలూకు చెట్టు తిరిగి బాగా కాచి మంచి ఫలాలను ప్రజలకు ప్రసాదిస్తుంది.కదా! ఇదే విధంగా బ్రహ్మచారుల 'వీర్య'మనే విత్తనం కూడా స్ఖలనంవంటి దెబ్బలు అనగా అఘాతాలు పొందనిదై శాస్త్రీయ బ్రహ్మచర్య నియమ పాలనం ద్వారా బాగా పరిపక్వదశను చెందినచో అట్టి పరిణిత వీర్యవంతులైన దంపతులు ఉత్తమమైన -ఆరోగ్యవంతమైన - సంతానమును మానవ సంఘానికి ప్రసాదించగలుగుతారు. ఈ విధంగా శాస్త్రీయమైన బ్రహ్మచర్యవ్రతపాలనమనేది క్రమంగా సాంఘిక దేశీయాభ్యుదయాలసిద్ధికి మూలవౌతుంది. ఇక దుష్టభావనల కారణంగా స్ఖలనాద్యాఘాతాలకు గురియైన బ్రహ్మచారియొక్క అపరిణిత వీర్యం, అనారోగ్యగ్రస్తమైన - తేజో విహీనమైన - దుర్బల దూషితమైన సీరం సంతానమునే సంఘానికి సమర్పించగలుగుతుంది ఇట్టి మానవులు కల సంఘం కూడా దుర్బలమై సాంఘిక శ్రేయస్సంపాదనాది విషయాలలో అట్టి సంఘం అసమర్థమే ఔతుంది. కనుక సాఘిగ దేశీయాభ్యుదయాల దృష్టితో పరిశీలించినా కూడా ఈ ప్రదమాశ్రమ గత నియమ పాలనం స్వజీవితాభ్యుదయ సిద్ధికీ తద్వారా సాంఘిక దేశీయాభ్యుదయముల సిద్ధికీ మూలవౌతుందని

అన్ని విదాలా ఋజువయింది మీద చెప్పిన రీతిలో మన మహర్షులు విశ్వశ్రేయస్కామనతో హైందవదర్మ సంప్రదాయ సంరక్షణ దీక్షా దీక్షితులై జాతి సౌదానికీ మొదటి ఆశ్రమంలోనే ఎంగారు పునాదులు వేసి హైందవ దర్మ రూప సౌదానికి యుగ యుగాలకేనా సడలని బలాన్ని ప్రౌఢత్వాన్ని చేకూర్చిన రని స్పష్టమయింది

ఇకమీద చెప్పిన విషయాలను ఉపనయన మంత్రార్థాలు కూడా ఋజువు పరుస్తున్న విషయాలను సంగ్రహంగా విలోకించుదాం

ఉదాహరణకు నూతన వటువు ముంజగడ్డితో ముప్పేటగా పేనిన మొలత్రాడును మూడు పేటలుగా దరించేటప్పుడు పఠించే మంత్రంలోని బావమిది ఇవి బ్రహ్మచారి మాటలు ఈ మొలత్రాడు (కర్త) మాబాషణములలోని దుష్టత్వాన్ని నశింపజేసేది శ్రేష్ఠమైన మా గృహమును పవిత్రింప జేస్తూ మా వద్దకు వచ్చినట్టిది ఇంకా ఈ మేఖల ప్రాణ అపానములకు బలమును కలిగించేది దేవతలకు ప్రియమైనది సురూపం కలది సత్యమును తపస్సును పూర్తిగా రక్షించేది రాక్షస శక్తులను వాంసించేది శత్రువులను అవమానించునది ఇట్టి విశిష్ట గుణములతో కూడిన ఓ మేఖలమా! మంగళ స్వరూపిణివైన నిన్ను దరించుటచేత మేము సమదిక సామర్థ్యంతో ఈ ఆశ్రమాన్ని శాస్త్రోక్త రీతిలో నిర్వహించెదము గాక (ఇ యందు రుక్కాత్వరి మారిషామ) మీది మంత్రగత బావాన్ని బట్టి వటువుతో ఇంతకు ముందు లేని క్రొత్త శక్తులు (శక్తులు) ఈ మేఖలాదారణ రూప సంస్కార నిర్వహణా నంతరమందే (వటువులో) ప్రవేశించాయని ... ఇక చర్మ యజ్ఞోపవీతాన్ని దరించేటప్పుడు వటువు చెప్పే మంత్రంలోని బావం ఇది

నల్ల ఇర్రి చర్మాన్ని జందెముగా తయారుచేసి దరిస్తున్న బ్రాహ్మణ వటువుయొక్క మాట లివి

ఈ చర్మ యజ్ఞోపవీతం (దరించినవానికి) దీర్ఘాయుర్దాయప్రదమైనది

అజినోత్తరీయోహి దీర్ఘాయుష్మాన్బవతి

ఇంకా ఈ చర్మ జందెం దరించిన వానికి అది తేజస్సు ఖ బలమును కీర్తిని కలిగించేది దూర్త బాలుర కీ జందెం దరింపరానిది కండవాగా దరింపబడినదై ఇది మానవ జీవితాన్ని ఒడుదుడుకులు లేని మంచి మార్గం గుండా వార్ధక్య దశను చేర్చగలిగినది అన్న సమృద్ధిని కలిగించేది ఇట్టి ఉత్తమ గణాలుకల ఈ చర్మయ జ్ఞోపవీతం ను శరీరాన్ని చుట్టు తిరిగి ఉండునట్లు దరిస్తున్నాను

మిత్రస్య చక్షు పరీదం వాజ్యాజి నంద దే హమ్

చర్మ యజ్ఞోపవీతదాణం అనే ఈ సంస్కారం చేత సంస్కరింపబడిన వటువులకు ముఖ్యమైన



ఇన్ని ప్రశస్త ప్రయోజనాలు ప్రాప్తిస్తున్నాయన్న మాట మరవరానిది

ఇక ఆచార్యుడనబడే తండ్రి తన కుమారుని జీవిత రక్షణకై కడుపారా కన్న ఆ బాల నూత్న వటువును సూర్యాది దేవతలకేకాక యమధర్మరాజునకు మృత్యుదేవతకు రోగ దేవతకు కూడ అప్పగిస్తాడు విపరీతంగా కనిపించే ఈ వైదిక క్రియలోని అంతర్యమిది లోకంలో ఒకరి తోటలోని ఫలసాయాన్ని కొందరు గజదొంగలు పూర్తిగా దొంగిలిస్తూండగా తెలివికల తోట కామందు అల్లరి చేస్తూన్న ఆ దొంగలకే తన తోటను అప్పజెప్పి ఆ విధంగా తన తోటకు రక్షణ కల్పిస్తాడు ఇదేవిధంగా తన కొడుకు శరీరానికి రోగాలు అపాయాలు కలిగించే యమాదులకే తన కుమారుని అప్పగిస్తే అటువంటి వానికి రోగాదులవలన కలిగే కష్ట నష్టాలుండవుకదా! ఇట్టి గొప్ప లోకజ్ఞానంతో ఇట్టి వైదిక సంప్రదాయాలను ఏర్పాటు చేసిన మన ఆర్య మహర్షుల లోక శ్రేయస్కర దృష్టి దూరదృష్టి విశ్వ మాంగల్య సంపాదన దృష్టి అనేవి ఇచ్చట చక్కగా సంప్రకాశితాలౌతున్నాయి కను మన ఆర్య మహర్షులు అందరకు ప్రాత స్మరణీయులే ఔతారు

ఇక సుముహూర్త సమయంలో తండ్రి కుమారుని కుడి చెవిలో రహస్యంగా చెప్పే బ్రహ్మోపదేశ మంత్ర భావ మిది

కుమారా! నీవు గృహస్థాశ్రమంలో ఉత్తమ సంతానం పొందడానికి కావలసిన సర్వ విధ శక్తులను యోగ్యతలను వీర్య పరిణతిని ఈ బ్రహ్మచర్యాశ్రమంలోనే సంపాదించుము ఇట్లే నీ భావి గృహస్థాశ్రమంలో వీరులైన పుత్ర పౌత్రులతో కలిసి నీవు కూడా వీరుడవనిపించుకోడానికి తగిన అర్హతలను ఈ బ్రహ్మచర్యవ్రత నియమపాలన సమయంలోనే సంపాదించుము. ఇట్లే కుమారా! అచిర భావిలో నీ వనుష్ఠించవలసిన గృహస్థాశ్రమ ధర్మాలను ఆచరించడానికి అత్యవసరంగా కావలసిన వీర్యపుష్టి పరిణతులను నీవు ఈ బ్రహ్మచర్యాశ్రమంలోనే సంపాదించి తద్వారా తేజస్వివి వర్చస్వివి కావలెను."

"ముహూర్త కాలే ఆత్మనస్సమీప మానయతి" సుప్రజా "అతి దక్షిణే కర్ణే జపతి" "సుప్రజాః ప్రజయా భూయాః")

తండ్రి చేసిన ఈ బ్రహ్మోపదేశాన్నిబట్టి పరిశీలించినపుడు, గృహస్థ, వానప్రస్థ, సన్యాసములనే తరువాతి మూడు ఆశ్రమాలలోని ధర్మాలను సమర్థవంతంగా నిర్వహించడానికి కావలసిన సర్వ విధ యోగ్యతలను సర్వ విధ శక్తులను సంపూర్ణంగా ప్రసాదించేది ఒక్క "బ్రహ్మచర్యవ్రత నియమపాలనమే" అనేది త్రికాలా బాధ్యమైన సత్యమని స్పష్టమయింది.

ఇక తండ్రి నూత్న వటువునకు యథావిధిగా గాయత్రీ మహా మంత్రాన్ని ఉపదేశించిన వెంటనే ఆ వటువులో అపూర్వమైన అద్భుతమైన మహత్తర శక్తి ప్రవేశించడంచేత ఆ నూతన వటువు అడనంగా వండం అట్లు ఎయివక్క తాడు అట్టి కుమా గుర్న ఉం ఊ సూర్యపరమాత్మ సందర్శనమునకు తీసుక వెళడ వెళ్ళి కూర్చున్న చోటి నుండి లేవదియిలేక అపుడు తండ్రి కొడుకుతో చెప్పే మాట లివి

కుమారా! నిన్ను ఇచటనుండి లేవదీయుటకు నా జీవితకాలంలో గల శక్తినంతను ఒకచోటికి కేంద్రీకరించి ప్రయత్నించిన కూడా నిన్ను కూర్చున్న చోటనుంచి లేవదీయలేకపోయాను కనుక ఓషధులను మేఘములను ప్రార్థించి వాటినుండి గ్రహించిన రసజల రూప శక్తులను నాయాపచ్ఛక్తితో జోడించి మొత్తం శక్తితో ఇప్పటినుండి దేవతా సందర్శనమునకై తెలియుచున్నాను

ఉదా యుషా ఉదస్థామమృతాగ్ం అను అని ఆ మంత్రార్థం కుమారునిలో ఇంతకుముందు లేని ఇట్టి అద్భుత శక్తులెన్నో కుమారునిలో ఈ వ్రత సంస్కారంచేతనే ప్రవేశించినట్లు ఇందలి మంత్రార్థాలు చాటుచున్నాయికదా!

(ఇంకా ఉంది)



సీరియల్

# రేపటి మహిళ

సి. ఆనందారామం

(గత సంచిక తరువాయి)

పోస్ట్ చూసుకుంటూన్న బాగవతారు ఆ ఇన్విటేషన్ కార్డు చూసి తెల్లబోయాడు కళ్ళు నులుముకుని మరోసారి చదివాడు

మిస్టర్ అండ్ మిసెస్ బాగవతార్ ఇన్ వైట్ యూ ఫర్ ఎ డిన్నర్ పార్టీ ఎట్ హోటల్ నాగార్జున ఆన్ ఫ్రైడే ఈవినింగ్ బిట్వీన్ సెవెన్ పి యమ్ టు టెన్ ఎ యమ్

అతనికేమీ అర్ధం కాలేదు మృదుల ఉత్తరం రాసిపెట్టి వెళ్లిపోయాక మృదుల లేని ఇంటో అతడు ఒక్క క్షణం కూడా ఉండలేకపోయాడు బోజనమైనా చేయకుండా కేశవనాథ్ ఇంటికెళ్లాడు చూడామణి అతడ్ని ఇంట్లోకి రానీయలేదు ప్యూన్‌తో ఈ ఇంట్లో అతని తాలూకు మనుష్యులెవరూ లేరని చెప్పు అని ఎంపించేసింది కనీసం బయిటికొచ్చి హాల్లో అయినా చెప్పలేదు చూడామణికి బాగవతార్‌కి మధ్య ఎప్పుడూ సత్సంబంధాలు లేవు ఈ నడివయసువాడు తన కల్లుడేమిటని చూడామణి కూతురుకు బుద్ధి చెప్పవలసింది పోయి మరింత రెచ్చగొడుతుందని బాగవతార్‌కి ఇద్దరికీ ఎప్పుడూ ఒకరి మీద ఒకరికి అక్కసుగానే వుంటుంది

బొంబాయిలో లాయర్ యశోదరాదేవితో ఎస్ ట డి లో మాట్లాడడానికి ప్రయత్నించాడు యశోధరాదేవి పలకలేదు ఆవిడ పి ఎ ఆమె సందేశాన్ని అందించింది మగవాళ్ళైనా - ఆడవాళ్ళైనా తమ లైఫ్ పార్టనర్స్‌ని ప్రేమతో అనురాగంతో తమని విడి పోకుండా చూసుకోవాలేగాని ఒక హక్కుగా నిర్బంధించి కట్టి ఎదేసుకోవాలని ప్రయత్నించకూడదు బార్య అంటే బర్తకి చెందిన వస్తువు కాదు స్వతంత్ర వ్యక్తిత్వం ఉన్న సహధర్మచారిణి హడలిపోయి రిసీవర్ కేడిల్లో పడేసి రెండు చేతుల్తోనూ జుట్టు పీక్కున్నాడు ఈ రకమైన డైలాగులు వినడానికి అతనికి మొదట్లో తమాషాగ వుండేది ఈ రకమైన డైలాగులు వల్లిస్తూ మృదుల మాట వినకుండా తిరుగుతూన్నప్పుడు చిరాకు గలిగేది ఇప్పుడు మృదుల వెళ్ళిపోయాక ఇలాంటి మాటలు వినడానికి బయంగా వుంటోంది

> జరిగిన కథ 14 ఫ్లెమింగ్ జీవిత కాలాన్ని పెంచే మందుకోసం ప్రమాదకర మైన ప్రయోగాలు చేస్తున్నాడని తెలుస్తుంది ఒక గర్భస్థ శిశువును పరీక్షించాలనే నెపంతో మృదుల తన స్నేహితురాలిని ఫ్లెమింగ్ ఆస్పత్రిలో చేరుస్తుంది మృదుల మీద మరింతగా అనుమానం పెంచుకున్న బాగవతార్ ఏందెటో అనంగల ఇళ్ళలో వెతికి బంగ పడతాడు అనంగకు అనుకూలంగా మృదుల సాక్ష్యం చెప్పడంతో బాగవతార్ కోపం పెరిగిపోతుంది మృదుల బాగవతార్‌ను వదిలేసి, ఉత్తరం రాసి పెట్టి వెళ్ళిపోతుంది

ఆ తరువాత ఏం చెయ్యాలో తోచలేదు

మళ్ళీ సోమనాద్ ప్రైవేట్ డిటెక్టివ్ ఏజన్సీస్‌కే వెళ్లాడు

సోమనాద్ సాదరంగా ఆహ్వానించి మళ్ళీ మీరేదేనా టూర్ వెళుతున్నారా? మీ శ్రీమతి గారి డైలీ రిపోర్టు తయారు చెయ్యాలా? ఈసారి వీడియో ఇంకా పకడ్బందీగా రికార్డ్ చేయిస్తాను అన్నాడు బాగవతార్‌లాంటి క్లైంట్స్ అంటే సోమనాద్‌కి చాలా యిష్టం వడ్ల గింజలో బియ్యపుగింజ లాంటి విషయానికి డిటెక్టివ్‌లను ఏర్పాటు చేసి పెద్ద మొత్తాలు చెల్లిస్తారు

ఒంచిన తల ఎత్త లేకపోయాడు బాగవతార్ అతడు ఇదివరలో రిపోర్టు తయారు చెయ్యమన్నది మృదులని దోషిగా నిరూపించి ఒదిలించుకోవడానికి ఇప్పుడు వచ్చింది ఆమె వెళ్ళిపోతే భరించలేక ఎక్కడుందో తెలుసుకొందమని!

ఏమనుకుంటాడు సోమనాద్ తన గురించి?

చెప్పండి సార్! తల దించు క్కూర్చున్న బాగవతార్‌ని అడిగాడు సోమనాద్ బార్య మీద డిటెక్టివ్‌ని పెట్టే ప్రతీ మగవాడు ఇలాగే పీలవడం సోమనాథ్‌కి బాగ తెలుసు బార్యని అనుమానించకుండా ఉండలేరు నా బార్య బలహీనురాలు - అని చెప్పుకోలేరు

మా మృదుల ఇంట్లోంచి వెళ్లిపోయింది ఎక్కడుందో తెలుసుకోవాలి? పూడుకు పోతున్న గొంతుతో అన్నాడు

వాట్?

మాట్లాడలేదు బాగవతార్ దించిన తల ఎత్తనూలేదు

ఆల్‌రైట్- ఆల్ రైట్ తప్పకుండా తెలుసుకుంటాను అదేం కష్టం కాదు దేశ విదేశాల్లో ఎక్కడున్నా తెలుసుకొని వారం పది రోజుల్లో మీకు ఫోన్ చేసాను

ధైర్యం చెప్తున్నట్టు అన్నాడు బాగవతార్ మొహం చూస్తే మృదుల వెళ్లిపోయినందుకు అతడెంత బాధపడుతున్నాడో స్పష్టంగా తెలుస్తోంది బార్యాబర్తల అనుబంధాల్లో ఇది కూడా సోమనాద్‌కి అనుభవమే శత్రువుల్లా ఒకరి మీద ఒకరు కత్తి కట్టినవాళ్ళు ఏ క్షణంలో ఇద్దరూ ఒకటైపోతారో ఎవరూ చెప్పలేరు

సోమనాథ్‌కి థేంక్సు చెప్పి వచ్చేసాడు

అప్పటికి మృదుల వెళ్ళి వారం రోజులైంది ఏ క్షణానికా క్షణం సోమనాద్ ఫోన్ కోసం ఎదురు చూస్తున్నాడు ఇప్పుడీ ఇన్విటేషన్

మిస్టర్ అండ్ మిసెస్ బాగవతార్ ఈ పజిల్ ఏమిటో అర్ధం కాలేదు బాగవతార్‌కి ఏదేమైనా శుక్రవారం హోటల్ నాగార్జునకెళ్లితే మృదుల కనిపిస్తుందనే ఆశతో వెళ్లడానికి నిర్ణయించుకున్నాడు అక్కడ మృదులని ఎలాగైనా కన్విన్స్ చేసి ఏ వాగ్దానాలైనా చేసేసి మృదులని తనతో తీసుకొచ్చేయాలి మృదుల తననుంచి పూర్తిగా విడిపోయింది అనుకున్న వారం రోజుల్లోనే మృదుల లేకుండా తనకి జీవితం లేదనే విషయం అర్ధమయిపోయింది బాగవతార్‌కి

హోటల్ నాగార్జునలో డిన్నర్ ఏర్పాట్లు ఎప్పటిలా గ్రాండ్‌గా ఉన్నాయి దేవకి కేబరే డాన్స్ కూడా ఏర్పాటు చేసారు వెండికాంతులు విరజిమ్మే లేత వెలుగుల షాండిల్యార్స్ గోడలకి చక్కని తైల వర్ణ చిత్రాలు యూనిఫారమ్స్‌లో ఎవరిక్కావలసినవి వాళ్ళకందిస్తున్న వెయిటర్స్ డాన్స్ ఫ్లోర్ మీంచి మంద్రంగా ఉత్తేజకరంగా– సెడెక్టివ్‌గా– వినిపిస్తోన్న పాశ్చాత్య వాద్య సంగీతం

ఈ ఏర్పాట్లన్నీ తన పేరు మీదుగా ఎవరు చేస్తున్నారు? ఎందుకు చేస్తున్నారు? మృదుల కనిపిస్తే మిస్టరీ విడిపోతుంది కాని మృదుల ఎక్కడా కనపడ్డంలేదు చూడామణీ కేశవనాద్‌లు అన్ని వైపులా పర్యవేక్షించుకుంటూ హడావిడిగా తిరుగుతున్నారు చూడామణి చూపులు తన వైపు తిరిగేసరికి చేతులు జోడించి నవ్వబోయాడు భాగవతార్ నొసలు చిట్లించి ముఖం తిప్పుకుంది చూడామణి నీరు కారిపోయాడు ఏవో దోపిడీలు హత్యలు చేసిన ఇంటర్నేషనల్ క్రిమినల్‌ని చూసినట్లు కంపరంగా చూసింది చూడామణి ఆ చూపులు నిలువునా కాల్చేసినా మృదుల ఎక్కడుందో చెప్తే బాగుండును ఇంతగాదు– ఇంకో అంత కపరంగా చూసినా– ఛీకొట్టినా పరవాలేదు బాధగా అనుకున్నాడు గెస్ట్స్ చాలా మందే వున్నారు వాళ్ళల్లో చాలామంది భాగవతార్‌ని గుర్తుపట్టి పలకరిస్తున్నారు తనని పల్కరించేదెవరో కూడా గమనించుకోకుండా యాంత్రికంగా సమాధానాలు చెప్తూ మృదుల కోసం వెతుక్కుంటూన్నాడు

అవతార్! మెత్తగా తియ్యగా పల్కింది ఒక స్త్రీ కంఠం గిర్కున వెనక్కి తిరిగాడు ఎదురుగా దేవకి అతని మనసులో లక్ష భావాలు ఒక్కసారిగా కమ్ముకొచ్చి ఏమీ మాట్లాడలేక తెల్లబోయి చూస్తుండిపోయాడు భాగవతార్

నేను గుర్తున్నానా!

లే లే ఉన్నావు– ఉన్నారు

అతడి తడబాటుకి నవ్వింది

ఏం మారలేదు ప్రేమాభిమానాలు నాట్యం చేసాయి దేవకి గొంతులో ఇబ్బందిగా అటూ యిటూ చూసేడు

రండి అలా కూర్చుని మాట్లాడుకుందాం కాస్త దూరంగా వున్న టేబిల్ వైపు చూపించింది కేబరే డాన్సర్ వేషంలో వున్న ఆమె వైపు చూడలేక చూపులు తిప్పుకుంటూ వొద్దు వొద్దు నాకు వేరే పని వుంది

రండి మిమ్మల్నెత్తుకు పోను

సారీ! మరోసారి వస్తాను



మరోసారి కుదురుతుందో కుదరదో, మృదులకి సంబంధించి మీకొన్ని విషయాలు చెప్పాలి  భాగవతార్ సంకోచం మొహమాటం ఎక్కడివక్కడ ఎగిరిపోయాయి మంత్రం వేసినట్లు ఆమె వెంట నడిచి కాస్త దూరంగా వున్న టేబిల్ ముందు ఆమె ఎదుట కూర్చున్నాడు

ఏమిటి? మృదులకి సంబంధించిన విషయాలు?

**అంత ఆరాటమైతే ఎలాగ? మీరెలాగున్నారు? బాగున్నారా?**

బాగానే వున్నాను మృదు

నేనెప్పుడైనా గుర్తొస్తానా?

మృదుల గురించి ఏం చెప్పాలనుకుంటున్నారు?

మృదులా నేను స్నేహితులమని మీకు తెలుసా?

పరిచయస్తులని తెలుసు

నేను మృదుల ఏం మాట్లాడుకున్నామో మృదుల మీతో ఎప్పుడేనా చెప్పిందా?

మృదులతో నేనెప్పుడూ మీకు సంబందించిన విషయాలు మాట్లాడలేదు కొద్దిగా వడిలింది దేవకి ముఖం

నామీద నీకింకా కోపం పోలేదన్నమాట

కోపం ఏమిటి? మీ మీద నాకేం కోపం లేదు మీక్కావలసిన జీవితాన్ని మీరెంచుకున్నారు సుఖంగా ఉన్నారా?

నిట్టూర్చింది దేవకి

నన్ను మీరండం దేనికి? ఇదివరకులాగ నువ్వనే ఎలవ్వచ్చుగా"

సారీ! సాధారణ పరిచయస్తులైన ఆడవాళ్ళని చనువుగా "నువ్వు" అని ఎలవలేను

చిన్నబుచ్చుకుంది దేవకి

**అంతలో** నవ్వేస్తూ మీరు నాకు థేంక్సు చెప్పాలి నేను మిమ్మల్ని వొదిలి వెళ్ళిపోబట్టే మీరు మృదులని పెళ్ళి చేసుకోగలిగారు మృదుల చాలా మంచిది."

అవును మీకు మనసారా థేంక్సు చెప్తున్నాను ఐయామ్ లక్కీ మరోసారి చిన్నబోయింది దేవకి మొహం

నా ఆత్మాభిమానం గాయపడ్డా సరే మిమ్మల్నొదిలి వెళ్లాక ఒక్క రోజైనా సుఖంగా– శాంతిగా లేనని ఒప్పేసుకుంటున్నాను

ఇబ్బందిగా కదిలాడు బాగవతార్

చిత్రమైనది జీవితం డబ్బు కోసం ఆశపడి మీతో ఎంగేజ్‌మెంట్ బ్రేక్ చేసుకొని ఫ్లెమింగ్ వెంట వెళ్ళిపోయాను ఇప్పుడు ఫ్లెమింగ్ అవసరాలకి డబ్బు సంపాదించడం కోసం మిమ్మల్నే ఆశ్రయించవలసి వచ్చింది థేంక్స్ నాకోసం యీ పార్టీ ఏర్పాటు చేసినందుకు

**థేంక్స్** అనవసరం మీకోసం ఈ పార్టీ నేనేర్పాటు చెయ్యలేదు

మరో సారి చిన్నబోయింది ఏమి ప్రిన్సిపుల్స్ ఇతనివి ఇంతటి సరళమైన వ్యక్తినా చేజేతులా ఒదులుకొని ఫ్లెమింగ్‌ని ఆశ్రయించింది

**పోనీండి** నా కోసం కాదు మీ మృదుల కోసమే– మృదుల మీద మీకెంత ప్రేమాభిమానాలున్నా– ఎంత విశ్వాసమున్నా– ఆమెని ఫ్లెమింగ్ దగ్గిరకి రానీయకండి మృదుల బలహీనురాలని కాదు నాకు తెలుసు మృదుల ఎంత ఖచ్చితమైన మనిషో కాని ఫ్లెమింగ్‌తో సాన్నిహిత్యం ప్రమాదకరమైనది ఎవరిని– ఎప్పుడు ఏ వూబిలోకి తోస్తాడో ఊహించలేము అతడికి ఈ లోకంలో తన ప్రయోగాలు తప్ప మరేదీ ముఖ్యంకాదు

**ఉలిక్కిపడ్డాడు** బాగవతార్ ఆ ఉలికిపాటులో దేవకి మాటల్లో మొదటి బాగాన్ని పట్టించుకోలేదు

ఎక్కడుంది మృదుల ఇప్పుడు? ఆరాటంగా అడిగాడు

ఇక్కడికేవస్తానంది మీంద్దరూ కలిస రాలేదా?

మాట్లాడలేదు భాగవతార్ జరిగిందంతా దేవకితో చెప్పడం అతనికిష్టం లేకపోయింది లేచి నిలబడి ఇంక వెళ్తాను అన్నాడు

"కూర్చోండి. మరోకందుకు కూడా మీరు నాకు థేంక్స్ చెప్పాలి ఎలాగైనా అతన్ని మరికొంతసేపు గడపాలన్నట్లుగా వుంది దేవకి దోరణి

"దేనికి?"

"మృదుల మిమ్మల్ని పెళ్ళి చేసుకోవడానికి కారణం నేనే మీదెంత మంచి మనసో – మీ ప్రిన్సిపుల్స్ ఎలాంటివో– ఎదుటి వ్యక్తుల్ని మీరెంత గాఢంగా ప్రేమించగలరో– ఇవన్నీ మృదులకి ఎన్నోసార్లు వర్ణించి వర్ణించి చెప్పాను బహుశః డబ్బు మీద ఆశతో మీకు దూరమై పోయినా మనసులోంచి మిమ్మల్ని దూరం చేసుకోలేక నా మనసుకి సన్నిహితంగా వచ్చిన మృదులతో ఎప్పుడూ మీ మాటలే చెప్పేదాన్నేమో? అవన్నీ విని విని మృదుల నాకు అలాంటి వ్యక్తినే పెళ్ళి చేసుకోవాలని ఉంది అనేది అందుకే పనిగట్టుకుని మీ పాటకచ్చేరీకొచ్చింది శాస్త్రీయ సంగీతంలో – ఆమెకి అంతపెద్ద ఇంట్రెస్టు ఉండేదికాదు అదివరలో

బాగవతార్ కళ్ళ ముందు మబ్బు పొర విడిపోయినట్లయింది మృదుల పనిగట్టుకుని తన దగ్గిరకొచ్చి తనంతట తానే పెళ్ళి ప్రసక్తి తెచ్చి – పెళ్లి చేసుకోవడానికి కారణం ఏమిటాని ఎన్నోసార్లు జుట్టు పీక్కున్నాడు ఇదన్న మాట కారణం అతని ముఖం పున్నమి చంద్రుడిలా వెలిగిపోయింది పట్టరాని ఆనందంతో తనని తను మరిచిపోయి దేవకి రెండు చేతులూ పట్టుకుని థేంక్యూ థేంక్యూ వెరీ మచ్ అన్నాడు ఆ మరుక్షణమే అతని చేతుల మీద గట్టి అరచేతి దెబ్బ కత్తి దెబ్బలా పడింది దేవకిని వెదుక్కుంటూ వచ్చిన ఫ్లెమింగ్ దెబ్బ అది బాగవతార్ బిత్తరపోయి చూసాడు ఫ్లెమింగ్ గుడ్లురిమి బిహేవ్ యువర్‌సెల్ఫ్ అని దేవకిని చెయ్యి పట్టుకుని ఎవరో వి ఐ పి దగ్గరికి బరబర యీడ్చుకు పోయాడు బిజినెస్ మేగ్నెట్స్‌కి వి ▪ పి లకి దేవకిని పరిచయం చేసి వాళ్ళతో దేవకి ఎంత సరదాగా మాట్లాడినా చిరునవ్వుతో ఆనందించే ఫ్లెమింగ్ తనకిష్టం లేకుండా దేవకి ఎవరితో మాట్లాడినా ఏమాత్రం సహించడు దౌర్జన్యంగానైనా సరే దేవకిని తన చెప్పుచేతల్లో ఉంచుకొంటాడు

పాశ్చాత్యులు మనకంటే గొప్ప సంస్కారవంతులని – అక్కడి ఆడవాళ్ళకి ఎంతో స్వాతంత్ర్యముంటుందని ఏదో భ్రమలో ఉంటాం ఇదీ లోపలి బండారం అని ఉసూరంది దేవకి ఎన్నోసార్లు నిస్సహాయంగా ఫ్లెమింగ్ వెంట బలిపశువులా వెళ్ళిపోతూ ఒకసారి వెనక్కి తిరిగి దీనంగా బాగవతార్‌ని చూసింది మాటల్లో దేవకి చెప్పిన సంగతులకంటె ఎన్నెన్నో చెప్పాయి ఆ చూపులు

బాగవతార్ అక్కణ్నుంచి కదలి జనం మద్యకొచ్చాడు అతడి చూపులు మృదులనే వెతుకుతున్నాయి ఒక్కొక్కరూ చేతుల్లో గ్లాసుల్తో బాగవతార్ దగ్గరకొచ్చి థాంక్స్ ఫర్ ది గ్రాండ్ పార్టీ అంటూంటే ఏం చెప్పాలో



“



ప్రెషర్ కుక్కర్స్ డీలర్‌నైన నేను ఏది భద్రతగల కుక్కరో ఏది మరింత భద్రతాయుక్తమైనదో చెప్పగలను అయితే వాటి అన్నింటిలోను అత్యంత భద్రమైనది న్యూ ప్రెస్టీజ్ కనుక మీరు మీ శ్రీమతికి న్యూ ప్రెస్టీజ్‌ని కొని పెట్టారంటే, మీకు ఆమె పట్ల మిక్కిలి మక్కువ కలదని నిరూపిస్తున్నారన్న-మాట మరియు ఆమె శ్రేయస్సుకే అత్యధిక ప్రాధాన్యాన్ని యిస్తున్నారన్న మాట - సర్వదా

న్యూ ప్రెస్టీజ్
ఎంత భద్రమైనదో చూడండి




నూటికి నూరు పాళ్ళ భద్రతను చేకూర్చే అద్వితీయమైన గాస్కెట్ రిలీజ్ సిస్టం (జి ఆర్ ఎస్) ఒక్క న్యూ ప్రెస్టీజ్‌కి మాత్రమే కలదు 'వెయిట్ వెంట్' పూడుకొనిపోయినట్లయితే కుక్కర్ లోపల మితిమించిన ఒత్తిడి ఏర్పడుతుంది




ఇది కుక్కర్‌కు అత్యంత సమిపములో వున్న వ్యక్తికి ప్రమాదకరంగా పరిణమించవచ్చును

న్యూ ప్రెస్టీజ్ అయితే మితిమీరి ఎర్పడిన సీటి ఆవిరి జి ఆర్ ఎస్ ను బయటకు నెట్టుతుంది తత్ఫలితంగా జి ఆర్ ఎస్ ఆవిరిని భద్రంగా, రూఢిగా క్రిందికి విడిచిపెడుతుంది గాస్కెట్‌ను ఒక స్పూన్‌తో లోపలికి నెట్టండి



అంతే, ప్రెషర్ కుక్కర్ తిరిగి వినియోగానికి సిద్ధంగా వుంటుంది న్యూ ప్రెస్టీజ్ అయితే ఎన్నడూ అణుమాత్రంకూడా ప్రమాదం వుండదు అందుచేతనే ఎట్టి పరిస్థితులలోనైనప్పటికి అది అత్యంత భద్రమైనది - సర్వదా ”

# భార్యపై నిజమైన ప్రేమగలవారు ప్రెస్టీజ్ వద్దని ఎట్లా అంటారు




**ప్రెస్టీజ్**




ttk తయారి.

న్యూ ప్రెస్టీజ్ ఒక్కటి మాత్రమే 100% భద్రమైనది   న్యూ ప్రెస్టీజ్ ఒక్కదానికి మాత్రమే జి.ఆర్.ఎస్. కలదు

MAA (S) TTP 3B TEL 85

అర్ధంకావడం లేదు బాగవతార్‌కి అతడు తారసపడినప్పుడూ గుఋ్ఖన చూస్తోంది చూడామణి మొహం తప్పించుకు తిరుగుతున్నాడు కేశవనాద్ ఆ దంపతుల దగ్గిరకెళ్ళి రెండు చేతులూ జోడించి–

నావల్ల పెద్ద తప్పు జరిగిపోయింది నన్ను క్షమించి మృదులెక్కడుందో చెప్పండి ఇంకెప్పుడూ ఆమెని ఎల్లెత్తు మాట అనను ఎ చిన్న కష్టమూ రానీయను నా మృదుల జాడ నాకు చెప్పండి అని ప్రాదేయపడాలనిపించింది కాని చూడామణి మొహం చూస్తుంటే అతనికడుగు ముందుకు పడటం లేదు దూరాన రాజభూషణం కనిపించాడు హల్లో అంటూ సమీపించిన బాగవతార్‌కి షేక్‌హేండ్ ఇచ్చి ఏమిటి? ఎన్నడూ లేనిది ఇంత గ్రాండ్‌గా ఏర్పాటు చేశారు? అన్నాడు బాగవతార్ తడబడుతూ నే నే నేను కాదు అన్నాడు రాజభూషణం గట్టిగా నవ్వి

మీరు కాదూ' అయితే మృదుల ఏర్పాటు చేసిందన్న మాట ఈ పార్టీ అంతా' ఆవిడకి ఇలాంటి పార్టీలు అవసరమేలెండి ఇంతకీ ఏదీ ఆవిడగారు? ఇంకా ఎవర్నైనా ఏ ఐ పి లని ఎకప్ చేసుకొని రావడంలో లేటవుతోందా? అన్నాడు విషపు నవ్వుతో

అతడి వాగ్బాణాలు బాగవతార్ మనసుని గుచ్చాయి వాటిల్లో విషం అతడి మనసుని బగ బగలాడించింది ఇలాంటి కుచ్చితుణ్ణి వెనకేసుకొని మృదులతో పోట్లాడాడు తను కోర్టు కేసులో తన పలుకుబడినంతా ఉపయోగించికుని రేప్ జరగలేదు గనక జరిమానా చెల్లించి బయటపడ్డాడు ఏమాత్రం సిగ్గు లేకుండా గర్వంగా తిరుగుతున్నాడు ఛీ ఛీ ఇలాంటి వాళ్ళని గౌరవించి వీళ్ళ వెనకాల తిరిగి ఎంత పెద్ద పొరపాటు చేశాడు తను? మృదులను కలుసుకోగానే ఇక జన్మలో రాజభూషణం మొహం చూడనని చెప్పాలి మృదుల సంతోషిస్తుంది మరెవరో ఎలిస్తే అక్కడికెళ్ళి పోయాడు రాజభూషణం వెళ్తూ వెళ్తూ బాగవతార్ వైపు చూసి వెటకారంగా నవ్వి మరీ వెళ్ళాడు ఆ నవ్వు బాగవతార్‌కి బాద కలిగించలేదు కాని రాజభూషణం మీది కోపాన్ని మరింతెక్కువ చేసింది ఎవరెవరో వస్తున్నారు బాగవతార్‌కి థేంక్స్ చెప్తున్నారు కాని అతడెదురు చూస్తున్న మృదుల మాత్రం కనిపించలేదు అంతలో దేవకి డాన్స్ ప్రారంభమైంది వచ్చిన వాళ్ళంతా ఆమె డాన్స్ చూడ్డంలో మునిగిపోయారు అక్కడుండ లేకపోయాడు బాగవతార్ ఎంట్రెన్స్ పక్కన వెయిటింగ్ హాల్లో సోఫాలో కూర్చున్నాడు అతనికి అక్కడుండాలని లేదు కేవలం మృదుల వస్తుందనే ఆశతోనే ఆ ప్రదేశం వదలలేక పోతున్నాడు లోపల్నించి ఈలలు చప్పట్లు వినిపిస్తున్నాయి డాన్స్ మంచి రసపట్టులో సాగుతున్నట్లుంది డాన్స్ హాల్లో ఉండి డాన్స్ చూస్తున్నప్పుడు అంతగా తెలియలేదు కాని ఇప్పుడు బయట ఉండి ఈలలు చప్పట్లు వింటూంటే అవి ఎంత అటవికంగా–అనాగరికంగా ఉన్నాయో




అర్ధంకాసాగింది ఈ రకమైన సంస్కృతినంతా ఆదునికత పేర మీరామోదించగలరు కాని నేను జీన్స్ వేసుకోవడం మాత్రమే అసహ్యమనిపిస్తోందా మీకు అని మృదుల నిలదీయడం గుర్తొచ్చింది తనను పెళ్ళి చేసుకోక ముందు మృదుల ఎప్పుడూ ఇలాంటి పార్టీలలో కనబడలేదు చూడామణి కేశవనాద్‌లను కూడా ఈ రకమైన పార్టీలలో చూడ్డం ఇదే మొదటిసారి

ఎవరో మొరటుగాఉన్న మొగవాడు రిసెప్షన్ కౌంటర్ దగ్గరకొచ్చి రిసెప్షన్ క్లర్క్‌తో ఏదో చెప్పాడు రిసెప్షన్ క్లర్క్ హొటల్ బాయ్‌ని డాన్స్ హాల్లోకి పంపించాడు మరో రెండు నిముషాలకి రాజభూషణం బయటికొచ్చాడు మొరటు మనిషికి సైగ చేసి హొటల్ బయటికి వచ్చాడు బాగవతార్ సాదారణంగా ఇలాంటివి పట్టించుకొనే రకం కాదు గాని రెస్ట్‌లెస్‌గా ఉండడం వల్ల ఇది గమనించాడు ఏదో విశేషముందని కూడా అనిపించిందతనికి తను కూర్చున్న చోటు నుంచి తెర ఎత్తి గించి బయటికి చూసాడు రోడ్డు మీద మొరటు మనిషి రాజభూషణం మాట్లాడుకుంటున్నారు మామూలు పరిస్థితుల్లో అయితే రాజభూషణం రోడ్డు మీద నిలబడి అలాంటి సామాన్య వ్యక్తితో అంత సన్నిహితంగా మాట్లాడడు వాళ్ళు నెమ్మదిగా మాట్లాడుతున్నా శ్రద్ధగా వింటూన్న బాగవతార్‌కి వాళ్ళ మాటలు వినబడుతున్నాయి

మోసం జరిగిపోయింది సారీ' మీరు మృదుల మీద ఒక కన్నేసి ఉంచమన్నారు అలాగే ఆవిణ్ణి ఫాలో అవుతున్నాను ఇవాళ మృదుల మరెవడితోనో మన లేబ్ కొచ్చింది ఇద్దరూ ఘూర్ఖాని కొట్టి పడేసారు లోపలి కెళ్ళారు ఎవరెవరో అమ్మాయిల్ని వేన్‌లో ఎక్కడికో తీసుకు పోయారు మళ్ళీ లేబ్‌కే వచ్చారు ఈ సంగతి మీకు చెప్దామని గంట నించి ట్రై చేస్తున్నాను నాకు ఇన్విటేషన్ లేదని గేటు దగ్గిర ఘూర్ఖా లోపలికి రానీయలేదు ఎలాగో వాడికి లంచం పెట్టి ఇంత సేపటికి మీకు కబురందీయగలిగాను

రాజభూషణం కనుబొమ్మలు ముడిపడ్డాయి అది ఇప్పుడు లేబ్‌లోనే వుందా? కర్కశంగా అడిగాడు

నేనొచ్చేసరికి ఉంది నేనొచ్చి గంటైంది

నువ్వు నడు నేనిప్పుడే మనవాళ్ళని పంపిస్తాను

రాజభూషణం మళ్ళీ లోపలికి రాకుండా పార్క్ చేసిన తన కారు దగ్గిర కెళ్ళి డ్రైవింగ్ సీటులో కూర్చుని కారు స్టార్ట్ చేసాడు అంతా విన్న బాగవతార్‌కి లేబ్ ఏమిటో మృదుల మరొకడితో అక్కడి కెళ్ళడమేమిటో అందుకు రాజభూషణం ఖంగారు పడడమెందుకో అర్థం కాలేదు మృదులతో వున్న మరొక వ్యక్తి ఎవరా అని ఆలోచించే దశలో లేదు బాగవతార్ మనసు అతనికొక విషయం స్పష్టంగా అర్థమైంది మృదుల మళ్ళీ ఏదో సాహసం చేస్తోంది ఆమెని రాజభూషణం ఎదుర్కోబోతున్నాడు రాజభూషణమేమిటో ఇప్పుడతనికి బాగా తెలిసిపోయింది మృదులని వెంటనే కాపాడుకోవాలి కాని లేబ్ ఏమిటో అదెక్కడుందో తనకలా తెలుస్తుంది? అది చెప్పగలిగిన వ్యక్తి దేవకి ఒక్కర్తే డాన్స్ హాల్లోకి నడిచాడు కేబరే డాన్స్ మంచి రసపట్టులో ఉంది దేవకి ప్రదర్శిస్తున్న హావబావాలకి ఆమె ఒంపుసొంపులకి జనం ముగ్ధులై తన్మయత్వంతో చూస్తున్నారు ఎప్పటిలాగే తప్ప తాగేసి ఒళ్ళెరక్కుండా తల అటూ ఇటూ ఊగిస్తున్నాడు ఫ్లెమింగ్ వెనక ముందు ఆలోచించకుండా గబాల్న డాన్స్ ఫ్లోర్ కొచ్చేసి దేవకి చెయ్యి పట్టుకుని మీ లేబెక్కడుంది? అన్నాడు

బిత్తరపోయిన దేవకి గబాల్న కుసాయిగుడాలో అంది తప్ప తాగి నిషాలో ఉన్న ఫ్లెమింగ్ డాన్స్ ఫ్లోర్ మీద కురికి దేవకి చెంప ఛెళ్ళుమనిపించాడు మత్తులో – నిషాలో జోగుతూన్న ఆ హాల్లో కలవరం చెలరేగింది కొందరు ఫ్లెమింగ్‌ని కొందరు బాగవతార్‌ని పట్టుకుని అటూ – ఇటూ లాగడం మొదలు పెట్టారు

(ఇంకా ఉంది)

పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

చిన్నారి బాలల దీనగాథలు చెప్పుకొనేటప్పుడు వివిధ పట్టణాలలో సైకిళ్ల షాపుల్లో పని చేసే బాలల గురించి తప్పకుండా చెప్పుకోవాలి. కేవలం 50 నుంచి 75 రూపాయల నెల జీతం కోసం ఈ బాలలు ఉదయం 8 నుంచి రాత్రి 8 గంటల వరకు పనిచేస్తారంటే చాలామంది నమ్మరు. కాని ఇది అక్షరాలా నిజం. సైకిల్ షాప్ మెకానిక్ వచ్చేటప్పటికి ఈ కుర్రవాళ్ళు వచ్చి షాపును శుభ్రపర్చి ఉంచాలి. సామగ్రి అంతా బయట పేర్చాలి.

## సైకిల్ షాపులతో సహజీవనం!

అప్పటి నుంచి ఆ బాల కార్మికుల అష్టావధానం మొదలు అవుతుంది. రాత్రి 8 గంటల వరకు క్షణం తీరిక ఉండదు. మధ్య మధ్యలో మెకానిక్‌లు బండ బూతులు తిడుతూ ఉంటారు. ఎంతో దూరం నుంచి వారికి గంట గంటకి టీలు తీసకొచ్చి ఇస్తుండాలి. ఎన్నో సైకిళ్లకు డొక్కలు ఎగిసి పడేలా గాలి కొట్టాలి. కొందరు పెద్ద మనుషులు' గాలి కొట్టించుకొని చిల్లర లేదంటూ చల్లగా పోతారు. అప్పుడు చూడాలి ఆ బాలల దీన వదనం! ప్రభుత్వం ఖర్చుని భావించకుండా ఇటువంటి బాలలను



ఉచిత భోజన వసతి సౌకర్యం గల పాఠశాలల్లో చదివిస్తే ఎంతో బాగుంటుంది. అటువంటి మంచి రోజు వచ్చి బాల కార్మికుల బతుకుల్లో వెలుగులు నిండాలని కోరుకుందాం!

-పుట్టా సోమన్నచౌదరి,
కాకినాడ





* * *

పిల్లలు దైవ స్వరూపులన్నారు పెద్దలు. ఈ ఆర్యుల మాట మరచిపోయి మనలో చాలమంది చిన్న పిల్లలను దూషించటం, హింసించటం జరుగుతుంది. ఇటీవల ఒక దినపత్రికలో ఒక వార్త వచ్చింది. అదేమిటంటే పరీక్ష తప్పినందుకు ఒక బాలికను క్రూరంగా హింసించి మానసిక సంఘర్షణకు గురి చేశారు. తత్ఫలితంగా ఆ బాధను భరించలేని ఆ బాలిక ఇంటి నుంచి వెళ్ళిపోయి వీధుల వెంబడి తిరుగుతూంటే ఒకరు ఒక స్వచ్ఛంద సేవా సంస్థలో చేర్పితే వారి వద్ద చికిత్స పొందుతుంది.. ఆ బాలిక యెడల ఆ తల్లిదండ్రులు ఎంత విచక్షణా రహితంగా ప్రవర్తించారో అర్థం చేసుకోండి.



పరీక్ష పోయినప్పుడు , మార్కులు తక్కువ వచ్చినప్పుడు బాలబాలికల్ని చాలామంది క్రూరంగా కొడుతుంటారు. కొందరు లెదరు బెల్టులతో కొట్టడం, కడ్డీలు కాల్చి వాతలు పెట్టడం కూడా చేస్తుంటారు. అది చాలా తప్పు పని.





పిల్లల్ని హింసించి మన దారికి తెచ్చుకోలేము. మంచి మాటలతో మన దారికి తెచ్చుకోవాలి. కొట్టడం, తిట్టడం, హింసించడం ద్వారా వారు తల్లిదండ్రుల మీద కోపంతోనో, భయంతోనో, అసహ్యంతోనో ఇల్లు వదలి వెళ్ళిపోయే ప్రమాదముంది. పిల్లల్ని మంచి మాటల ద్వారా మన ఇష్టం వచ్చిన రీతిలో మలచుకోవచ్చు.

ఈ మధ్య చాలమంది ఆడపిల్లల పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపక నిర్లక్ష్యం చేయటం జరుగుతుంది. ఆడపిల్లలంటే అసహ్యభావం చూపుతున్నారు. "కట్న కానుకలు ఇచ్చి మనం సాగనంపాలి, ఈ పాడు పిల్ల పుట్టక పోయినా బాగుండేది" అనే సూటిపోటి మాటలతో వారి లేత మనసులను గాయపరుస్తున్నారు. ఆడపిల్లలుగా

## చిన్నారులను హింసించకండి

పుట్టడం వారు చేసుకొన్న పాపమా? మనకు ఏ పిల్లలు అయినా ఒకటే. బాలలైనా, బాలికలైనా మనం కన్నబిడ్డలే అని గుర్తించుకోవాలి.

పిల్లలు ఏదయినా పెడతామంటే చేయి చాపుతారు. కొడతామంటే పారిపోతారు. కనుక పిల్లల్ని హింసించి వారి హృదయాలను గాయపరచక, మంచి మాటలతో మన దారికి తెచ్చుకోవాలి. చిన్నారులను హింసించటం మానాలి.

-పి. యం. సుందరరావు,
ఫిరంగిపురం ☐

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారిపేరు :........................................

పూర్తి చిరునామా :........................................

........................................

........................................

పిన్‌కోడ్:

# దేహో కోహమా!

## దేవినేని ఉష

విరజ బాక్ డోర్ తీసుకుని దిగింది

డ్రైవర్ సలామ్ చేసి కారు వెనక్కి తిప్పాడు

హాయ్ విరజా!! అంటూ పదిమంది అమ్మాయిల వరకూ విరజ చుట్టూ జేరారు

విరజ అందర్నీ చిఱు నవ్వుతో పలకరిస్తూ ముందుకు సాగింది అమ్మాయిలు ఆమెను అనుసరించసాగారు

అది కో ఎడ్యుకేషన్ కాలేజీ విరజ వైజాగ్‌లో ఇంటర్ పూర్తి చేసింది తండ్రి ఒక పెద్ద కంపెనీకి డైరెక్టర్ వాళ్ళకు తాత తండ్రుల ఆస్తి కూడా చా లా సంక్రమించింది విరజ తల్లీ తండ్రికీ ఆమె ఆమె చెల్లెలు శాంతి ఇద్దరే ఎల్లలు విరజ సౌకుమార్యంగా ఉంటుంది తెల్లని మల్లెలోని సౌందర్యంలా ఆమె మెరిసిపోతూ ఉంటుంది

ఈ వేసవిలో విరజ తండ్రికి విజయవాడ ట్రాన్స్‌ఫర్ అయింది వైజాగ్ నుండి

విజయవాడలో కంపెనీలో విరజ తండ్రికి కారు కూడా బహుమతిగా ఇచ్చారు వాళ్ళ స్టేటస్ మరింతగాపెరిగింది

విరజ ఇక్కడకు వచ్చాకా బి ఏలో ఈ కాలేజీలో జేరింది రోజుకో రకం ఖరీదైన చీరలు కట్టి కారులో కాలేజీకి వచ్చే విరజ అంటే ఆ కాలేజీలో అందరికీ అభిమానం ఆమెను పలుకరించని వాళ్ళేలేరు ఆమె కూడా అందరితో స్నేహపూర్వకంగా మాట్లాడు తుంది

అబ్బాయిలు కూడా విరజ అంటే అభిమానం పెంచుకో సాగారు విరజ మాత్రం అబ్బాయిలతో మాట్లాడదు

అందంగా అలంకరించుకుని కో ఎడ్యుకేషన్ కాలేజీలో చదువుతున్న విరజకు అబ్బాయిలతో మాట్లాడే సోషల్ స్వభావం లేనందుకు చాలా బాధగా ఉంది వాళ్ళకు

అందరిలో కీ ముఖ్యంగా విరజతో మాట్లాడాలి అని ఆరాటపడే వ్యక్తి గోకుల్

గోకుల్ డిగ్రీ పస్టియర్ విరజ అంటే అతనికి చాలా అభిమానం ఆమెతో ఎలాగైనా స్నేహం సంపాదించాలని అతని తాపత్రయం

విరజ అనుక్షణం తనను గమనిస్తూన్న గోకుల్‌ను ఎప్పుడు తలెత్తి చూడలేదు అతను ఒకడు ఉన్నాడని కూడా ఆమెకు తెలియదు

అమ్మాయిలు చాలామంది గోకుల్‌ను ఇష్టపడ తారు అతను కూడా ఆఫీసర్‌గారి అబ్బాయే మంచి డ్రెస్‌లు వేసుకొస్తాడు కారులో కాదుకానీ స్కూటర్ మీద రోజూ కాలేజీకి వస్తాడు

* * * * *

క్లాస్ రూంలో లెక్చరర్ లెసన్ చెప్తున్నారు అంతా నిశ్శబ్దంగా వింటున్నారు విరజ చెక్కిట చెయ్యి జేర్చి శ్రద్ధగా వింటోంది

బాణంలా ఏదో వచ్చి వీపుకు తగిలింది

తలవంచి బుక్‌లోకి చూస్తున్న లెక్చరర్ ఇది చూడలేదు కానీ విరజ ఉలిక్కిపడి తల ■ప్పింది పేపర్ రాకెట్‌లా చేసి వేసారు అందరూ ఏకాగ్రతగా ఉన్నారు విరజ అటు ఇటు చూసి కిందకు వంగి ఆ పేపర్ విప్పింది అందులో సిరాతో ఏదో రాసారు

గబగబా చదివింది

మై డియర్ విరజా!!

ఐలవ్‌యూ!!

గోకుల్

అని ఉంది అది చదివిన విరజకు గోకుల్ ఎవరో అర్థం కాలేదు ఒకసారి మెడమీదుగా తల వెనక్కి తిప్పి చూసింది అబ్బాయిలు అందరూ బుద్ధిమంతుల్లా పాఠం వినటమే తమ జీవిత ధ్యేయం అన్నట్టు తలలు వంచి లెసన్ వింటున్నారు

విరజ ఆ కాగితం మడిచి బుక్‌లో పెట్టేసి లెక్చరర్ చెప్పే లెసన్ మీద మనసు లగ్నం చేసింది

* * * * *

ఆ సాయంత్రం డ్రైవర్ కారు తెచ్చాడు విరజ అతనికి ఏదో మెల్లగా చెప్పింది

డ్రైవర్ తలూపి అబ్బాయిలు నిలబడ్డచోటుకు వెళ్ళాడు కొంత సేపు అక్కడ అబ్బాయిలతో మాట్లాడి వచ్చాడు

తెలిసిందా "అడిగింది

అమ్మాయిగారూ! అదుగో గోకుల్ అంటే రెడ్ షర్ట్ వేసుకున్నాడు చూసారా " అంటూ అక్కడకు కాస్త దూరంలో నిలబడ్డ గోకుల్‌ను చూపించాడు

విరజ సాలోచనగా తల పంకించింది

* * * * *

మర్నాడు గోకుల్‌కు ప్రిన్స్‌పాల్‌గారి నుండి పిలుపు వచ్చింది ఆయన రూమ్‌లోకి వచ్చాడు

గోకుల్ ఏమిటిది?? ఆయన కోపంగా విరజ ఇచ్చిన పేపర్ అతనికి ఇచ్చారు

గోకుల్ అది చదివాడు ఆశ్చర్యంతో అతని మొహం పాలిపోయింది

అయాం సారీ సార్! నాకేం తెలియదు అమాయకంగా మొహంపెట్టాడు

నాటకాలు ఆడుతున్నావా 'గద్దించారు

ఇంతలో విరజ వచ్చింది తనకు రాకెట్‌లా ఆ లెటర్ ఎలా అందిందో చెప్పింది

వింటున్న గోకుల్ మొహం ఎర్రబడి పోయింది

మిస్ మీ పేరు విరజ అని నాకు ఇప్పుడే తెలిసింది మిమ్మల్ని రోజూ చూస్తున్నాను కానీ నాకు ఇప్పుడు ఈ చీటీ చూసాకనే మీ పేరు తెలిసింది నా పేరుతో ఎవడో మీకు ఇలా రాసాడు అంతే నాకేం తెలియదు

సార్ ఇతని మాటలు నమ్ముతున్నారా!! ప్రిన్స్‌పాల్‌ను ప్రశ్నించింది విరజ

ఆయన చిక్కుల్లో పడ్డారు గోకుల్ ఇంటర్ రెండు సంవత్సరాలూ ఇక్కడే చదివాడు అతని గురించి ఆయన ఎప్పుడూ చెడుగా వినలేదు, ఇప్పుడు తొందరగా నమ్మలేకపోతున్నారు

గోకుల్! నువ్వు ఈ కాలేజీలోకి వచ్చాక నీ మీద నేను కంప్లైంట్ వినడం ఇదే మొదటిసారి అందుకే ఈ సారికి నిన్ను క్షమిస్తున్నాను మరోసారి ఇలా ప్రవర్తిస్తే పనిష్ చేయాల్సి ఉంటుంది మెత్తగా చివాట్లు పెట్టారు

గోకుల్ తల ఎత్తాడు అతని కళ్ళనిండా నీళ్ళు ఒక్కసా రిగా చలించింది విరజ

వస్తా సార్!!! అంటూ గోకుల్ వెళ్ళిపోయాడు

అతని కళ్ళలో నిలిచిన కన్నీరు విరజ కళ్ళలో పదేపదే మెదిలేవి వేరే ఎవరైనా రాసి అతని పేరు పెట్టారేమో!! అనిపించింది

మర్నాడు గోకుల్ కాలేజీకి రాలేదు విరజ అతను రాలేదని గమనించింది అయినా పెదవి విప్పి ఎవరినీ అతని మాట అడగలేదు అతనిమీద తను ప్రిన్స్‌పాల్‌కు రిపోర్ట్ చేసి ఇవాళ అతని గురించి అడిగితే పరువు పోతుందని తెలుసు

* * * * *

విరజకు కాలేజీ ఎడ్రెస్‌కు ఇన్లాండ్ లెటర్ వచ్చింది ప్యూన్ ఇచ్చాడు తనకు ఈ ఎడ్రెస్‌కు లెటర్ వ్రాసిందెవరా అని ఆమెకు ఆశ్చర్యం కలిగింది ఓపెన్ చేసింది

మిస్ విరజా!!

మీరు నన్ను చాలా అపార్థం చేసుకున్నారు మీరు ఊహించుకున్నట్టు ఆ లెటర్ నేను రాయలేదు ప్రేమలూ దోమలూ అసలు నా వంటికి పడవు

ధైర్యంలేని ఎవరో నా పేరు ఉపయోగించుకున్నారు ఎప్పటికైనా మీరు ఇది నమ్మండి నమ్ముతారని కనీసం ఆశపడతాను

ఇట్లు గోకుల్

లెటర్ జాగ్రత్తగా నోట్‌బుక్‌లో దాచింది ఆ రోజు గోకుల్ కాలేజికి వచ్చాడు విరజవేపు అతను కన్నెత్తి కూడా చూడలేదు తన లెటర్ ఆమెకు చేరిందా లేదా అన్న ఆసక్తి కూడా చూపలేదు

విరజ క్రీగంట అతన్ని చూస్తూనే ఉంది

* * * * *

నాలుగు నెలలు గడిచేసరికి విరజ మనసులో గోకుల్ రూపం చోటు చేసుకొనసాగింది గోకుల్ మాత్రం విరజను పట్టించుకోకుండా శ్రద్ధగా చదువుకోసాగాడు

తనే అప్పుడప్పుడు గోకుల్‌ను పలకరించసాగింది

మిస్ విరజా!! మీరు ఆడవారు నన్ను మీరు పలుకరించినా నా మీద ఏదైనా రిపోర్ట్ ఇవ్వగల సామర్థ్యం మీకు వుంది ప్రిన్సిపాల్‌గారు మీ మాటే నమ్ముతారు దయచేసి నన్ను పలుకరించకండి సున్నితంగా కోరాడు

విరజ నవ్వింది అప్పుడు మిమ్మల్ని అపార్థం చేసుకుని అలా రిపోర్ట్ ఇచ్చాను నాలుగు నెలలుగా మిమ్మల్ని గమనిస్తున్నాను మీ మీద నాకేం కోపంలేదు ఐ లవ్‌యూ!! ఫ్రాంక్‌గా చెప్పేసింది

గోకుల్ మొహం సంతోషంతో వెలిగిపోయింది

నన్ను నమ్మమంటారా!! అడిగాడు

నమ్మండి నవ్వుతూ అప్పుడే వచ్చిన కారు ఎక్కింది కారు కదిలి వెళ్ళిపోయింది

* * * * *

అమ్మా!! ఇవాళ హోటల్ మమతలో పార్టీ ఉందిగా వస్తారా?? అడిగాడు విరజ తండ్రి

అలాగే నాన్నా వస్తాం హుషారుగా అంది విరజ చెల్లెలు శాంతి

విరజ కూడా తయారై తండ్రీ చెల్లెలుతో హోటల్ మమతకు వచ్చింది

హోటల్ బైట అబ్బాయిలు నలుగురు నిలబడి నవ్వుతూ మాట్లాడుకుంటున్నారు వాళ్ళలో ఉన్న గోకుల్‌ను చూసింది విరజ

నాన్నా మీరు పదండి నేను వస్తాను సైగ జేసింది తండ్రి చెల్లితో పలకి వెళ్ళారు

విరజ గోకుల్ వాళ్ళ పక్కగా వెళ్ళింది నోరు తెరిచి గోకుల్‌ను పిలవబోయింది అంతలో గోకుల్ నోటి నుండి తనపేరు వినబడటంతో ఆగిపోయింది

గోకుల్! మొత్తానికి సాధించావురా! విరజ మొదటిసారిగా మన కాలేజీలో నిన్నే పలుకరించింది అబ్బాయిలలో

అంతే కాదరా ఐ లవ్‌యూ అంది ఆ మాట అనిపించుకోవటానికి ఎంత శ్రమపడ్డాను నాలుగు నెలలు నా కత్యంత ప్రాణం అయిన విరజను కన్నెత్తి చూడలేదు ప్రిన్సిపాల్‌గారి దగ్గర విరజ చూస్తుండగా ఆడపిల్లలా ఏడ్చాను బుద్ధిమంతుడిలా లెటర్ రా కు అసలు మొదట ఆమెకు ఐ లవ్‌యూ గోకుల్ అంటూ రాసింది నేనే తరువాత నాకేం తెలియదని అమాయకత్వం నటించాను ప్రేమతో విషం అయినా తాగించవచ్చు కానీ కోపంతో పాలుకూడా తాగించలేంరా! అందుకే విరజ ప్రేమ పొందడానికి ప్లాన్ ప్రకారం జరుపుతూ వచ్చాను

అంతా విన్న విరజ మొహం ఎర్రగా కంది పోయింది

విసురుగా హోటల్‌లోకి వెళ్ళిపోయింది

గోకుల్ అతని మిత్రులు ఆమెను చూడలేదు కిళ్ళీషాప్ దగ్గరకు వెళ్ళి నవ్వుకుంటూ కూల్‌డ్రింక్‌లు తాగసాగారు

* * * * *



# దేవీ కోపమా

మర్నాడు కాలేజీలో విరజ ఎప్పటిలా గోకుల్‌ను తలెత్తి చూడలేదు

గోకుల్ ఆమెను పలకరించాలని చూసాడు అయినా విరజ సీరియస్‌నెస్ చూసి మాట్లాడలేక పోయాడు

సాయంత్రం కారు ఎక్కుతున్న విరజ దగ్గరకు వచ్చాడు గోకుల్

విరజా!! నా మీద అలిగావా!! నవ్వుతూ పలుకరించాడు

విరజ అతన్ని కాలో గోళా చూసింది విసురుగా వెనుక సీట్లో కూర్చుని డ్రైవర్ కారుపోనీ ఆజ్ఞాపించింది

కాలిపోయిన మోహంతో నిలబడ్డ గోకుల్‌ను పరిహసిస్తూ కారు వెళ్ళిపోయింది

విరజ ఎందుకలా మారిపోయిందో గోకుల్‌కు అర్థం కాలేదు

అతని కథ మళ్ళీ మొదటికి వచ్చింది. గోకుల్ విరజను పిచ్చిగా ప్రేమించాడు ఆమె అంగీకరిస్తే త్వరలో పెళ్ళికూడా చేసుకోవాలనే నిర్ణయం తీసుకున్నాడు

విరజ కొత్తలో మగవాళ్ళను తలెత్తి కూడా చూసేదికాదు ఎన్నో నాటకాలు ఆడి చివరకు ఎలాగో ఆమె మనసులో స్థానం సంపాదించుకున్నాడు స్వయంగా ఆమె నోటితో ఐ లవ్ యూ!! అనిపించుకున్నాడు

మళ్ళీ ఇంతలో ఇదేమిటి? అతనికేం అర్థం కాలేదు నిన్న హోటల్ దగ్గర ఆమె తన మాటలు విని వుంటుందన్న ఆలోచనే అతనికి రాలేదు అవే మాటలు కాలేజీలో మాట్లాడితే ఎవరైనా చెప్పారు అనుకునేవాడు నడిరోడ్డుమీద మాటలు ఆమెకు చేరి ఉంటాయన్న ఐడియా అతనికి కలలో కూడా రాలేదు

ఆ రోజేకాదు నెల రోజులు గడిచిపోతున్నా విరజ ప్రవర్తనలో మార్పులేదు గోకుల్‌ను మాట్లాడించటంలేదు గోకుల్ ఆమె అనుగ్రహం కోసం ఎంతో ప్రయత్నించాడు అయినా లాభంలేదు ఆమె చూసేలా బీరు బాటిల్స్ తాగేవాడు సిగరెట్లు తాగేవాడు దేవదాస్‌లా యాక్షన్ చేసేవాడు

విరజ అదంతా చూసినా మొదటిసారిలా నాటకాలు ఆడుతున్నాడనుకుని మరింత కోపం పెంచుకుంది

ఆరోజు విరజకు లెటర్ వచ్చింది యదాలాపంగా విప్పి చదివింది గోకుల్ లెటర్

విరజ కోపం ఎందుకో తెలియలేదని ఆమెపై విరహంతో వేగిపోతున్నానని రాసాడు

విరజ క్లాస్ రూంలో గోకుల్ చూస్తుండగానే ఆ లెటర్ చింపి ముక్కలు బాస్కెట్‌లో వేసింది

విరజకు తన మీద అంత కోపం ఎందుకో తెలియని గోకుల్ స్థాణువయ్యాడు

* * * * *

విరజ వరండాలో నిలబడి లెసన్ చదువుకుంటోంది గేటు తీసిన చప్పుడు విని తలెత్తింది ఎదురుగా గోకుల్ మొహం పీక్కు పోయి కళ్ళు గుంటలు పడ్డాయి

సమయానికి ఇంట్లో తండ్రి లేనందుకు రిలీఫ్‌గా ఫీలయింది

ఏమిటి? నిర్లక్ష్యంగా అడిగింది

విరజా!! చల్లని చేయూత అందించినట్టే అందించి నన్ను నీ స్నేహలతకు దూరం చేయడం న్యాయమేనా! జాలిగా చూస్తూ అడిగాడు

అతని మొహంలో వాస్తవంకంటే నటనే ఎక్కువగా కనిపించింది

అమ్మా!! అమ్మా తల్లిని పెద్దగా పిలిచింది

గోకుల్‌కు ఏం అర్థం కాక అలాగే నిలబడ్డాడు

విరజ తల్లి వచ్చింది

అమ్మా! అతనికి బిక్షం కావాలట పెట్టు అంటూ రూమ్‌లోకి వెళ్ళిపోయింది

గోకుల్ హృదయం దెబ్బతింది

ఆవిడ ఉండు నాయనా!! అంటూ లోపలకు వెళ్ళింది

గోకుల్ విసురుగా బైటపడ్డాడు

* * * * *

మర్నాడు విరజ కాలేజీకి వచ్చేసరికి కాలేజీ అంతా గగ్గోలుగా ఉంది గోకుల్ రాత్రి స్లీపింగ్ పిల్స్ మింగాడట అతన్ని హాస్పిటల్‌లో జేర్చారు అతని పరిస్థితి అంతగా బాగోలేదు

విరజ అది విని కంగారు పడిపోయింది నిన్న తను ఇంటికి వచ్చి తన స్నేహాన్ని అర్థించిన అతన్ని తను ఎంత అవమానించిందో గుర్తు తెచ్చుకుంది తన ప్రవర్తనతోనే అతను ఆత్మహత్యకు పాల్పడి ఉంటాడు అయినా అతను ఎన్ని నాటకాలు ఆడినా తన ప్రేమ సంపాదించడానికే ఆడాడు అతనికి తనంటే ఎంతో ప్రేమ ఆ ప్రేమతోనే మొదట తనకు లవ్ లెటర్ వ్రాసాడు ఆ రోజు ప్రిన్సిపాల్‌గారు డిబార్ చేస్తే అతని లైఫ్ నాశనం అయ్యేది అతను అందుకు కూడా జడవలేదు అతని ప్రాణంపోతే ఆ పాపం తనకే

విరజ బండబారిన మనసు కాస్త కాస్త కరగసాగింది క్లాసు మానేసి గోకుల్ ఇంటి అడ్రెస్ అతని ఫ్రెండ్ ఒకతన్ని అడిగి అతనింటికి వెళ్ళింది

అతని ఇల్లు తమ ఇంటికంటే నీట్‌గా ఉంది హాల్లో గోకుల్ తల్లీ తండ్రీ కూర్చుని ఉన్నారు

గోకుల్‌గారు ఏదో అడగబోయింది

గోకుల్ ఆ రూమ్‌లో ఉన్నాడు వెళ్ళమ్మా!! ఎదురు రూమ్ చూపించారు

గోకుల్ ఏ స్థితిలో ఉన్నాడో అని విరజ గుండె దడదడలాడుతూ ఉండగా ఆ గదిలోకి అడుగు పెట్టింది

నవల చదువుకుంటున్న గోకుల్ విరజను చూసాడు సంభ్రమంతో ఆమెను చూసాడు

గోకుల్ నా కోసం ఎంత సాహసం చేసారు ప్రమాదం తప్పినట్టేనా! అడిగింది

డోంట్‌వర్రీ!! మందు బిళ్ళలు అన్నీ కక్కించేశారు ఇప్పటికైనా కోపం పోయిందా దేవీ! చిన్నగా అడుగుతూ చేతులు చాపాడు

విరజ వచ్చి ఆ చేతుల్లో వాలిపోయింది □






# వారఫలం

## 13-11-1987 శుక్రవారం నుండి 19-11-1987 గురువారం వరకు

★ **మేషం** ఎన్నో మార్పులు మీ రాశికి సమకూడినవి ధనమా? చక్కగా అనుకూలం వ్యాపారమా సర్వానుకూలం ఆదాయంలో ఏమాత్రం లోపం లేదు వాహన సేకరణకు అవకాశం స్త్రీలకు రాజకీయంగా మేలుగాదు ధన లోపంలేదు

★ **వృషభం** శుభం యింట జరుగుట నిశ్చయం అనుకూల మిత్రులు చేరుతారు ధనాదాయ మున్నది కళా సాహితీ రంగాలలో మేలున్నది సినీ రంగానుకూలత గల వారం స్త్రీలకు బంధు వర్గీయుల రాక ఉత్తరాల మూలంగా పలు విషయములు గ్రహించుట స్థితి యందు మార్పు సంభవం

★ **మిదునం** దూర ప్రాంతాలకు వెళ్లనున్నారు కొందరు కొందరు రాజకీయంగా అనుకూలం సాధించనున్నారు గృహ పరిస్థితి యందు అభివృద్ధి కొందరకు నూత్న విధాన ఆదాయముంటుంది గ్రహించాలి స్త్రీలకు పదిమందిలో ప్రసిద్ధి సభా గౌరవం పత్రికాగౌరవానికి ఆస్కారమున్నది

★ **కర్కాటకం** అనుకూల మిత్రులున్నారు సహాయం గ్రహించండి మేలు పొందండి వ్యాపారం చేస్తున్నారా? మేలే పదిమంది సహాయంతో ఏదో అనుకూలత చేకూరనున్నది వస్తు సేకరణకు ఆస్కారం అభివృద్ధికరములైన మార్పులు రానున్నవి స్త్రీలకు వృత్తియందు వృద్ధి సంఘ గౌరవం బంధు సమాగమం

★ **సింహం** మీ మాటకు విలువ చేకూరుతుంది పదిమందిలో మాటకు చలామణి శుభకార్యా లోచనలు బందువులకు సహాయం చేయవలసిన అగత్యం సాధు సజ్జన సంపర్కం స్త్రీలకు ధనలబ్ధి అనుకూల వార్తా శ్రవణం ధనాన్ని మించిన వ్యయం

★ **కన్య** చాలా కాలంగా యింటికి రాక నిరాకరించిన వారు యిల్లు చేరుతారు మాట వినని వారు లొంగిపోవటం దూర ప్రాంతాలకు వెళ్ల యత్నిస్తారు కొందరు ధనవంతుల సాహచర్యం కొందరకు లభ్యంకాగలదు స్త్రీలకు వృత్తియందు వృద్ధి అనుకూల వార్తా శ్రవణం

★ **తుల** మీకు ఈ వారం ఒకటారెండా అనేక విషయాలలో జోక్యం ఉంటుంది ప్రభుత్వపరంగా జరుగవలసిన పనులు గాని డబ్బు గాని వారాంతానికి అందుతుంది కృషిలో ఎలాంటి లోపం లేకుంటే వారమంతా అనుకూలమే స్త్రీలకు వాహన సుఖం బంధు సమాగమం

★ **వృశ్చికం** ఏ పని చేసినా వెనుక ముందుల త్రొక్కులాట అనుకూల మిత్రులు చేరుతారు మీరు వ్యాపారం చేసేలాగైతే మేలే ధన విషయంలో ఎలాంటి యిబ్బంది రాదు గ్రహించి మెలగండి స్త్రీ లకు ఎత్రార్థిత విషయంగా తర్జన భర్జనలు రానున్నాయి

★ **దనుస్సు** చాలమందికి ఈ రాశి జాతకులకు విశేష ఆదరణ యున్నది వ్యాపారానుకూలమున్నది వాహన సేకరణ ఆలోచనలు ఫలిస్తాయి విద్యా వినయ సంపన్నుల సహకారమున్నది ఇన్ని విదాల మేలున్నప్పుడు మరేం కావాలి స్త్రీలకు ఉద్యోగమందు అనుకూలం దనలబ్ధి

★ **మకరం:** ఏ పని చేసినా మేలే వ్యాపారం చేయండి అనుకూలమే దూర ప్రయాణాలు సాగించండి అనుకూలమే ముఖ్య బందువర్గంతో శుభ వ్యవహారాల రీత్యా సంబాషించండి మేలే చాలా కాలంగా విరోదించిన వారు దాపున చేరుతారు స్త్రీలకు : వ్యాపారం చేస్తారా? మేలే దనాదాయమున్నది

★ **కుంబం** ధన దాన్య వసతికి వాహన అనుకూలతకు ఆస్కారమున్నది కుటుంబానంద మున్నది సబా మర్యాద చేకూరుతుంది కొందరకు పత్రికానుకూలతకు ఆస్కారం దైవకార్యానుకూలత స్థితిగతులందు వృద్ధి చేకూరగల వారం స్త్రీలకు సర్వానుకూల వారం విశేషాదరణ లాబ సమయం

★ **మీనం** చాలా కాలంగా వ్యాపారరీత్యా మీరు గావించిన యత్నాలు ఈ వారం సానుకూలం మీ యింట జరగవలసిన శుభ వ్యవహారాలు ఈ వారం సానుకూలం కాగలవు ఒకానొక వ్యాపార విషయంలో అభిప్రాయభేదం రావచ్చు గ్రహించండి స్త్రీలకు యాత్రానుకూలం దైవ కార్య ప్రసక్తి వృత్తియందు మేలు చేకూర గల వారం

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

సీరియల్

# డి.ఎస్.పి.విజయ్

ఆమూరి సావిత్రి



(గత సంచిక తరువాయి)

అది ఆ నగరంలో పేరుమోసిన నైట్ క్లబ్

బాగా డబ్బున్నవాళ్లకది భూతల స్వర్గం

మధ్య తరగతి వాళ్లకి అందుబాటులో లేని అరచేతి వైకుంఠం

పాశ్చాత్య సంగీతపు కాంబినేషన్‌తో ఒకరి నొకరు పలకరించుకోటం గ్లాసులశబ్దం గాజుల గలగలలు వాతావరణానికి ఉత్తేజాన్ని జోడిస్తున్నాయి

ఆ క్లబ్బులో అడుగుపెట్టిన విజయ్ డయాస్‌కి సమీపంలో ఉన్న వ్యక్తుల్ని చూసి ఇహముందుకెళ్లకుండా ఒక కార్నర్‌లో ఉన్న కుషన్ ఛెయిర్‌లో కూర్చున్నాడు

ఆ వ్యక్తుల్లో రంగారావు వున్నాడు అతని పక్కనున్న వ్యక్తి విదేశీయుడు అతి తెలుపు చిన్ని చిన్ని ఎల్లి కళ్లు కళాకాంతులు లేక వెల వెలబోతున్న చప్పిడి మొహం ఆ మొహంలో దాగిఉన్న క్రౌర్యం

అతనితో ఏదో సీరియస్‌గా చర్చిస్తున్నాడు రంగారావు

లేడీసండ్ జంటిల్మెన్ మీరిప్పుడు మిస్ కాంచనమాల డాన్స్ ప్రోగ్రాం చూడబోతున్నారు

ఆమె గురించి మేమేం చెప్పినా అతిశయోక్తిగానే ఉంటుంది ఆమె సౌందర్యాన్ని వర్ణించటానికి మాటలు సరిపోని కారణంగా మేమేమీ చెప్పటంలేదు కొద్ది క్షణాల్లో ఆమె స్టేజీ మీదికి రాబోతున్నారు

అనౌన్స్‌మెంట్ విన్నాక కొందరి మొహాల్లో ఎగతాళితో కూడిన నవ్వు కొందరి మొహాల్లో నిర్లక్ష్యం తప్ప పెద్దగా ఎవరూ స్పందించలేదు

కళ్లు మిరుమిట్లుగొలిపేలా ఒక మెరుపు మెరిసినట్లు ఆకాశంలో నుంచి ఉల్క జారిపడినట్లు కాంచనమాల డయాస్ మీదకొచ్చి స్టయిల్‌గా అభివాదం చేసింది

ఈ ప్రకటనలు మామూలే ఈ అందాల్లో కొత్తేమీ ఉండదు అనుకున్న వాళ్లంతా అటువేపే నిశ్చేష్టులై చూస్తుండిపోయారు

ఒక రెప్ప వేస్తే ఒకంత ఊపిరి తీస్తే ఇంచుకంత కదిలితే ఆమె ఏ విన్యాసాన్ని మిస్సయి పోతామో అన్నంత ఉద్వేగంగా ఉన్నారంతా

వెయిటర్స్ కదులుతుంటే అయ్యే అతి చిన్న శబ్దాన్ని కూడా భరించలేక విసుగ్గా చూస్తున్నారు

కస్టమర్స్ మానసిక స్థితిని గుర్తించిన వారిలా వెయిటర్స్ కదలటం మానేశారా అన్నంత నిశ్చలంగా మారిపోయారు

హఠాత్తుగా అక్కడ పిన్ డ్రాప్ సైలెన్స్ ఏర్పడింది

ఆమె పెదవి విరుపులో ఒక అందం కంటి కొసలో ఒక అందం చిరుపాదపు గజ్జల సవ్వడిలో ఒక అందం బుగ్గల మీదున్న నునులేత ఎరుపులో తలవెంట్రుకల నిడివిలో కొనగోటి కదలికలో లయబద్ధంగా వేసే ప్రతి అడుగులో

అందం అందం అందం!

ప్రపంచంలో ఉన్న సౌందర్యాన్నంతా దూసుకొచ్చి కుప్ప పోసినట్లుంది

ఆమె మనిషా దేవకన్యా??!!

హఠాత్తుగానే మళ్లీ ప్రారంభమయిన మ్యూజిక్‌తో కాస్త తెప్పరిల్లారంత

కుబుసం విడిచిన పాములా ఉందామె

డయాస్ మీద ఆమె కదులుతుంటే ఆ విన్యాసాల వేగం కంటి చూపులకు దొరకటంలేదు

ఆమె బట్టలు ధరించిన తీరు ఆమె అందాన్ని రెట్టింపు చేస్తోంది ఆమె ఒంటిరంగు పాలు గంధం గులాబీ రేకులుకల గలిపినట్లుంది కళ్లు మీనాల్లా తళతళలాడుతున్నాయి

ఎవరీ అద్భుత సౌందర్య రాసి? ఎక్కడి నుంచొచ్చింది??? ప్రతి వారి మనసులో ఇదే ప్రశ్న

విజయ్ మనసు ఒక జ్ఞాపకం కోసం పెనుగులాడుతోంది ఆమెను తనెక్కడో చూశాడు

ఎక్కడ??

చప్పున గుర్తొచ్చింది

ఆమె వింధ్య!!

ఆమె అందగత్తె కానీ మరీ ఇంత శృంగారమా!

ఈ మేకప్ వస్త్రధారణ ఆ నాటికి పూర్తి భిన్నంగా ఉంది అప్పుడు ఒకసారి మాత్రమే ఆమెను చూసిన వారు తిరిగి ఇప్పుడు చూస్తే ఇద్దరూ ఒకటేనని పోల్చడం కష్టం

కానీ ఆమె వింధ్యే

తను పోలచడదు

ఈమె ఇక్కడికి ఎందుకొచ్చినట్లు? ఎక్కడో ఉద్యోగం చేస్తున్నానంది?

ఈ నైట్ క్లబ్బులో ఇంత మంది ఎదుట డాన్స్ చేస్తూ అందరి చూపులకూ మాటలకూ కేంద్ర బిందువై కోరికోరి ఆమె ఎందుకింత ప్రమాదాన్ని కొని తెచ్చుకుంటోంది?

డబ్బుకోసమా?

దాన్ని అదనంగా సంపాదించాల్సినంత అవసరముందా?

ఆ అవసరం ఏ విధంగానైనాసరే డబ్బు సంపాదించి తీరాల్సినంత ముఖ్యమైనదా??

తన కెవరూ లేరంది?

మరి ఉద్యోగం చేసి సంపాయించే డబ్బు తన కొక్కదానికీ సరిపోదా??

**జరిగిన కథ – 16** జగదీష్ తమ్ముడు మురళి ఇంద్రాపూర్‌కు ఎస్.ఐ.గా వస్తాడు మాటల సందర్భంలో విజయ్ మురళి దగ్గర సౌందర్య ప్రస్తావన తెస్తాడు మురళి సౌందర్యను పరిచయం చేసుకుని ఆకర్షించబడతాడు ఆమెను పెళ్ళి చేసుకోవడానికి సిద్ధమౌతాడు. రాజేంద్ర [illegible] విజయ్ ఇంటి నానీ పడుకున్న గదిలోకి పాము ఎదురుతాడు. పట్టుబడి సైనైడ్ మింగి ఆత్మహత్య చేసుకుంటాడు




ఎరిపోనంత ఖరీదైనలవాట్స్ కి బానిసా ఈమె??

ఆలోచిస్తూ ఆమె అభినయాలను చూస్తున్నాడు విజయ్

ఆమె అర్ధనగ్నంగాలేదు

అయినా బారమైన గుండెల్ని సన్నని నడుమును నున్నగా మెరుస్తున్న పొట్టమీద అందమైన ముడుతని బరువైన జఘనభాగాన్ని ఆమె ఒంటిమీదున్న మెత్తని సిల్క్ చీర దాచలేకపోతోంది

ఆయా భాగాల దగ్గర ఆచ్ఛాదన విషయంలో ఆమె అట్టే శ్రద్ధ తీసుకోలేదు

కనీ కనపడకుండా ఊరిస్తున్న ఆమె అందం మగాళ్ళకి వెర్రెక్కిస్తోంది తమ సర్వస్వం దారపోసయినా ఆమెను తమ స్వంతం చేసుకోవాలనే ఉద్వేగం ప్రతి వాళ్ళకి కలుగుతోంది రంగారావు పక్కనున్న విదేశీ యువకుడి కళ్ళు వింధ్యానే అతుక్కుపోయి ఉన్నాయి రెప్పవాల్చాలనే విషయాన్ని కూడా మర్చిపోయాడా అనిపిస్తోంది

ఆమె నాట్యం చేస్తోంది

మెడలో ఉన్న హారాలు జాకెట్‌లో దూరి గిరిశిఖరాల మధ్య చిక్కులు పడుతుంటే వాటిని లాక్కునే నెపంతో ముందుకు ఒంగి మెరుపులు కురిపిస్తోందామె

అంతా ఆ నిశ్చేష్టత నుండి తీరుకోక ముందే డాన్స్ పూర్తయి తెరపడింది

తేరుకున్న జనం సంభ్రమంతో కొట్టిన చప్పట్లతో ఆ హాలు దదరిల్లిపోయింది

# డి. ఎస్. పి. విజయ్

కొందరులేచి మేనేజరుతో గుసగుసలాడుతున్నారు ఆమె విషయం తెలుసుకోవాలని తహ తహలాడుతున్నారు

రంగారావు లేచి ఆ విదేశీయునితో సహా క్లబ్బు ప్రొప్రయిటర్ జయచంద్ర గదివేపుగా మెట్లెక్కి వెళ్ళటం చూసిన విజయ్ కొద్ది క్షణాలాగి అటు కదిలాడు

సౌండ్‌ప్రూఫ్ మూలాన లోపల్నుంచి మాటలు వినపడ్డంలేదు కానీ వాళ్ళిద్దరూ అక్కడికి దేనికెళ్ళారో విజయ్‌కి తెలుసు

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయాక తను జయచంద్ర రూంలోకి ప్రవేశించాడు విజయ్

డి ఎస్ పి గారా! రండి రండి చేతులు కలిపి ఆడంబరంగా ఆహ్వానించాడు జయచంద్ర

కాంచనమాలెవరు? అన్నాడు విజయ్

తెలీదు సర్ తడబడకుండా అన్నాడు జయచంద్ర

తెలీకుండానే మీ క్లబ్బుకొచ్చి డాన్స్ చేసిందా?'

నిజంగా తెలీదు తనంతట తనే వచ్చి నన్ను కలుసుకుని మా క్లబ్బులో డాన్స్ చేస్తానని ఒక్క రాత్రికి రెండువేలు కావాలని అడిగింది

ఆమెను చూశారుగా?? రెండువేలు పర్లేదనిపించింది

వెరైటీ కోసం వెర్రెక్కిపోయే కస్టమర్స్ గుర్తొచ్చి వెంటనే ఒప్పుకున్నాను

ఈ రాత్రే తన ప్రోగ్రాం అరేంజ్ చెయ్యమని కోరింది

ఆమె ఏదో ఆఫీస్‌లో ఉద్యోగం చేస్తోందట ఆ డబ్బు సరిపోదట ఆమె అవసరాలామెవి

మేము పిలిచినప్పుడల్లా ఇక్కడికొచ్చి డాన్స్ చేస్తే తగిన పారితోషికం ఇస్తానన్నాను

ఆమెకు రకరకాలైన నృత్యాలొచ్చు

కూచిపూడి మణిపురి డాన్సుల మొదలు లంబాడీ డాన్స్‌వరకూ అన్నీ చేసి ఒప్పించగలదు

రంగారావుగారేమంటారు??

మీరిలా నా కస్టమర్స్ రహస్యాల గురించి నన్నే అడిగి ఇబ్బందిలో పడెయ్యటం బావ్యంకాదు

నేను పోలీసాఫీసర్ని ఎవర్నయినా దేనిగురించయినా అడిగే అధికారం జవాబు పొందగల కెపాసిటీ నాకున్నాయి

మీరిప్పుడా అధికారాన్ని ఉపయోగించబోతున్నారా??

ఆ అవసరం మన మధ్య రాకూడదని కోరుకుంటున్నాను




మనం మిత్రులం కాకపోవచ్చు కానీ శత్రువులం మాత్రం కాము కాకూడదనే నా కోరిక

ఆల్‌రైట్!! రంగారావు కాంచనమాల కావాలని అడిగాడు

యాభైవేలిస్తానన్నాడు ఆ పక్కనున్నతను యాభైకాదు లక్ష లక్ష ఇస్తాం అన్నాడు

ఆ విదేశీయుడెవరు?

తెలీదు

మీరేమన్నారు?

ఆమెను నేను కొనలేదు గనక అమ్మే హక్కు అవకాశం నాకు లేవని చెప్పాను

ఊఁ!!

ఆమె ఎడ్రస్ అడిగారు

ఇచ్చారా??

ఇవ్వననటానికి నాకే కారణాలు కనపడలేదు ఆ వ్యవహారమేదో వాళ్ళూ వాళ్ళూ తేల్చుకుంటారు ఇష్టమయితే ఓకే అనుకుంటారు లేకుంటే లేదు

ఆమె నో అనగానే వాళ్ళామె నొదిలి వెళ్ళిపోతారా??

ఏం చేస్తారు?

తెలియనట్టు మాట్లాడకండి ఏదయినా చేస్తారు బలవంతాన ఎత్తుకుపోతారు

అప్పుడెవరో ఒకరు మీకు రిపోర్టిస్తారు మీరెళ్ళి విడిపిస్తారు అంటూ నవ్వబోయి విజయ్ మొహంలో సీరియస్‌నెస్ చూసి ఆగిపోయాడు జయచంద్ర

మిమ్మల్ని నమ్మి ఆమె ఎడ్రసిస్తే ఇలా అందర్నీ ఉసిగొల్పటం అన్యాయమని మీకు తోచలేదా?? రెట్టిస్తున్నట్టుగా అన్నాడు విజయ్ అతనికి జయచంద్ర మీద అనుమానంగా ఉంది

రంగారావు నా రెగ్యులర్ కస్టమర్ అతనివల్ల మాకు కొన్ని లాభాలున్నాయి ఈ అమ్మాయి రాత్రే వచ్చింది అందుకనే అడ్రసివ్వటానికి వెనకాడలేదు డి ఎస్ పి గారూ ఎన్నియర్‌గా అన్నాడు జయచంద్ర

అదీగాక అడక్కుండానే ఆమె తన ఎడ్రెసిచ్చింది ఈ క్లబ్బులో డాన్స్ చెయ్యటానికొచ్చేవాళ్ళు సాధారణంగా అలాంటి పట్టింపులు పెట్టుకోరు వాళ్ళు కోరందే రక్షణనిచ్చే అవసరం మాకులేదు తన ఎడ్రస్ ఎవరికీ ఇవ్వద్దని ఆమె మాకు చెప్పలేదు అన్నాడతను

ఆ ఎడ్రసిటివ్వండి అన్నాడు విజయ్

జయచంద్ర అడ్రస కాగితాన్ని విజయ్‌కిచ్చాడు

బయటకొచ్చాక మళ్ళీ చూశాడు విజయ్

అది వింధ్య ఎడ్రస్ కాదు

అంటే? ఆమె వింధ్య కాదా?

ఇంపాసిబుల్! ఆమె వింధ్యే!!

ఒకసారి చూసిన మనిషి ఎన్ని వేషాలు మార్చినా గుర్తించటంలో తనెప్పుడూ పొరబడడు

జీపును కొత్త ఎడ్రస్ వేపు కాకుండా ఇంత క్రితం వింధ్య ఉన్న ఇంటికే పోనిచ్చాడు విజయ్

తన అంచనా ప్రకారం కొత్త ఎడ్రస్‌లో వింధ్య లేదని తెలుసుకున్న రంగారావు ఆమె అసలు ఎడ్రెస్ పట్టుకుని అక్కడికి చేరటానికి ఈ వ్యవధి చాలు

తామిద్దరూ సరిగ్గా ఒకేసారి అక్కడికి చేరుకుంటారు

అసలెవరీ వింధ్య?

ఆమె చెప్పింది కట్టు కథని ఇప్పుడర్థమవుతోంది ఆ రోజు రాత్రే తన డాన్స్ ప్రోగ్రాం ఏర్పాటు చెయ్యమని ఎందుకు కోరింది

అడక్కుండా అడ్రసెందుకిచ్చింది?

రాంగ్ ఎడ్రసివ్వటమెందుకు?

# నాకు నచ్చిన సన్నివేశం

"సార్! బాబు స్నానం చెయ్యనని మారాం చేస్తున్నాడు అన్నాడు. నౌకరు కుర్రాడు రాము

ఆలోచనల్లో నుంచి బయటపడి 'ఏం? ఎందుకనిట?" అన్నాడు విజయ్.

"ఏమో సార్. చెప్పటం లేదు."

"నానీ" అంటూ గదిలో కెళ్ళాడు విజయ్.



"ఎస్ అంకుల్" అన్నాడు నానీ లేచి నిలబడుతూ.

"స్నానం చెయ్యనన్నావా!"

"........"

"ఎవరైనా స్నానం చెయ్యటానికి పేచీ పెడతారా?"

"దర్టీగా వుండటమంటే నీ కిష్టమా!"

"............"

"అలా వుండే వాళ్ళంటే నా కిష్టముండదు."

"నాకు నాకు బట్టల్లేవుగా?"

నాని కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

అభిమానంగా తలొంచుకున్నాడు.

"ఓహ్! సారీ! నాదెంత మొద్దుబుర్ర" అంటూ అప్పటికప్పుడు రాముని పంపి నానికి కావల్సిన వస్తువులన్నీ తెప్పించాడు విజయ్.

స్నానం చేసి నీట్‌గా డ్రెస్ వేసుకొని వచ్చి

"ఇప్పుడు నేనంటే మీ కిష్టమే గదంకుల్!" అన్నాడు నానీ.

"చాలా యిష్టం" వాడిని దగ్గరకు తీసుకుంటూ అన్నాడు విజయ్.

ఈ సన్నివేశం నాకెంతో నచ్చింది.

**కురవ రమేష్‌బాబు, కర్నూలు**

★ ★ ★

పోలీసుల వైఫల్యానికి గల సవివరమయిన కారణాలను విజయ్ పాత్ర ద్వారా చెప్పించే సన్నివేశం నాకు నచ్చింది. 'డి. ఎస్. పి. విజయ్' సీరియల్ పోలీసు డిపార్ట్‌మెంట్ గురించి కావడంతో రచయిత్రి పోలీసుల ధైర్య సాహసాల గురించి, వారి మీద ఉపయోగించబడుతున్న ప్రెజర్స్ గురించి బాగా రాశారు. అందుకే ఆ సన్నివేశమే కాకుండా సీరియల్ కూడా నచ్చింది నాకు!

రచయిత్రిగారు చెప్పినట్టు పోలీసులకు, ప్రజలకు మధ్య పెద్ద అగాధమేమీ లేదు. ఈ సమస్యకి కారణం పోలీసుల అహంకారం '60' శాతం కాగా ప్రజల మూర్ఖత్వం, క్షమాగుణం '40' శాతం! అయితే వారినీ, వీరినీ మినహాయిస్తే 100 శాతం రాజకీయ నాయకులే కారణం!!... కేవలం వీరి బంధుప్రీతి, పదవీ వ్యామోహం వల్లనే ప్రజల ఏహ్యభావానికి పోలీసులు గురి అవుతున్నారు. సాధారణంగా పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో హైలెవల్ అఫీషియల్స్ పొగరుని అహంకారాన్నీ ప్రదర్శించరు క్రింది తరగతి ఉద్యోగులు పై వారి మెప్పుకోసం తప్పుదారులు త్రొక్కడం వల్లనూ తమ కోపాన్ని ఇతరులపై అకారణంగా చూపించడం వల్లనూ 'జగ్గంపేట' 'వీరవాసరం' వంటి సంఘటనలు ఉత్పన్న మవుతున్నాయి. ప్రజలు పోలీసుల విజయాల్ని కాక అపజయాల్ని భూతద్దంతో చూసి, మూర్ఖత్వంతో పోలీసులంటే 'రక్ష



కులు' కాదనీ 'భక్షకులు' అనీ భావిస్తున్నారని రచయిత్రి తన ఆవేదనని 'విజయ్' ద్వారా చెప్పించడం నాకు నచ్చింది.

-టి. శశిధరకుమార్,
తిరువూరు □

వింధ్య ఇంటి వేపు చూసి ఉలిక్కిపడ్డాడు విజయ్

తలుపుకు తాళం వేలాడుతోంది

రంగారావొచ్చి పని ముగించుకు వెళ్ళిపోయాడా?!

అలా జరిగితే తలుపు దగ్గరకు వేసుంటుందంతే తీరికగా తాళం వెయ్యరు

చుట్టూ తిరిగి దొడ్డి వేపుకొచ్చాడు విజయ్ అటూ ఇటూ చూశాడు అది కొత్తగా కట్టిన కాలనీ ఇళ్ళు దూరం దూరంగా ఉన్నాయి వెనుక వేపు మరీ దూరంగా ఉన్నాయి గోడకు గూడులా ఉన్న భాగంలో కాలు పెట్టి పైకెక్కి లోపలికి దూకాడతను

కటకటాలున్న దొడ్డి వేపు వరండాకి లోపల తాళం వేసి ఉంది కట కటాల్లో నుంచి చెయ్యి చాపితే తాళం అందుతుంది తన దగ్గరున్న మారు తాళాలతో ప్రయత్నించి తాళం తీసి తలుపు తెరిచి లోపలికెళ్ళాడు

ఇల్లంతా జాగ్రత్తగా పరిశీలించి పడకగదిలోకెళ్ళాడు అక్కడున్న నైలాన్ వైరు తాడు మీద నాలుగు మాసిన చీరలు ఒక ఇస్త్రీ చీర వేలాడుతున్నాయి ఇస్త్రీ చీర మడత విప్పి మళ్ళీ కట్టుకోకుండా తాడు మీద పడేసినట్టుంది ఉత్తరాలలాంటివి కూడా దొరకలేదు అనుమానాస్పదమైన కాగితాలు గానీ మరే విధమైన సమాచారమయినా దొరుకుతుందేమోనని డ్రాయరు సొరుగులు అలమర్లు వెతికాడు విజయ్

ఈమె చాలా జాగ్రత్త మనిషిలా ఉంది

వింధ్యే కాంచనమాలని గుర్తించటానికి ఒక్క ఆధారం కూడా లేదు

ఆ ఇంట్లో ఎక్కడా ఘర్షణ జరిగిన గుర్తులు లేవు మంచం మీదున్న పరుపు లాగి ఇవతల పడేస్తే పరుపు కింద ఒక డైరీ దొరికింది

ఆత్రుతగా పేజీలు తిరగేశాడు విజయ్

ఈ రోజు శనివారం టెంకాయ కొట్టి వెంకటేశ్వరస్వామికి ఒక్క పొద్దున్నాను

రాత్రి పక్కింటి మామ్మ ఎసరు ఎండి తింటావామ్మా? అంటూ తీసుకొచ్చింది వద్దన్నా వినలేదు బలవంతంగా తినిపించింది వాంతొచ్చినంత పనయింది

ఇంత మొహం చేసుకొని బావుంది కదూ? అంది

ఏం బాగో లేదండీ ఇదంటే నాకసహ్యం అన్నాను

అంతే! మూతి ముడుచుకుని రుసరుసలాడుతూ వెళ్ళిపోయింది

నిజంగా నేను ఫూల్‌ని!

అద్భుతంగా వుంది అని అంటే సంతోషపడేది మళ్ళీ తెచ్చి పెట్టేస్తుందేమో అనే భయంతో అలా అనేశాను

రేపు బ్రతిమాలాలి

ఆదివారం కృష్ణతులాభారం సినిమాకెళ్ళాను సత్యభామగా జమున యాక్షన్ సుపర్బ్ కానీ ఎస్ వరలక్ష్మి కూడా చాలా చక్కగా ఒప్పిస్తుందా పాత్రను

మామ్మగారు

దాదాపు డైరీ అంతా ఇలాగే ఉంది

విసుగ్గా మూలకు గిరాటేశాడు విజయ్

అప్పుడు పడిందో కాయితం డైరీకున్న నీలం అట్టకూ కవరు పేజీకి మధ్య నుంచి

ఒక్క అంగలో వెళ్ళి దాన్ని అందుకుని మడతలు విప్పి సాఫుగా చేసి చూశాడు ఏదో బొమ్మ

## గడుసులోకం —బాబు







# డి. ఎస్. పి. విజయ్

మొదట అర్థం కాలేదు

డైరీలో రాతలాగే అపరిపక్వమయిన మనస్తత్వం గల అమ్మాయి గీసిన బొమ్మలా ఉందది

ఇంకొకసారి చూసిన విజయ్ ఎలర్ట్‌గా అయి మళ్లీ చూశాడు మూడు గీతలు రెండు నిలువుగా ఒకటి అడ్డంగా మూడు గోడలు నాలుగో వేపు మొత్తం ద్వారమున్న ఒక దొడ్డిలా ఉంది దాంట్లో నాలుగు రాళ్లు నిలబెట్టినట్లు డిజైన్ వేసి ఉంది

మూడు గోడల దొడ్డి నిలబెట్టిన నాలుగు రాళ్లు!? చటుక్కున గుర్తొచ్చింది విజయ్‌కి

అది చెంచుల బోనాలమ్మ గుడి!

ఆ గుడికి పైకప్పు ద్వారబంధం లేవు

మూడు గోడల దొడ్డిలో నాలుగు రాళ్లు నిలబెట్టి ఉంటాయంతే!

ఆ దారి నుంచయితేనే జీప్ పారెస్టులో కెడుతుంది

అందులో నే రంగారావు స్థావరం

జయచంద్ర ఇచ్చిన ఎడ్రసుకు వెళ్లాడు విజయ్ ఒకామె బయటకొచ్చి ఎవరు కావాలి? అన్నది విసుగ్గా

కాంచనమాల అన్నాడు విజయ్

వాట్ నాన్సెన్స్! ఎవరీ కాంచనమాల?

ఎవరిచ్చారు మీకీ ఎడ్రస్?

ప్రతిసారీ ఎవరో ఒకరు రావటం కాంచనమాల కావాలని అడగటం!

ఏమిటీ న్యూసెన్స్?

ఇంకోసారామె గురించి అడిగితే పోలీసులకి పట్టిస్తాను అంటూ ఫైరయిపోతోందామె

విజిటింగ్ కార్డ్ తీసి మౌనంగా ఆమెకిచ్చాడు విజయ్

ఓహ్! సారీ ఎస్ పి గారూ! నమస్తే లోపలికి రండి తెల్లారిందో లేదో ఇంకా ఎవరెవరో రావటం కాంచనమాల కావాలని అడగటం లేదు మొర్రో అని మొత్తుకున్నా వినకుండా అనుమానంగా చూడటం ఏవేవో ప్రశ్నలడగటం నిజంగా పిచ్చెక్కిపోతోందనుకోండి నాకు!

మీరూ అందుకే వచ్చుంటారని ఆ విసుగులో అలా అనేశాను అన్నదామె నొచ్చుకుంటూ

ప్లాస్కులో ఉన్న టీ గాజు కప్పులో పోసి అతనికిస్తూ నా ఎడ్రసివ్వాలని ఆవిడకెలా తోచింది? నన్నింత ఇరుకున పడేసిన ఆ మహాతల్లి ఎవరసలు? పెద్ద కేడీయా? అన్నది

ఆ విషయం తెలుసుకోటానికే వచ్చాం అంటూ ఆమె దగ్గర కొచ్చిన వాళ్ల గుర్తులు కొందరివి తెలుసుకొని వెనుతిరిగాడు విజయ్

వింద్య ఇంటి పక్కనున్న మామ్మను అడిగినా ఏం చెప్పలేకపోయింది ఆవిడకేదో కథ అల్లి చెప్పింది వింద్య

మంచి ఎల్లనాయనా! ఏమయిందా ఎల్లకి? ఊరెడుతున్నానని చెప్పింది నాకు అన్నదవిడ

ఎన్ని రోజుల క్రితం? అన్నాడు విజయ్

వారం రోజుల క్రితం

ఆ తరువాత ఇహ మీకు కనపడలేదా? వారం రోజుల్నించీ ఇంటికి రాలేదా? మీరు చూశారా?

వారం నుంచీ రాలేదు నాయనా వస్తే నాకెందుకు తెలీదు? ఆ ఎల్లకి నేనే పాలు పోస్తాను కూడా అన్నదావిడ

మీరెవరు? మీకెందుకా ఎల్ల సంగతి? అంటూ ఆరా తీసింది

వింద్య ఎంత మంచి పిల్లో ఆపకుండా చెప్పటం మొదలెట్టింది

ఆవిడ బారి నుంచి బయటపడేసరికి చచ్చినంత పని అయింది విజయ్‌కి

తను పోలీసాఫీసర్నని చెప్పి ఆ ముసలమ్మను హడలకొట్టటం ఇష్టంలేక పోయిందతనికి

వింద్యను అడవుల్లోకి తీసికెళ్లారా?

తీసికెడతారని ఆ ప్రాంతం గురించీ ఆమెకు ముందే ఎలా తెలుసు

కావాలనే ఆమె రంగారావు దృష్టిలో పడటానికి ప్రయత్నించి విజయం సాధించింది

ఆమె ఎవరి వేపు మనిషి?

విజయ్ చురుకైన మనసు ఆమె గురించి ఊహించి కొంతవరకూ విజయం సాధించింది

(ఇంకా ఉంది)




అమ్మా! నాకు చదువు రాదు! ఏదేనా పనిలో చేరిపోతా!
తప్పు! అలా అనకు! నువ్వు మీ నాన్నకి ఏకైక వారసుడివి! కాబోయే ముఖ్యమంత్రివి! నాలుగు ముక్కలు నేర్చుకో! చాలు!


స్కూల్లో రౌడీ వేషాలు వేస్తున్నావుట! నిజమేనా?
నీ వారసుణ్ణి. నేనే అన్నావుగా! నువ్వు చిన్నప్పుడూ రౌడీ వేషాలు వేశావని బామ్మ చెప్పింది..
వారసత్వం

నీకు పిల్లాజెల్లా లేరుగా! వారసత్వం ప్రకారం ఈసారి మా అబ్బాయిని చైర్మన్‌ని చేయిస్తాం!
నాకు పిల్లాజెల్లా దేవతా దెయ్యం అన్నీ మా ఆవిడే! ఈసారి ఆడోళ్ళకి ఛాన్సు ఇద్దాం! ఇక మాట్లాడకు!

గోదావరి ఎక్స్‌ప్రెస్ ఇంకా నగరాన్ని దాటలేదు తాడేపల్లిగూడెం వరకూ ఈ ముసలమ్మగారి సరసన ప్రయాణించాలా! అయ్యో రామం గుండె గుబేలు మంటున్నది

ఆమె రామం వైపే చూస్తోంది

వింతగా చూస్తోంది

ఆశ్చర్యంగా చూస్తోంది

కోపంగా చూస్తోంది

ఆ చూపుల్ని భరించలేక కిటికీలో నుండి బయటకు చూస్తూ కూర్చున్నాడు ఎందుకలా ఆమె చూస్తున్నదో అతనికి అర్థం గావడంలేదు మతి చలించిందేమో కూడా ఎవరూ ఉన్నట్టు లేరు ఒంటరిగానే ప్రయాణం చేస్తోంది

రైలు వెడుతోంది

సిగరెట్ దమ్ము లాగుతూ కిటికీలో నుండి చూస్తున్నాడు పొగ ఆమె మీదకు వెళ్ళకుండా జాగ్రత్తపడుచున్నాడు

హైదరాబాద్ వెలుగులు దూరమవుతున్నాయి చీకటి తెరల్ని చీల్చుకుంటూ రైలు పరిగెడుతోంది అంతా హడావిడి ప్రయాణీకులు ఇంకా సామాన్లు సర్దడంలోనే ఉన్నారు అటూ ఇటూ తిరుగుతున్నారు కొంతమంది కొంతమంది తమ సీట్లలో కూర్చుని వెంట తెచ్చుకున్న ఫలహారాల గిన్నెలు తీస్తున్నారు రామం ఇంటి దగ్గరే భోజనం చేసి రావడం వల్ల కిటికీలోంచి చూస్తూ కూర్చున్నాడు చీకటి ఒడిలో ప్రకృతి విశ్రాంతి తీసుకుంటోంది

ఇంతలో

బాబూ! ముసలామె పిలిచింది

చెప్పండి




నీ వయసెంత నాయనా!

ఇరవై రెండు

ఉద్యోగమేదైనా చేస్తున్నావా?

ఇంకా చదువుకుంటున్నాను

వయసు ఇరవై రెండు ఇంకా చదువుకుంటున్నావ్ లేత వయసు అప్పుడే సిగరెట్లు కోపంగా అంది

రామం ఆశ్చర్యపోయాడు ఆమె మాటలకి ముక్కు ముఖం తెలియని మనిషి తననిలా నిలదీయడం ఏమిటాని కోపం కూడా వస్తోంది కంపార్ట్‌మెంట్‌లో అందరూ వింతగా చూస్తున్నారు అయినా ఆమె పట్టించుకోవడం లేదు తన దోరణిలో చెప్పుకుపోతోంది

ఇంత చిన్న వయసులో సిగరెట్లు కాలిస్తే యిలా ఆరోగ్యం పాడైపోదూ అయినా నువ్వు సిగరెట్లు కాలుస్తున్నట్లు మీ పెద్దలకు తెలుసా నాయనా?

రామం సమాధానం చెప్పలేదు విసుగు పుడుతోంది పెద్దామె- కరకుగా మాట్లాడటానికి నోరు రావడంలేదు ఆమె చూస్తుంటే జాడించేస్తోంది అయినా బరిస్తున్నాడు

పెద్ద ముండని చెబుతున్నాను విను ఒక ప్రశ్న- రోజుకి ఎన్ని సిగరెట్లు కాలుస్తావ్?

రామానికి తల పగిలిపోతోంది

నీ పెదవులే చెబుతున్నాయ- నువ్వు పట్న తక్కువ కాల్చవని ఎలా లేదన్నా పెట్టి మూడు రూపాయలకు తక్కువలేదు నెలకి వంద రూపాయలు సంవత్సరానికి పన్నెండు వందలు ఇలా లెక్క వేస్తూ పోతే ఎన్ని వేల రూపాయలు ఈ సిగరెట్‌లకి బలై పోతున్నాయో ఆలోచించు డబ్బు ముఖ్యంకాదు ఆరోగ్యం డబ్బు పోతే సంపాదించవచ్చు మరి ఆరోగ్యం పోతే సంపాదించగలమా!

అలా సాగిపోతున్న ఆమె వాక్‌ప్రవాహానికి ఆనకట్ట వేయాలని అక్కడ నుండి లేచి వెళ్ళిపోదామని నిలబడ్డాడు

సిగరెట్ కాల్చడానికేనా! కోపంగా అడిగింది

రామం విసుగ్గా చూసి అక్కడ నుండి బయటికి వచ్చి రెండు సిగరెట్లు వరుసగా కాలిస్తే గానీ ఆ టెన్షన్ తగ్గలేదు మిగతా జనానికి ఆమె మాటలు వినోదంగా ఉంటుంటే- అతనికి ప్రాణసంకటంగా ఉంటోంది కాస్త సద్దుమణిగాక తన సీటు దగ్గరకు వెళ్లాడు

ఎన్ని సిగరెట్లు కాల్చి వచ్చావయ్యా?

ముసలావిడ నిద్రపోతున్నదనుకొని హమ్మయ్యానుకొంటున్న సమయంలో ఆ మాటలు విని అదిరిపడ్డాడు పడుకున్నదల్లా లేచి కూర్చుంది

చూడబ్బాయి నువ్వు చేస్తున్న పని మంచిది కాదు

# ధర్మపథం

## ఉచిత పద్ధతులు

నలుగురిలోనూ మంచివాడని పేరు పొందినవాడూ ఇతర్లకెట్టి అపకారమూ చేయనివాడు, ఏ తప్పూ చెయ్యనివాడూ ఎవ్వరికీ భయపడనక్కరలేదు. భయపడడు కూడా తన్ను అసూయ పరులు రచ్చకెక్కించినా ధైర్యంతో నిలుస్తాడు అయినా అతడు తనకు శత్రువులుండరని అనుకోకూడదు. దుష్టులకు మంచి చెడ్డలతో పనిలేదు. ఇతరులను హింసించడమే వారి ధ్యేయం. అందువల్ల అట్టి వారిని ఒక కంట కనిపెడుతూ ఆత్మరక్షణలో అశ్రద్ధ చూపక జాగ్రత్తగా ఉండాలి ఇది అనుసరణీయాలైన పద్ధతులలో ఒకటి

విహిత కృత్యాలు ఆచరించ వలసినప్పుడు అశ్రద్ధవల్లనో, మరచిపోవుట వల్లనో ఆ సమయాన్ని మరిచిపోయి తర్వాత జ్ఞప్తికి రాగా తహతహపడి తొందరపాటుతో ఆ పనులు నిర్వర్తిస్తే- అవి సక్రమంగా జరగక పోవచ్చును అందువల్ల ముందుగానే జాగ్రత పడడం మంచిది జాగ్రతపడుటవల్ల సక్రమంగా పనులు జరుపుకోవడం సులభసాధ్యమవుతుంది మనస్సుకు ఆందోళన కూడా ఉండదు

ఏ పనికయినా డబ్బు ముఖ్యం గదా! దనాన్ని ఆర్జించుటకు ప్రయత్నం చేయడం అవసరమే! అయినా అవసరానికి మించి ఎక్కువ ధనాన్ని సంపాదించ వలెననే ఆశ మాత్రం తగదు. ఆ ఆశ వుంటే ఏ విధంగానయినా ధనాన్ని సంపాదించ వలెననే ఆశ కలుగుతుంది. ఆ ఆశవల్ల మానవుని మనసు తప్పుమార్గాలను




త్రొక్కడం, అవినీతికి పాలుపడడం జరుగుతుంది అత్యాశ వుంటే- తాను సంకల్పించిన డబ్బు రాకపోతే మనస్సున చికాకు ఏర్పడుతుంది వేదన కలుగుతుంది ఎక్కువ ఆశపడకుండా దన సంపాదనకు ప్రయత్నించడం ఉచితం

ప్రతీ మనిషీ సుఖాన్నే కోరుకొంటాడు అయినా, అనుకోకుండా కష్టాలు కూడా సంభవించవచ్చు. అవి వచ్చినప్పుడు పరితపించకుండా సహించడం, సుఖ దుఃఖాలను సమానంగా భావించడం అవసరం. ఇలా సమాన దృష్టి అలవడడం అసాధ్యమే కావచ్చును. అయినా ప్రయత్నంవల్ల కొంత వరకూ సాధ్య పడవచ్చు ఆపైని క్రమంగా సుఖదుఃఖాల యెడల సహనభావం కలగడానికి ఎంతో అవకాశం ఉన్నది ఈ ఉచిత పద్ధతుల ననుసరిస్తే సుఖజీవనం సాధ్యమవుతుంది

—బులుసు వేంకట రమణయ్య

మామ్మగారూ మీరు

నన్ను విసిగిస్తున్నాను కాదనను అయినా ఆలోచించు

ఏమిటండీ ఆలోచించేది రైలు ఎక్కింది మొదలు నన్ను పట్టించారు సిగరెట్లు తాగుతాను మందు త్రాగుతాను అవన్నీ మీకెందుకు?

అది కాదు నాయనా

నాకేమీ చెప్పకండి పెద్దావిడ కదాని గౌరవమిచ్చి- మీరెన్ని అంటున్నా మౌనంగా ఉంటుంటే గమ్యం చేరేవరకూ వదలిపెట్టేలా లేరు ముందు మీ పిల్లలకి- అల్లుళ్ళకి చెప్పుకోండి అంతేగానీ నన్ను మాత్రం విసిగించకండి ఆవేశంగా అని దుప్పటి ముసుగెట్టి కళ్ళు మూసుకున్నాడు రామం

ఆమె కూడా నడుం వాల్చింది ఆమె ఏడుస్తోంది ఏదో సణుగుతూనే ఉంది రామం నిద్రలోకి జారుకున్నాడు తిరిగి అతను నిద్ర లేచేసరికి రైలు ఏలూరు దాటింది ఉంగుటూరు సమీపంలో ఉంది రామం లేచి ముఖం కడుక్కుని వచ్చాడు ఎదురుగా ముసలామె సామాన్లు సర్దుకుని కూర్చుని ఉంది తిరిగి రైల్లో హడావిడి చెలరేగింది అందరూ సామాన్లు సర్దుకొంటున్నారు గూడెం వచ్చింది రామం ఆలస్యం చేయకుండా బండి దిగాడు దూరంగా వెళ్ళి సిగరెట్ అంటించి తృప్తిగా గుండె నిండా పొగ పీల్చాడు ప్రయాణీకులు రైలు దిగి వస్తున్నారు రామం టి సి కి టికెట్ యిచ్చి బయటపడ్డాడు

బాబూ! ఆమె పిలిచింది రామం ఆగాడు ఆమె వచ్చింది

మాది చిలకలంపాడు మీది

పిప్పర

అలాగా! బాబూ నా మాట విను ఇంత చిన్న వయసులో నే సిగరెట్లు కాల్చడం మంచిదికాదు

రామం ఆశ్చర్యపోయాడు ఈసారి ఆమె మాటల్లో వెటకారం లేదు కోపం లేదు అభ్యర్థనుంది ఆవేదన ఉంది ఆమె కళ్ళు వర్షిస్తున్నాయి

ఎందుకు మామ్మగారూ ఏడుస్తున్నారు సూట్‌కేస్ కిందపెట్టి- సిగరెట్ పడేసి అడిగాడు

ఆమె విషాదంగా చిన్నగా నవ్వి ఎద్దుక నవ్వమంటావా నాయన నీయంత కొడుకు సిగరెట్లు కాల్చి కాల్చి కాన్సర్ తెచ్చుకొని నన్ను ఒంటరిదాన్ని చేసి వెళ్ళిపోయాడు అందుకే నిన్ను చూస్తే వాడు గుర్తుకు వచ్చాడు నాలా మరో తల్లి గర్భశోకానికి గురి కాకూడదని నా ఆశ మరోలా భావించకు అని కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోతున్న ఆమెను సజల నయనాలతో చూస్తూ నిలబడిపోయాడు రామం □

# నిత్య నూతన సీరియల్




(గత సంచిక తరువాయి)

వారిద్దరును పేటలో మూడు రోజాలుండిరి శివరావు విడి విడిగా పిలిచి యిద్దరికి తన అవతార కథ చెప్పెను వారియువురు ఊరకుండిరి తరువాత ధర్మారావును వారును కూడ బలుకుకొనిరి ఈయనకీ పిచ్చిపట్టినది ఇది వదులుట ఎట్లు?

మూడవనాడు సాయంకాలము పశుపతి శివరావు లిద్దరును దివ్య జ్ఞాన సభా విషయములు ప్రస్తావించుకొనుచుండిరి పశుపతి కేమతమునందును నిశ్చయ బుద్ధిలేదు అతడు నూత్న విషయములను తెలిసికొనుటకే ఆతుర పడుచుండెను

కిరీటి ధర్మారావులు కలిసి కళాశాల వెనుకనున్న మెట్ట చేలలోనికి వాహ్యాళి పోయిరి చంద్రారెడ్డి యీయేడు పసుపుతోట మిరప తోటయు వేయలేదు అది వరకు ప్రతి సంవత్సరము ఆ రెండు పంటలు అతడు పండించెడివాడు ఏమండీ! రెడ్డిగారూ! ఈయేడు పసుపుతోట వేయలేదేమి? మిరపనారు పోయలేదేమి? అని ఎవరైన అడుగుదురు అబ్బా! వాని నిండ పాములండీ వానితో పడలేక అవి తీసివేసితిని అని జవాబు చెప్పును మెట్ట అంతయు కందిచేలే ఎక్కువ వేసెను పసపుతోటలైనచో కన్నుల కానందముగా ఉండి మాటి మాటికి నీరు పెట్టుట చేత నేలతడిసి కాలి క్రింద మెత్తగా ఉండెడిది ఇప్పుడు చేలు చూచుటకు పచ్చగా లేవు కాలి క్రింద నేల గట్టిగా ఉన్నది స్నేహితు లిర్వురును పోయి ఒకచోట కూర్చుండిరి

కిరీటి జైలులో నుండి సూర్యపతి మరి యింకెన్నాళ్ళకు వచ్చును?

దర్మా రాఘవరావు అతడు ఒకసారియే వెళ్ళిరి ఇంక అయిదారు నెలలలో రావచ్చును కడలూరి జైలులో ఉన్నారట సూర్యపతి ఉత్తరము వ్రాసెను మొదట నెలనాళ్ళు రాజమహేంద్రవరములో ఉన్నారట ఆ నెలనాళ్ళు తిండి సహించక చాల యిబ్బంది పడిరట అన్నములో మేకులు రాళ్ళు – వీనితో తినలేక పోయిరట ఇతర దేశములలో కారాగృహములు బహుసుఖముగ ఉండునట మనదేశములో ఇట్లున్నవి అగర్భ శ్రీమంతుడు సూర్యపతి అచ్చువాకారుడు రాఘవరావు ఇద్దరకును వచ్చిన దీదురవస్థ తరువాత బళ్ళారి తీసికొనిపోయిరి అచ్చట కారాగృహాధికారి చాల మంచివాడట చాల బాగుగనే ఉన్నదని తెలిసినది సూర్యపతి మొదటి మూడు నెలలైన తరువాత బి క్లాసులో చేర్చబడెను ఇప్పుడు బాగుగనే ఉన్నదట

కిరీటి మొన్న బెజవాడలో సూర్యపతి కూతుండ్రను చూచి వచ్చితిని

ధర్మా పిల్లలు సుఖముగా ఉన్నారా?

కిరీటి సుఖముగా ఉన్నా రనెను

ధర్మా నీ ప్రేమ కథ ఎంత దూరము వచ్చినది? ప్రేమకథ అనినంతనే కిరీటి మొగము వ్రేలవేసెను అన్నా! మా మామ యిది వరకే నాకు కూతునీయ ననెను నేను నాలుగేండ్ల నుండి ఉద్యమములో చదువు మానిన తరువాత తినుటకు తిండిలేదు వానికి ఎల్ల నెవరిత్తు రని అన్నాడట పిల్లమాట ఎట్లున్నను స్వరాజ్యము వచ్చునని చదువు మానితిని వచ్చు ననుకొన్న స్వరాజ్యము రాలేదు, రాదనుకొన్న శశి మరీ రానట్లున్నది శశిరేఖ నిద్రాహారములు మానినదట

దర్మా మూడేండ్ల క్రింద నేనామెను మీమామ బాపట్లలో ఉండగా చూచితివి నేనామె నదివరకెరుగకపోయినను చూచి గుర్తు పట్టితిని నాయనా! నీకై ఆమె దృఢవ్రతగా కనుపడినది

కిరీటి దర్మారావుపై ఒఱగెను దర్మారావతనిని రెండు చేతులతో కౌగిలించి అదరించెను ఆ కౌగిలింతతో కిరీటి విరహబాధ సగ ముపశమిల్లి నట్లుండెను

దర్మా ఈత్రిప్పలేమిటి? నీ మేనమామ కూతురాయెను ఆమెను లేవదీసకొని రారాదా? నీ మీదనేమి వ్యవహారము జరుపగలడా? అంతగా అయినచో ఆమె నీ తరఫుననే ఉన్నది

కిరీ ఇప్పుడు మామామ గుంటూరులో ఉన్నాడు వారు అరండేలుపేటలో శివాలయమ్ము వద్ద కాపురమున్నారు నేను శశిని చూచుట కారు నెలల క్రిందట పోయితిని మేము వారింటికి పోము వీధి వెంట పోయినచో ఆమె కన్పించునేమో అని చుచితిని మరి యితరులు కన్పించరాదు ఆమె మాత్రమే కన్పించవలయును అందుచేత ప్రొద్దు క్రుంకి పోవు చుంటిని మూడవ నాడు సాయంకాలమున శశి కనపడెను నన్ను దూరమున చూచి గుర్తుపట్టెను మే మిరువురము ఒకరినొకరు చూచుకొనుచునట్లె నిలువంబడి ఉంటిమి ఇంతలో తల్లి లోపలి నుండి ఆమెను పిలిచెను ఆమె లోనికి పోయెను నేను మరునాడు ప్రక్క శివాలయములో కూర్చుండి ఆమె కన్పించునేమో యని ఎదురు చూచుచుంటిని ఇంతలో అచటి కొక ముసలి అవ్వ వచ్చెను ఆమె పూజారి ఆమె నన్ను చూచి నాయనా! ఇచ్చట కూర్చుంటివేమి అనెను ఆమెను చూచినంతనే నాకు పరమసాదువు వలె తోచెను ఎచ్చివానివలె నా కథ అంతయు ఆమెకు చెప్పితిని ఆమె చాల జాలి పడినది ఆమె నేను వారి యింటికి వచ్చుచు పోవుచుందును నీవేమైన కబురు చెప్పినచో పోయి చెప్పెదను అనెను నేనొక ఉత్తరము వ్రాసి ఆమె చేతి కిచ్చితిని శశి మరల ఒక ఉత్తరము వ్రాసి నాకు పంపెను ఇదిగో ఉత్తరము అని కిరీటిలోపలి చొక్కా జేబులో దాచియున్న ఉత్తరమును దర్మారావు చేతి కిచ్చెను అప్పటికే ప్రొద్దు క్రుంకినది అక్షరములు కన్పించలేదు కిరీటి జేబులో నిప్పుపెట్టె తీసి ఒక్కొక్క

జరిగిన కథ –31 : రంగారావు గారు దొరసానిని వివాహం చేసుకుంటాడు దర్మారావు హరప్పనాయనికి చదువు చెప్పడానికి రోజూ కోటలోనికి వెడతాడు గుండేటికి వరదవచ్చి సుబ్బన్నపేటను ముంచెత్తుతుంది పంటలన్నీ నాశనం అవుతాయి గవర్నరుగారు పురపాలక సంఘ భవనాన్ని ప్రారంభిస్తారు. చంద్రారెడ్డి పురపాలక సంఘ ఎన్నికలలో విజయం పొందుతాడు శివరావు జాతీయ కళాశాలకు క్రొత్త అధ్యక్షుడుగా నియమితుడవుతాడు రామేశ్వరము సుబ్బన్నపేటలో సినిమాహాలు కట్టిస్తాడు. రామేశ్వరము జోస్యులు భార్య మంగమ్మ చేయి పుచ్చుకుంటాడు శివరావు తాను కృష్ణావతారమని అదో కథోరణితో ఉంటాడు.

పుల్లయే వెలిగించుటయు దర్మారావు వెలుగున్నం తలో నాలుగైదు మాటలు చదివి ఆగుటయుగా ఉత్తరము పూర్తి అగు వరకు నిప్పు పెట్టిలో మిగిలిన పుల్లలును పూర్తి అయ్యెను ఉత్తర మిట్లుండెను బావా! నీ ఉత్తరము వచ్చినది నేను కారాగృహములో ఉన్నాను ఇచ్చట నుండి ఏమి వ్రాసిన ఏమి లాభము? మా నాయన నా కెవరినో సంబందము కుదిర్చెను అతడు బి ఏ బి ఎల్ ప్యాసాయెనట చాల దనవంతుడట నన్ను పెండ్లి చేసికొమ్మని రాచి రంపమున పెట్టుచున్నారు ఈ బాద పడలేక నేను నల్లమందు తిని నూనె త్రావి చచ్చి పోవుదమనుకొన్నాను నాయీ ప్రయత్నము మానాయన గ్రహించి నన్నప్పటి నుండి కాపలా కాయుచున్నారు నేను విడిగా కూర్చుండి నా ఘోష నేనాలోచించు కొనుటకును వీలులేదు నాహృదయములో ఉన్న నిన్ను నన్ను చంపియు లాగికొనలేరు కదా!

నీ దుఃఖదాసి –

శశి

ఈ ఉత్తరము చదివిన దర్మారావు కన్నుల వెంట నీరువచ్చెను కిరీటి వెక్కి వెక్కి యేడ్వ ఆరంబించెను దర్మారావు తన ఉత్తరీయపు కొంగుతో కిరటి కన్నులు తుడిచి ఓదార్చి తరువాత ఏమి జరిగె నని అడిగెను

కిరీ పూజారి ముసలమ్మ నాయనా! నీ బార్య ప్రతి శుక్రవారమును అమ్మవారి పూజ చేయును అన్నది నేను అవ్వా! నా బార్య అనుచుంటివి నీవు చేసినచో అగు నంటివి నేనేమి చేయగల నన్నది అమె నేను రేపు సాయంకాలమునకు మీ యింటికి తీసికొని రమ్ము నేనామెతో మీ యింటిలో మాటాడి అమె ఒప్పుకొనెనేని రైలుకు తీసికొనిపోయెదను పెండ్లి అడిన తరువాత మా మామకు జాబు వ్రాసెదను ఏమి చేయగలడో చూతును అంటిని అవ్వ బాబూ! నాకుత్తుక మీదికి రాదా? అనెను నేను నీ యిష్టము. ఈ మేలు చేసినచో చేసి పెట్టుము. గౌరీదేవి వలె ఉన్నావు. నా శశి ప్రతి శుక్రవారము గౌరీపూజ చేయునంటివి. నీవీ సహాయము చేసినచో గౌరియే నీవై వచ్చి పూజాఫలమిచ్చిన దనుకొందు" నంటివి. అవ్వ కొంత విచారించి "సరేలే తండ్రీ! ముసలిదానను వారేమిచ్చైనను జేసి మాత్రమేమి చేయుదురు? మీ యిద్దరకు పెండ్లి చేసిన ఫలమైనను దక్కును. సరే. రేపు సాయంకాలమున నీవచ్చుటికి రావలసిన" దని చెప్పెను నేను మరునాడు పోయితిని పోవు వరకు అవ్వ నన్ను చూచి దీనమైన మొగముతో నాయనా! నీవిచ్చుటికి వచ్చుటయు నేను నీతో మాట్లాడుటయు ఇదియంతయు మీ యత్తగారు చూచుచునే ఉన్నదట ఉత్తరము నీకు తెచ్చి యిచ్చితినన్న విషయము తెలియలేదు బ్రతికిపోయితిని నేడు పొద్దున వారి యింటికి పోయినంతనే వారు



నలువురు దూయబట్టిరి మీ బాపమరది నన్ను కొట్టనే వచ్చెను చావు తప్పి కన్ను లొట్ట పోయి బయట పడితిని ఏమి చేయమందు వనెను నేనేమి చేయగలను? ప్రాణములన్నియు అవ్వ కొప్పగించి ఇవిగో! ప్రాణము లిచ్చుటనే పెట్ట పోయినా వని శశికి చూపించు చుండుమన్నట్లు కట్టివలె నేను బయటికి వచ్చితిని మరల యింటికి పోయితిని నా యీ స్థితి మా అమ్మ బాగుగా గ్రహించినది అమె గుంటూరు పోయి కటాపెటగా మా మామను ఎల్ల నిత్తువా యీయవా అని అడిగి వత్తునని

# వేయిపడగలు

బయలుదేరెను ఆమె వెళ్ళగా వారెవరును గౌరవించలేదట' ఆమె ఏమైనను సరేనని నాల్గు రోజాలుండి మా మామను గదలించి వెంటపడి తరిమి సాదించెనట చిన్నప్పుడు కిరీటికి శశిరేఖ నిత్తునంటివి అబము శుబము ఎరుగని ఆ పిల్ల లిద్దరు నిజమే అనుకొనిరి ఎల్ల పెద్ద మనిషియై యైదేండ్లయినది నా బిడ్డ యీ పెండ్లి కాకపోయి నచో బ్రతుకునట్లు లేదు నీ వన్నవై నాకు కడుపు దుఃఖము తెచ్చి పెట్టవలయునా? అన్నదట' దర్మారావు కంసునివలెనా అనెను కిరీటి మందహాసము చేస మరల ఆరంబించెను మా మామ నాల్గు రోజాలైన తరువాత మాయమ్మతో నీ కొడుకు గాందీగారి ఉద్యమములో చేరి చదువు కూడ మాని వేసినాయెను నీ కొడుకును జేసకొని మా అమ్మాయి యేమి సుఖపడును? బి ఏ అయినను ప్యాసైనాడు కనుకనా' అన్నాడట మా అమ్మ వానిని మరల బి ఏ చదివింతును వాడింకొక్కయేడే చదువవలయును వాడు బి ఏ పరీక్ష ప్యాసైనచో నీవు కూతురు నిత్తువు కదా అని సరే అనిఎంచి వచ్చినది ఇది రెండు నెలల కింది వార్త ఉద్యమములో నేనుండి ఎక్కువ చేయు నదియు లేదు నే నుద్యమములో చేరినందులకు మావాంధ్ర కందరకు కోపముగ ఉన్నది నేను శశిని పరిత్యజించ లేను మరల చదువుదమనుకొంటిని చదువు మంఉువా

దర్మా నాకు చూచిన కొలంది దేశ మందరు ఉద్యమములో చేరినచో స్వరాజ్యము రేపే వచ్చును కాని ఎవరికి వారు స్వార్థపరాయణులై ఉన్నారు అట్టి సమయములో మరియు ఇబ్బందులలో ఉన్న వారు తమ జీవిత మార్గములను చెడగొట్టుకొని సంకటపడినందు వలన నాకు లాబము కన్పించ లేదు రాఘవరావు వంటి మహో ద్రిక్త హృదయులు నీవు నేను చెప్పినచో అగరు మొన్న గాంధిగా రన్నట్లు వారు నిత్యము బాధపడుటకే జన్మించిరి బాధ పడుటలోని తత్త్వము వారి ముక్కులలో ఎ ఊపిరి వంటిది నీవు ముందునాటికి చదివినచో వచ్చి సుబ్బన్నపేటలో చదువుము

కిరీ ఇక్కడనే చదివెదను అన్నా' నిన్ను వదలి పెట్టి నేనుండలేను నీ వద్దనే ఉండెదను ఇక్కడనే చదివెదను

అప్పటికి ప్రొద్దు పోయినది ఇద్దరును కలు కళాశాలలోనికి వచ్చిరి అందరు శివరావు ఇంట బో జనము చేసిరి కిరిటికి పశుపతికి కళాశాల విద్యార్థులతో ఈ మూడు రోజులలో పరిచయము కలిగెను సీతాపతి

అందరిలో కుర్రవాడు అతనికి కిరీటి అన్నచో మిక్కిలి ప్రేమ కలిగెను ఈ యీడు వాళ్ళతో నే కిరీటి చేతులు పుచ్చుకొని త్రేలాడును కిరీటి బుజము మీద చేతులువైచి నడచును కిరీటికిని సీతాపతి యన్న ప్రేమ కలిగెను మరునాడు కిరీటి పశుపతులు సుబ్బన్నపేట నుండి వెడలిరి

మరునాడు శివరావు దర్మారావును కలిసకొని చూచితిరా? కిరీటియే అర్జునుడు పశుపతియే శివుడు కైలాసము నందున్న నా మిత్రుడు మరల నా కొరకై అవతరించెను పశుపతియు నేనును నిన్న సాయంకాలము చాల సేపు ప్రసంగించితిమి పశుపతి నేను చెప్పిన దంతయు నమ్మెను ఎవే శివుడవని చెప్పితిని అత దొప్పుకొనెను నాకు క్రమ క్రమముగా చూచినచో నీ సంగతి బిసెంటమ్మకును లెడ్‌బీటరునకు వ్రాయవలయును వారి చేత ఒప్పించవలయును నేను వారి నెవ్వరి నెరుగ ను ఎవరైన ఎరిగి ఉన్న వారి చేత వ్రాయించ వలయును ఈ ఊరిలో ఉన్న తహసీల్దారు రంగయ్యగారు దివ్యజ్ఞాన సమాజ సభ్యుడు ఆయనతో రేపు కలసికొని మాటలాడుదుము అనెను

రంగయ్యగా రేబదినాలుగేడులు వయసు కలవాడు ఇంకొక సంవత్సరములో ఉద్యోగము మానివేసి పించను పుచ్చుకొనును చాల సాధువైన మనిసి దివ్యజ్ఞాన సభకు చెందినవాడైనను సనాతన మతము నందు నిరాదరణ కాని కర్మములు మానివేయుటకు గాని వేయలేదు అన్ని మతము లకు అదొక రీతిగా ముడిపెట్టుట అన్ని మతము లందును యాదార్థ్యమున్నదనుట ఎచ్చట మంచి ఉన్నదో అచ్చట గ్రహించవలయుననుట దేని యందును నిశ్చయజ్ఞానము లేక ఇతో భ్రష్టస్తతో భ్రష్ట అగుట బ్రతుకు తెరువునకు ముఖ్యదర్మము ఈ కాలమున అది అవశ్యాచరణీయము సామాన్య ముగ ఉన్నతోద్యోగులు ఉద్యోగ రీత్యా అబివృద్ధికి రానిచ్చగించినవారు చెప్పెడి సిద్ధాంతములివి రంగయ్యగారీ సిద్ధాంతవాది శివరావు ధర్మారావులు కలిసపోయి శివరావు రంగయ్యతో తన అద్యాత్మి కానుబవము చెప్ప తానే ఆల్సియాను అనియు జిడ్డు కృష్ణమూర్తిగారు కాదనియు ఈ విషయము చెన్నపురికి వ్రాయవలెననియు కోరెను రంగయ్య గారు నిజమే కావచ్చు నని చెన్నపురికి వ్రాసిరి మూడురోజాలలో చెన్నపురి నుండి ప్రత్యుత్తరము వచ్చెను లెడ్‌బీటరు దొర అస్ట్రేలియాలో ఉండెనట్! అయనకు చెన్నపురి దివ్యజ్ఞాన సమాజము వారీ వర్తమానము దెలియ జేయుదురట లెడ్‌బీటరు సమాదిగతుడై వారి బాషలో యాస్ట్రల్ ప్లేను లోనికి పోయి అల్సియాను కృష్ణమూర్తియో శివరావో తెలిసికొని అప్పుడీ విషయము తెలియజేయుదుమని వ్రాసిరి లెడ్‌బీటరు నుండి ఉత్తరము వచ్చు వరకు శివరావుగారి అవతారము నిలువలో ఉంచబడెను

మరల క్రిష్టమస్ పండుగలు వచ్చెను శశినీ రంగారావులు చెన్నపురి కేగిరి మరల క్రొత్త గుర్రములు కొనుట మరల వానిని పోషించుట జరిగెను ఆ సంవత్సరము గిండీ పందెముల వలన దేశమునకు జాల నష్టముగా ఉన్నదని చెన్నపురి పత్రిక లన్నియు ఘోషించెను ఘోషించి నందువలన నేమో పందెము లా ఏట మరియు విధివిగా జరిగెను రంగారావుగారి గుర్రము లన్నియు ఓడిపోయెను లాబము గూబలలోనికి తీసె నన్నట్లు నిరుటి రెండు లక్షలు నేడు పోయెను శశిని తల్లిదండ్రులకు మూడు వందల పొండ్లు పంపించవలసి వచ్చెను రంగారావుగారి చేతిలో దనము లేకపోయెను కృష్ణమనాయడు ఖజానాలో నిలువ ఉంచి పోయిన యిరువది లక్షలలో పన్నెండు లక్షలు పట్టాబిషేకమునకే అయ్యెను కాలేజి కిచ్చినది యిగ్గండు వెళ్ళి ఖర్చు పెట్టినది యీ పదేండ్లుగా నాగేశ్వరరావుగారి కేమి తదితరుల కేమి జీతము లిచ్చినది ప్రతి సంవత్సరము వచ్చుచున్న






# నాయరు

10

నాయరు కాచి అసిరిగాడు లాటి చిన్న చిన్న పాత్రలు కొన్ని వేయిపడగలులో ఉన్నాయి గదా! వీటిలో అన్నీకాకపోయినా కొన్నైనా వెనక సజీవ పాత్రల ఆదారం ఉన్నవే! వీటన్నిటిలో నాయరు పాత్ర చాలా ముఖ్యమైనది

కాళిదాసు మేఘుడిని బావించినట్లుగానే విశ్వనాథ కూడానాయరుని అధిగుణుడుగానే బావించాడు

ఊరిలో కలరా చెలరేగినప్పుడు ప్రతి జనుడు శవములకు దూర దూరముగా పరువెత్తినప్పుడు నాయరు సహస్రదా ఉపయోగపడెను చివర కతనికొక రావుబహ దూరయినను రాలేదు

ఇదీ నాయరుని గురించి వేయిపడగలులో విశ్వనాథ అబిప్రాయం

బందరులో కుందు అని పెద్ద సెంటరుంది ఇప్పటికీ ఉంది అక్కడ కోటి నాగులుకొట్టు అని ఒకకిళ్లీ కొట్టు ఉండేదిట' ఆ రోజుల్లో కవులకి గాయకులకి మిరాయిలకి చాలా వాటికి బందరు ప్రసిద్ధి అలాగే బందరు రౌడీ అని రౌడీలకు కూడా ప్రసద్ధి' ఈ కోటినాగులు చాలా పెద్ద రౌడీ అట అప్పటి రౌడీలు ఇప్పటి రౌడీలల్లే మురాలుగా విరగబడి వచ్చి ఒక్కడి మీదపడి చంపడం అర్ధరాత్రి అపరాత్రి చాటుగా దొంగ దెబ్బ తియ్యటం వంటి దౌర్భాగ్యపు పనులు చేసేవాళ్ళు కాదు ఎవడితోనైనా శతృత్వం వస్తే సరాసరి వాడిఇంటికో లేదా ఏదైనా పెద్ద సెంటరుకో వెళ్ళి వాడూ వీడూ ముఖాముఖి తేల్చుకోవడమే' అదీ నిజమయిన రౌడీయిజం అంటే'

మా నాన్నగారే గొప్ప కవి అని ఆ కోటి నాగులుకి చాలా గౌరవం వ్యవహారం వస్తే రౌడీలు తప్ప వాళ్ళ వృత్తి రౌడీయిజమా?

ఆ మాటకొస్తే ఆ రోజుల్లో మా నాన్నగారు కూడా రౌడీయేనట వాళ్ళు అపండితులైన రౌడీలు ఈయన పండితుడైన రౌడీ!

ఇవ్వన్నీ ఇల్లా ఉంచితే సరిగ్గా ఆ కోటినాగులు కొట్టు ప్రక్కనే నాయరు కిళ్ళీ కొట్టు

వేయిపడగలులోనే కాక బయట కూడా అతని పేరు నాయరే! ఎ నాయరో తెలియదు




అంతానాయరు నాయరు అనేవారట ఆనాటికే అతనికి దాదాపు ఎభై అరవైయ్యేళ్ళ వయస్సు ఉండేది బ్రహ్మచారి కొద్ది కొద్దిగా దాచుకున్న డబ్బు వెచ్చుకుని నాల్గయిదేళ్ళ కొకసారి యాత్రలు చేస ఖర్చుపెట్టి వచ్చేవాడట పేద విద్యార్ధులకు కొందరికి డబ్బిచ్చేవాడట కనబడని దానాలు అనేకం చేసేవాడట

మా నాయనగారికి కూడా ఎప్పుడైనా దన సహాయం చేశాడేమో తెలీదు గాని అయ్యా' డబ్బు తెగ నిలవ చేయడం చాలా నేరమంటె నిలవ డబ్బు ఎప్పటి కప్పుడు ప్రజల్లో తిరుగుతూ ఉండాలి బోషాణాల్లో ఇనప్పెట్టెల్లో మూలగూడదు అలా మూలిగితే డబ్బుకి కఱువొచ్చి ఆర్ధిక సంక్షోబాలు ఎరిగిపోతాయి పేదరికం పెరిగిపోతుంది అరాచకమయి పోతుందండి అని అనేవాడట

మన రాజకీయ నాయకులకీ రాజ్యాంగ వ్యవహార దక్షులకీ పారిశ్రామిక వేత్తలకీ ఆ కిళ్లీ కొట్టు వాడికున్న మాత్రం జ్ఞానంలేదు అందుకనే అతనికి కనీసం ఒక రావుబహదూరయినా రాలేదు అని నేను బాదపడింది అనేవాడు మా నాయనగారు

దీరిదాపు ఆ నాయరు పాత్రని యదాతథంగా చిత్రించాడు మా నాయనగారు నాయరు చెప్పిన ఆర్ధిక విదానాన్ని జీవితంలో అమలు కూడా చేశాడు మా నాయనగారు

మానవతా దృక్పదాన్ని నూటికి నూరుపాళ్ళు ఆచరణలో పెట్టిన వాడు కావటాన నాయరు ఏ మార్పు లేకుండా నాయరుగానే కనిపించాడు వేయిపడగలులో (ఇంకా ఉంది)

**విశ్వనాథ పావని శాస్త్రి**

ఆదాయము చాలక ఖజానాలో మిగిలిన ఎనిమిది లక్షలును వ్యయమయ్యెను నిరుడు రెండు లక్షలు లాబము వచ్చినచో ఈ ఏడాది పోయెను శశిని తలిదండ్రులకు పంపించుటకు అయిదు వేల రూపాయలు లేక రంగారావుగా రిబ్బంది పడవలసి వచ్చెను ఆ ఏడు దివానుగారి ద్వారా ఒక మార్వాడి దగ్గర నుండి లక్ష రూపాయలప్పు జేసిరి శశిని డబ్బు పంపించెను ఇంగ్లండు నుండి ఉత్తరము వచ్చెను మూడేండ్లకే ఆమె తిరిగి వత్తునన్నది నాలుగేండ్లు కావచ్చినది ఆమె తండ్రికి జబ్బుగా ఉన్నదట ఒకసారి తప్పక రమ్మని శశిని భర్తతో ఇద్దరము పోయివత్త మన్నది రంగారావు కాదనలేదు అవుననియు అనలేదు క్రిష్ణమసు నష్టమైపోయెను

రామేశ్వరముగారు నెలనాళ్ళయిన తరువాత మరల రంగాపురము పోయిరి మంగమ్మ జోస్యులతో చెప్పి ఉండెనేమో! తాను వెళ్ళినచో అత దేమనునో సందిగ్ధమనస్కుడై పోయిన రామేశ్వర మునకు స్కూలు పరీక్ష చేసినంత సేపు జోస్యుల ప్రవర్తనను బట్టి అతని బార్య అతనితో ఆ ప్రసంగమే చేయలేదని ధైర్యము కలిగెను అయినను కదలించి చూతమని జోస్యులుగారూ! ఆ రోజున మీ యింటిలోని బోజనము స్వర్గతుల్యముగా ఉన్నదండీ అని మాటలలో మాటగా అనెను జోస్యులు మరల మీరు మా యింటికి దయ చేయవలయును అనెను రామేశ్వరము నాలుగు మైళ్ళలో సుబ్బన్నపేట పెట్టుకొని ఎందుకండీ? ఆ రోజున అన్నచో ప్రొద్దుననే వచ్చితిని కనుక అట్లు జరిగినది అనెను జోస్యులు అట్లుకాదు మీరు మరల మా యింటి బోజనమునకు రావలయు నని బలవంతము చేసెను రామేశ్వర మీసారి వచ్చినపుడు లెండి అని ఆ ప్రసంగ ముపసంహ రించెను ఆ నాడు జోస్యు లింటికి పోయి మంగమ్మతో ప్రెసిడెంటుగారు మరల మన యింటికి బోజనమునకు వత్తురు రెండు మూడు రోజులలో మరల వత్తురు అప్పుడు వంట ఆ నాడు కూడ చక్కగా చేయవలెను అనెను మంగమ జమీందారుగారి కాయన ఏమగును? అని అడిగెను జోస్యులు సాక్షాతు పెదతల్లి కుమారుడు అనెను మంగమ్మ అయిన చాల దనవంతుడా అనెను జోస్యులు సుబ్బన్నపేటలో సనీమా ఉన్నది దాని మీద నెలకు నాలుగైదు వేలు వచ్చును ప్రెసిడెంటుగా ప్రయాణపు ఖర్చులే సాలున కొకటి రెండు వేలు వచ్చును ఆయన కేమి? జమీందారు తరువాత జమీందారంతవాడు జమీందారుగా రీయన ఎంత చెప్పిన అంత అట అనెను

మరల వారము రోజులలో రామేశ్వరముగారు వచ్చిరి జోస్యులు బోజనమునకు పిలిచి మరల అంత ప్రయత్నము చేసెను వెనుకటిసారి వలె రామేశ్వరము వడ్డించుచున్నంత సేపు మంగమ్మ వంక చూడలేదు జోస్యుల కది మనస్సున కాహ్లాద కారిగా ఉండెను అతని హృదయకుహరములో రామేశ్వరమును గూర్చి సందేహా మేదైన ఉన్నచో అది

యీ నాటితో పోయెను జోస్యులు బోజనము చేసి పాఠశాలకు నడచెను పన్నెండు గంటలైనది మంగమ్మ మునుపటి వలెనే ప్రక్కగదిలో శయనించెను రామేశ్వరము నిద్ర లేచినట్లు నటించి మంచితీర్థ మడిగెను ఆమె తెచ్చి మునుపటి వలెనే వాకిటిలో ఉంచెను అతడు మొగము చేతులు గడుగుకొని మరల నీళ్ళు తెమ్మని తాను వండుకొన్న మంచము మీద కూర్చుండెను అతడు చెంబు పట్టెను నీరు పోయుటకు మంగమ్మ గదిలోనికి పోవలయును ఆమె మంచము వద్దకు నడచి చెంబులో నీరు పోసెను రామేశ్వరము చెంబు వదలి పెట్టి ఆమె చేయి పట్టుకొనెను ఆమె వదలించుకొనుటకు ప్రయత్నించెను అతడు వదలలేదు ఎడమచేతితో జేబులో నుండి తీసి రెండు పది రూపాయల నోట్లామె చేతికందించెను ఆమె ఎడమచేతితో పుచ్చుకొనెను జోస్యు లొంటిగంటన్నర కింటికి వచ్చెను దొడ్డిలో రాజ్యలక్ష్మమ్మగారితో మాట్లాడు చున్న మంగమ్మతో ప్రెసిడెంటుగారికి ఫలహార మేమియు చేయవా? అనెను మంగమ్మ యిందాకటి గారె లున్నవి కదా' అనెను జోస్యులు కాఫీ కావలయును అనెను

జోస్యులు తనకు కాఫీ త్రాగు అలవాటు లేకపోయినను సుబ్బన్నపేట నుండి పొల్లన్ను కాఫీ డబ్బా ఒకటి తెచ్చి యింట ఉంచెను ఆ కాఫీ పొడ ప్రాతది కాఫీ జోస్యులకు బాగుండలేదు రామేశ్వరము బాగుండలేదని అనలేదు ఆ నాడు సాయం కాలము ప్రొద్దుక్రుంకి రామేశ్వరము సుబ్బన్నపేట వచ్చుచుండెను అతడు గణాచారి యింటి ముందుగా రావలసి ఉండెను గణాచారి వారి యింటికి వాకిట నిలుచున్నది రామేశ్వరమును దూరము నుండి చూచి ఆమెలోనికి పోయెను రామేశ్వరము వచ్చి వీది గుమ్మమున కెదురుగా నిలుచుండెను గణాచారి అతని ఊహలు చదివెను ఆమె లోనికి పోయి పసపు తెచ్చి వాకిటిలోనికి వచ్చెను రామేశ్వరము కదలలేదు రామేశ్వరము చూచుచుండగా పసపు చేతిలో పోసికొని గణాచారి నలిపెను పసపు రంగు పోయి దుమ్ము వలె అయ్యెను ఆ మన్ను రామేశ్వరము కన్నులలో దులిపెను అతడు కన్నులు మిరమిరలాడి తన దారిని తాపోయెను గణాచారి పోయి స్నానము చేసెను

ఆనాడు ప్రొద్దు క్రుంకెను. యుగయుగమ్ముల నుండి క్రుంకిన ఆ ప్రొద్దు తానేమి కుంకనట్లు? ప్రాతః కాలములో సాయంవేళ ఉన్నది ఉదయములో అస్తమయమున్నది అస్తమయములో ఉదయ మున్నది ఉద యాస్తమయములు రెండును ద్వంద్వము సుఖదుఃఖం వంటివే పుణ్యము పాపము ద్వంద్వము. ఆ అస్తమయమును తాత్కాలికమే. నిత్యమైనది కాదు అది శోచనీయము

రెండు వారములు గడచెను లెడ్‌బీటరు వద్ద నుండి ఉత్తరము వచ్చెను ఆయన సమాదిలోనికి వెళ్ళి ఆధ్యాత్మిక లోకమునంతయు వెదకి వెదకి చూచెనట అచ్చట శివరావు పాద అయినను కానరాలేదట దర్మారావు మరునాడు పాఠశాలకు పోగా దీనవదనుడై శివరావు లేఖ సంగతి ప్రస్తావించెను దర్మారావు మీకు మహానుభూతి కలుగుటయేమి? అతడెవడో కాదనుట ఏమి? మీ రవతరించితిరని మీకు విశ్వాసమున్నచో అవతారముగా ప్రకటించుకొని మహాకార్యములు చేయ వలెననదే అనెను శివరావు అట్లు కాదు అతడొప్పుకొన్నచో లోకము కూడ ఒప్పుకొనును ఇప్పుడు వ్యవహారము చెడిపోయినది అనెను

దర్మా లోకమనగా అయిదు ఖండముల యందున్న దివ్యజ్ఞాన సభవారని అర్థమా? లోకమునందు క్రైస్తవుల సంఖ్య ఎక్కువ వారొప్పు కొనినచో దేవుడగుటకు ఎక్కువ వీలున్నది తక్కిన వారెవ రొప్పుకొనియు లాభము లేదు

శివ అవును ఇతడు కాదన్నచో నేను కాకపోదునా? మీరన్నట్లు నాకింత అనుభూతి వృధాగా ఏల కలుగును?

అప్పటి నుండి శివరావు తన అవతారము పరిపక్వమగుటకు మార్గము లూహించ ఆరంబించెను ఒకనాడు శివరావిట్లు చెప్పెను ఇది పందొమ్మిది వందల యిరువది నాలుగవ సంవత్సరము ముప్పదినాల్గు నాటికి నేను సంపూర్ణావతారము అగుదును ఈలోపుగా సంస్కృతము లాటిను గ్రీకు ఫ్రెంచి బాషలు నేర్చుకొందును సర్వదేశ రాజకీయ వ్యవహారములు చదువుదును ఈలోపుగా తుపాకి నుపయోగించుట కత్తిసాము చేయుట మొదలైనవన్నియు నేర్చును ఈలోపుగనే నేనేదో మహారాజు ఆస్థానములో మంత్రిని కావలయును లేనిచో కొన్ని జరుగవలసిన ప్రయత్నములు జరుగవు అప్పటికి మనదేశమున స్వరాజ్యము వచ్చును బారతదేశ ప్రజాస్వామికమునకు నేను ప్రెసిడెంటు నగుదును నానారాజ్యసమితికి అదిపతి విల్సను కాదు శివరావు ముప్పది మూడు కోట్ల జనసంఖ్య కల బారతదేశమును చూచి లోకమెల్ల గడగడలాడి పోవును నేను మీతో చెప్పితిని కదా? నేను కార్యవాదినే కాదు ఖడ్గవాదిని కూడనని గాందిగారి వలె నేను హృదయ పరివర్తనము చేసి నానాజాతుల మధ్య మైత్రీ బావము కుదుర్చుటకు ప్రయత్నింతునని కాదు వలసినచో ఖడ్గము కూడ ఉపయోగించెదను శివరావు రెండు చేతులను పైకెత్తి మొగ మదియొక విదముగాపెట్టి అప్పుడు నేను తెల్లని గుర్రమెక్కి ఖడ్గము చేతిలో పట్టుకొని తిరుగుచుందును అదియే కల్క్యవతారము హుం అనెను దర్మారావున కేమనుటకును తోచలేదు అతడిది అంతయు బయలు పెట్టినా కళాశాల పాడైపోవును కళాశాలలో తామిద్దరును కలసి ఒక పక్షముగా ఉన్నారు ఇప్పుడు శివరావు కథ యిట్టిదని తెలిసినచో అతనిని శత్రువులు సమయ మగుట వలన కళాశాల నుండి పంపించి వేయుటకు ప్రయత్నించి కృతార్థులగుదురు శివరావు మతవిషయకోన్మాదము కళాశాలా వ్యవహారము లందు లేదు అందుచేత ఎవరికిని కలిగిన ఉపద్రవము లేదు దర్మారావునకు శివరావు మైత్రి పరిత్యజించదగినంత దోషము కనిపించలేదు దర్మారావు శివరావు చెప్పుమాటలు కావని



నిరాకరించి ఉండవచ్చును ఆ విషయమునందలి శివరావు తీవ్రత దర్మారావు అవిశ్వాసమును ప్రకటించినను వారిద్దరి చెలిమి బంగమగునేమో యన్నంతగా ఉన్నది దర్మారావు పరప్రయోజనార్థియై ఈ విషయమున శివరావును కాదనలేదు

నెలతిరుగక ముందే జోస్యులకు సుబ్బన్నపేటకు బదిలీ వచ్చెను ప్రెసిడెంటుగారి అనుగ్రహములో పడినవాడు అతనికేమి? మహారాజు అని యితరోపాధ్యాయులనిరి మరికొందరు గారెలతో పరమాన్నముతో పెట్టిన బోజన మూరకేపోవునా? అనిరి జోస్యులు సుబ్బన్నపేట వచ్చిన తరువాత రామేశ్వర మాతనికి రెండు ట్యూషనులు కుదిర్చెను రెండు చోట్ల రెండయిదులు పది రూపాయిలును జీతము పాతికయు ముప్పదియైదు రూకలాదాయము కనబడుచుండెను జోస్యుల సంసారము మునుపటి కన్న బాగుగా జరుగుచుండెను

ట్యూషనులలో ప్రొద్దున్న ఒకటి సాయంకాలమున ఒకటి జోస్యులు ప్రొద్దున మొదలు సాయంకాలము వరకు ఇంటి వద్దనే ఉండడు బోజనమునకు మాత్రము వచ్చును శనివారము ఆదివారము మాత్ర మింటి వద్ద ఉండుట ఒకనాడు మంగమ్మ చేతి కొక ఉంగరము కనిఎంచెను జోస్యులా ఉంగర మెచ్చటి దనెను ఆమె దొరికె ననెను అతదంతమంచి ఉంగరము పార వేసికొను వారెవరు? పైగా ఉంగరము క్రొత్తది వలె ఉన్నది అనెను కొంత తర్జుమా అయిన తరువాత ఆ ప్రస్తావన ఆగిపోయెను

మరొకనాడు మంగమ్మ వంట చేయుచున్నది జోస్యులు తన ఉత్తరీయ మొకటి కనిపించలేదని యిల్లంతయు వెదకెను నీ పెట్టిలో ఉన్నదా? అని మంగమ్మ నడిగెను ఆమె నా పెట్టిలోపల ఉండును? అన్నది ఒకవేళ పడినదేమో! తాళపుచెవి యిటుతే చూచెద నని అతడనగా ఆమె నా పెట్టిలో లేదు అని ఉద్వేగముతో అనెను నీ పెట్టిలో ఉన్న బంగార మేమియు నాకక్కరలేదులే నా ఉత్తరీయము మాత్రమే నాకు కావలయును అని జోస్యులు తాళపుచెవి కొరకు వెదకెను మంగమ్మ నిత్యమును తాళముచెవి తన కొంగుననే కట్టుకొనును ఆనాడు మాత్రము స్నానము చేయుచు కొంగు నుండి విప్పి గోడనున్న వంకెకు తగిలించెను ఆ నాడు శుక్రవారము జోస్యులకు బడి ఉన్నది అందుచే ఆమె అశ్రద్ధ వహించెను అతడు తొందరగా వచ్చి తొందరగా బోజనము చేసిపోవును పాఠశాల ఉన్న నాళ్ళలో ఎక్కువ శ్రద్ధగా ఉండుట అలవాటు లేదు

ఆమె వలదన్న కొలది జోస్యులు పెట్టి తీసి చూచెను పెట్టిలో నాలుగైదు మంచి చీరలు పట్టు జరీ చీర కొరనాటి చీరయు కనిపించెను అత్తరు సీసాలు అగరువత్తులు పెట్టి అంతయు పెళపెళగా ఉండెను ఒక చీర మడతలో నుండి ఏబది రూపాయలు జారి క్రింద పడెను జోస్యులి కర్థము కాలేదు మంగమ్మ పడమటి గుమ్మములో నిలుచుండి ఒడలిలో ప్రాణములు లేనట్లు శూన్యదృక్కులతో చూచుచుండెను జోస్యులు ఇవి అన్నియు ఎచ్చటివి? అనెను ఆమె నావే అనెను జోస్యులు నీవే సంపాదించితివా? అనెను ఆమె మాయమ్మ కొని పంపించినది అనెను జోస్యులు నా కెప్పుడును చెప్పినావు కాదు అనెను జోస్యులామె నవియన్నియు ఎచట నుండి వచ్చినవో చెప్పు మని నిర్బంధించెను ఆమె అదే సమాధానము చెప్పెను అతడామె ననేక దుర్భాషలాడి చివరకు కోపము పట్టలేక ఆమెను దండించెను ఆమె ఏడ్చుచుండెను జోస్యులానాడు బోజనము చేయకయే పాఠశాల కేగెను తక్కిన ఉపాధ్యాయులు అతని వాలకము చూచి యింటి వద్ద ఏదో రగడ జరిగినదని గ్రహించి తమలో తాము నవ్వుకొనిరి జోస్యులది కనిపెట్టెను వారందరు తన్ను జూచి అట్లు నవ్వుకొనుట ఎందులకో తెలియలేదు

(ఇంకా ఉంది)

## వేమన పద్యాలు




పలు తెఱంగుల పగ వెలయు చుండెడి చోట
చిటుకు మనక ప్రియము చెప్పవలయు
కాల్పదగిన కట్టె కణకతో మ్రోగదా
విశ్వదాభిరామ వినుర వేమ




## నయీదిశాయీ

ప్రొఫెసర్ విద్యార్థిని చావ కొడతాడు కుశల్ హాస్పిటల్‌లో ఉండి కూడా వార్డు బాయి చేత ఉంగరం అమ్మించి మత్తు మందులు తెప్పించుకుంటాడు

అది డాక్టర్ గ్రహించి వార్డు బాయిని చావకొడతాడు రాజు పోలీసు స్టేషనులో అమ్మే వాళ్ల చిరునామా ఇస్తాడు- ఏమిటో ఈ మత్తు మందుల గోల

ఈ సంవత్సరంలో మూడు నాటికలు వచ్చినయి



"నయీ దిశాయీ"లో ఒక దృశ్యం

## కిస్సా ఖాట్మండూమే

సత్యజిత్‌రాయ్ సమర్పిస్తున్న అపరాధ పరిశోధక నాటికా రాజం

డిటెక్టివ్ మిత్ర అసిస్టెంట్లు దొంగ సరుకు ఉన్న చోట్లో జొరబడి- చేతికందిన ఇనపదాంతో ఒకళ్లిద్దరిని కొట్టి పారిపోయి వస్తారు. కథ అలా ఉంచితే ఖాట్మండూలో గుళ్లూ గోపురాలే కాక సందులూ గొందులూ కూడా చూపిస్తున్నందుకు సత్యజిత్‌రాయ్‌ని అభినందించాలి- మొదటి రెండు నాటికల కన్నా ఇది బాగుంది. ఇందులో ఛేజ్ అపరాధ పరిశోధన ఉండి ప్రేక్షకుల్ని అలరిస్తున్నాయి.

## మనసు గుర్రం- లేదు కళ్లెం

నాటకానికి అనువాదం ధర్మవరపు సుబ్రహ్మణ్యం, డైరెక్షన్ దేవదాసు కనకాల.

ఒక నాటక రచయితగా ఉన్నా వాడు ఉద్యోగం నుంచి రిటైరవుతాడు. వీడ్కోలు సభలో ఇక సినిమా తీయమని ఒకాయన ఉపన్యసిస్తాడు. అది మనసులో పడుతుంది. అతను మంచివాడు. ఆపసులో పని స్ట్రిక్ట్‌గా తీసుకున్నాగాని లంచ్ టైమ్‌లో తన కేరియర్‌లోని పులిహార రోజూ అందరికీ పంచుతాడు. ఇన్నాళ్లకు ఒక మంచి నాటిక అనుకుంటున్నాను.

## తెనాలి రామకృష్ణ

కిందటి వారమే రామకృష్ణుడు సర్వే జనాస్సుఖినో భవంతు. అంటే అయిపోయిందనుకొన్నాను.

ఈ వారం రామకృష్ణుడి దూరపు చుట్టంగా బహ్మనీ సుల్తానుల గూఢచారి వచ్చి విషఫలం రాయిల వారికి కానుక పెడతాడు తాతాచార్యులని వెక్కిరించినందుకు రాయలు రామకృష్ణుడికి ఏనుగులతో తొక్కించి చంపే శిక్ష విధిస్తాడు. గూని చాకలిని అందులో దించి రాయలు విష ఫలం తినకుండా రక్షిస్తాడు. రాయల వ్యక్తిత్వం మాత్రం చాలా పేలవంగా ఉంటుంది. మొదటి నించీ అలాగే ఉంది.

## రామాయణ్

ఈ రోజు పన్నెండుకి ప్రారంభం అయింది రామాయణం టెన్నిస్ వలన. రామలక్ష్మణులు హనుమంతుడిని దర్శిస్తారు. సుగ్రీవ జాంబవంతుల సంభాషణ చాలా బాగుంది. హనుమ సంస్కృత భాష అంతకన్నా బాగుంది. శ్రీ అంజనేయుడు ప్రసన్నాంజనేయుడు హనుమంతుడికి లఘుమాగరిమా విద్యలొచ్చునని భగవాన్ హనుమచేత చెప్పించటం చాలా బాగుంది. అసలు బాగా లేనిది రామాయణంలో లేదు- రాముడు హనుమకి నమస్కారం చేయటం బాగుంది 300 రామాయణాలు చదివిన నాకే ఎంతో (హనుమ దారాసింగు)- బాగుంది అదంత మంచిదికాదు ఎవరిది తప్పు పేరెంట్సుదా? స్నేహితులదా? ఎవరిది తప్పు?

## ఉపగ్రహానికి గ్రహణం!

శనివారం నాడు కరెంటు పోయింది- న్యూస్‌లో పోయిన కరెంటు ఎప్పటికో వచ్చింది అంటే టి వి ఎనౌన్సరు భాషలో ఉపగ్రహానికి గ్రహణం పట్టింది

## బహదూర్‌షా జఫర్

అన్ని దార్లూ ఢిల్లీకే వెడతాయి గాని ఢిల్లీకి ఏ దారీ లేదు అనేది సామెత బేగం జీనత్ మహల్ కుట్ర జరుగుతోంది. బహదూర్‌షా వృద్ధుడయినాడు తరువాత చక్రవర్తి ఎవడు? ఎవరికి వారే అవుతారు మొగలాయీ దర్బారు తన కుట్రకు తనే బలయి ఇంగ్లీషు వాళ్ల చేతిలోకి పోయింది బహదూర్‌షా సమకాలీనుడైన మీర్జా అసదుల్లాఖాన్ గాలిబ్‌ని ఇంకా చూపించలేదు బి. ఆర్ చోప్రా- అది పెద్ద లోటుగా ఉంది అశోక్‌కుమార్ సరే బొజ్జా వేషం వేసి ఈ జరుగుతున్న మొగలాయీ దర్బారు ఆచారాలకి వాతావరణం కల్పించారు □




## శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి శత జయంతికి సన్నాహం -

ప్రామాణిక పరిశోధకులు విద్వాంసులు సత్కవులు, యోగి పుంగవులు అయిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సంస్కృతాంధ్ర భాషా సాహిత్యాలను, ఆంధ్రదేశ చరిత్రను, పురాతత్త్వ, శాసన శాస్త్రాలను సంపన్నం చేసిన మహనీయులు. వచ్చే ఫిబ్రవరి 7వ తేదీకి ఆయన జన్మించి నూరేండ్లు నిండుతాయి. ఆ సందర్భంగా శత జయంత్యుత్సవాన్ని జరపడానికి రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తులు శ్రీ కె. పున్నయ్యగారి అధ్యక్షతన ఏర్పడిన శత జయంత్యుత్సవ సమితి అక్టోబర్ 20వ తేదీన శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో సమావేశమై ఉత్సవ కార్యక్రమాన్ని రూపొందించి, ఉత్సవ నిర్వాహక సంఘాన్ని నియమించింది. ఈ సమావేశానికి శ్రీయుతులు వేటూరి ఆనందమూర్తి, అమరేశం రాజేశ్వరి శర్మ, కాసిరెడ్డి వెంకటరెడ్డి, కె. శివారెడ్డి, జి. విజయకుమార్, పోరంకి దక్షిణామూర్తి, అక్కిరాజు రమాపతిరావు, ఇరివెంటి కృష్ణమూర్తి, పాతూరు వెంకటేశ్వరరావు, వేటూరి సుందరరామమూర్తి, వేటూరి గురుప్రసాద్, అనంతాచార్యులు, నిత్యానందరావు, తిరుమల శ్రీనివాసాచార్యులు, చెన్నప్ప, తిరుమల రామచంద్ర హాజరయ్యారు. శత జయంత్యుత్సవాలు హైదరాబాద్‌లోను, తిరుపతిలోను జరపాలని, శాస్త్రిగారి కార్యక్షేత్రమైన తిరుపతిలో వారి శిలా విగ్రహాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం వారు సిద్ధం చేయించి ప్రతిష్ఠించాలని కోరాలని, శాస్త్రిగారి జన్మదినమైన ఫిబ్రవరి 7వ తేదీకి వారి స్మారక తపాలా బిళ్లను విడుదల చేయాలని కేంద్ర ప్రభుత్వాన్ని కోరాలని, హైదరాబాద్ పోస్టు గ్రాడ్యుయేట్ తెలుగు శాఖ వారు యు.జి.సి. సహాయంతో శాస్త్రిగారి భాషా సాహిత్య సేవలపై నిర్వహించే విద్వద్గోష్ఠితో ఉత్సవ సమితి సహకరించాలని, ఈ సదస్సుకు డాక్టర్ అమరేశం రాజేశ్వరశర్మ డైరెక్టరుగా ఉండాలని, ఉత్సవ సందర్భంగా విద్వాంసుల పరిశోధన వ్యాసాలతో సుమారు 300 పుటల స్మారక సంచికను ప్రకటించాలని, ఉత్సవ సందర్భంగా శాస్త్రిగారి సర్వతోముఖ కృషిని తెలియజేసే విధంగా ప్రత్యేకానుబంధాన్ని వెలువరించవలసిందిగా వివిధ పత్రికా సంపాదకులను కోరాలని, తిరుపతిలో జరిగే ఉత్సవాల బాధ్యతను తిరుమల తిరుపతి దేవస్థానం వారు స్వీకరించవలసిందిగా కోరాలని, శాస్త్రిగారి అముద్రిత పరిశోధనాంశాలను వేటూరి ప్రభాకర శాస్త్రి మెమోరియల్ ట్రస్టు వారు ప్రచురించాలని తీర్మానించారు. క్రింద పేర్కొన్న వారితో ఉత్సవ కార్య నిర్వాహక వర్గం ఏర్పడింది. అధ్యక్షులు-రామమూర్తి శ్రీ కె. పున్నయ్య ఉపాధ్యక్షులు-శ్రీయుతులు భాట్టం శ్రీరామమూర్తి, పాతూరి వేంకటేశ్వరరావు, కొత్తపల్లి వీరభద్రరావు, కోశాధికారి-శ్రీ మామిడిపూడి ఆనందం, కార్యదర్శులు-శ్రీయుతులు ఇరివెంటి కృష్ణమూర్తి, అమరేశం రాజేశ్వరశర్మ, వేటూరి ఆనంద మూర్తి, రవ్వ శ్రీహరి, అక్కిరాజు రమాపతిరావు, ఎం. ఎల్. నరసింహారావు, సంయుక్త కార్యదర్శులు- శ్రీయుతులు ఎం. చెన్నప్ప, ఎం. ఎస్. రామకృష్ణ, వి. వసంత కుమార్, ఎం. అనంతాచార్యులు.

## కూచిపూడి నృత్యానికి కుమారి అనూరాధ ఎన్నిక :-

ఆంధ్రప్రదేశ్, కర్నాటక, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ రాష్ట్రాల జానపద, గిరిజన కళలను ఇతర సంగీత నాటక లలిత కళా సాహిత్యాల అభివృద్ధి ప్రచారాల కోసం నాగపూర్‌లో నెలకొల్పబడిన దక్షిణమధ్య మండల సాంస్కృతిక కేంద్రాన్ని 1966 అక్టోబర్ 2వ తేదీన ప్రధానమంత్రి శ్రీ రాజీవ్‌గాంధీ ప్రారంభించారు ఈకేంద్రానికి నిర్వాహక సంఘం మహారాష్ట్ర గవర్నర్ అధ్యక్షుడుగా ఏర్పడింది ఈ సంఘ కార్యవర్గంలో కేంద్ర సాంస్కృతిక శాఖా మంత్రి పైన పేర్కొన్న నాలుగు రాష్ట్రాల సాంస్కృతిక శాఖామాత్యులు, కేంద్ర, రాష్ట్ర అకాడెమీల అధ్యక్షులు, కళా సాంస్కృతిక రంగాలలోని ప్రముఖులు సభ్యులుగా ఉన్నారు వీరితో సలహా సంఘాలు కూడ ఏర్పడ్డాయి. ఈ మండల కేంద్రం ఇది వరకు పెక్కు ఉత్సవాలు 1986లో న్యూఢిల్లీలో అపనా ఉత్సవ్, నాగపూర్‌లో నాట్య సమారోహ్, ఈ సంవత్సరం మొదట్లో భోపాల్‌లో గిరిజనోత్సవ్, ఈ సంవత్సరం ఫిబ్రవరిలో రంగోలీ ప్రదర్శనం, ఈ సంవత్సరం మార్చిలో విదర్భ మహిళా కళా, హస్త కళా ప్రదర్శనం, ఆ ఫిబ్రవరిలోనే నాగపూర్‌లో శాస్త్రీయ బాల నృత్య సమారోహ్, ఆ నెలలోనే జాతీయ సాంస్కృతిక మిజోరాం ఉత్సవం ఈ సంవత్సరం మార్చి, ఏప్రిల్‌లలో మద్రాస్ దీప్ మహోత్సవ్, ఈ సంవత్సరం మే నెలలో బాల కళా కార్య గోష్ఠి, ఈ సంవత్సరం జూన్, జులై నెలలో వివిధ కళా మహోత్సవ్, ఆ నెలలోనే కర్నాటకలో బాల నాట్య ప్రశిక్షణ శిబిరం, ఈ సంవత్సరం సెప్టెంబర్ నెలలో హైదరాబాద్, ధార్వాడ, షోలాపూర్ భోపాల్‌లలో యువ సంగీత నృత్య మహోత్సవ్, ఆ నెలలోనే నాగపూర్‌లో ఇన్‌టెన్సివ్ థియేటర్ వర్క్‌షాప్, ఆ నెలలోనే నాగపూర్‌లో భారతీయ చిత్ర

నాగపూర్‌లో అక్టోబర్ మొదటి వారంలో జరిగిన దక్షిణ మధ్య మండల సాంస్కృతిక కేంద్రం నిర్వహించిన యువ సంగీత నృత్య మహోత్సవం చివరి పోటీలో కూచిపూడి నృత్యానికి ఎన్నికైన నాట్య విశారద నాట్య కౌముది కుమారి జొన్నలగడ్డ అనూరాధకు యోగ్యతాపత్రం అందజేస్తున్న నాగపూర్ విశ్వవిద్యాలయం మాజీ వైస్ ఛాన్సలర్ డాక్టర్ పి. బి. కోల్టే.



## నిశ్శబ్దం

ఎడారిలో ఒయాసిస్
మామిడి చెట్టుపై కోయిల పలకరింపు
నిశ్శబ్దం.
కాంక్రీట్‌కి కారణ్యం వేసిన కాటుకు
ధ్వని కాలుష్యపు బల్లెం పోటుకు
ఒధన్వంతరి నిశ్శబ్దం.
చల్లని తల్లి ఒడి
పరవశించే పరమాత్మగుడి
పరిమళించే పుష్పాదినిశ్శబ్దం.
ప్రకృతి ఒడిలో
పగడాల గుడి
రతనాల మాలలో సౌందర్యపు పతకం
నిశ్శబ్దం.
నాగరికత వేసిన శిక్షకు
ఓరక్ష
మనిషి తెచ్చుకొన్న శాపానికి
ఓ విముక్తి నిశ్శబ్దం.
వినే చెవులుంటే
వినిపిస్తుంది సంగీతం
కనేకనులుంటే
చూపుతుంది వర్ణ చిత్రం నిశ్శబ్దం.

–కొడిమెల శ్రీరామమూర్తి

## హైదరాబాద్ నోట్‌బుక్

పట మహోత్సవ్ ఆ నెలలోనే నాగపూర్‌లో ఒక్క సంప్రదాయ కళా మహోత్సవ్ వివిద పట్టణాలలో స్వాతంత్ర్య దినోత్సవాన వివిద పట్టణాలలో బాల యువక చిత్ర కళా ప్రదర్శనం పోటీలు నిర్వహించింది డిసెంబర్ నెలలో వివిద కేంద్రాలలో నృత్యాది అరాదన శిబిరాలు నిర్వహించే కార్యక్రమంలో విజయవాడలో కూచిపూడి నృత్యారాదన మహోత్సవం నిర్వహిస్తుంది వివిధ శాఖలలో దార్వాడలో మొదటి మూడు స్థానాలలో వచ్చిన వారికి చివరి ప్రదర్శన పరీక్ష నాగపూర్‌లో అక్టోబర్ మొదటి వారంలో జరిగింది దీనిలో ఎన్నికయిన వారు వీరు సంగీతం శ్రీ చోటే రహమత్‌ఖాన్ సితార్, పంజిమ్ శ్రీయుతులు లలిత హరిప్రియ గాత్రం శ్రీ పార్థసారధి ముఖర్జీ తబలా

భిలాయ్‌నగర్ శ్రీ అవనీంద్రకువర్ షేవోలీకర్ సితార్ భిలాయ్ నగర్ శ్రీ ఎస్ యశస్వి వయొలిన్ బెంగళూరు నృత్యం కుమారి అంజలీ జయదేవ్ భరత నాట్యం బెంగుళూరు శ్రీ ఫణి దివాకర్ భరత నాట్యం హైదరాబాద్ కుమారి జొన్నలగడ్డ అనూరాద కూచిపూడి హైదరాబాద్ కుమారి జి అరుణ కూచిపూడి హైదరాబాద్ కుమారి రుక్మిణి హెంబల్ భరత నాట్యం బోపాల్ వీరికి కేంద్ర ప్రభుత్వం తత్సంబంద సంస్థలు నిర్వహించే సంగీత నృత్యోత్సవాలలో స్థానం వుంటుంది ఈ పోటీల అనంతరం జరిగిన యోగ్యతాపత్ర ప్రదానోత్సవానికి అద్యక్షత వహించిన నాగపూర్ విశ్వవిద్యాలయం మ జీ వైస్ చాన్సలర్ డాక్టర్ వి బి కోల్టే ప్రసంగిస్తూ ఐదు రోజుల పాటు జరిగిన పోటీ ప్రదర్శనలు ఉన్నత ప్రమాణాలతో ఉన్నవని ప్రశంసిస్తూ దక్షిణ మద్య మండలి సాంస్కృతిక కేంద్రం కృషిని హృదయపూర్వకంగా అబినందించారు పిదప పోటీలో నెగ్గినవారికందరికీ యోగ్యతా పత్రాలు బహుమతులు అందజేశారు

### ఉపశ్రుతి -

ఒక సమావేశంలో పలువురు ప్రొఫెసర్లు వచ్చారు పూర్వం బతకలేక బడిపంతులు అనే వారు ఇప్పుడు జీతాలు పెద్దగా ముడుతున్నాయి బడిపంతుళ్ల పనే బాగుంది అన్నాను పాఠాలు చెప్పినా చెప్పకపోయినా' అన్నారు ఒక ప్రొఫెసర్ పాఠాలు చెప్పని పంతుళ్లు అప్పుడూ ఉండే వారండీ అన్నాను కాని ఇప్పుడు పాఠాలు మాకు అక్కరలేదండీ అనే విద్యార్థులున్నారే ఏమంటారు మీరు? అని ఒక ప్రొఫెసర్ గద్దించి అడిగాడు

–తిరుమల రామచంద్ర

# డేవిస్ కప్ సెమీ ఫైనల్స్‌లో ఆస్ట్రేలియాపై ఇండియా విజయం

ఢిల్లీలో అక్టోబరు 2, 3, 4 తేదీలలో ఆస్ట్రేలియా, భారత్‌ల మధ్య జరిగిన డేవిస్‌కప్ సెమి ఫైనలు పోటీలలో రమేష్‌కృష్ణన్, విజయ్ అమృతరాజ్‌లు 'సింగిల్స్' పోటీలలో అఖండ విజయం సాధించి దశాబ్ద కాలము తర్వాత తిరిగి డేవిస్ కప్ ఫైనల్సులో ఇండియా ఆడే అవకాశము కల్పించారు. ఈ విజయం 'రిలయన్స్ కప్ ప్రపంచ క్రికెట్' పోటీల సమయంలో అనుకోని సంచలనం మన క్రీడా రంగములో సృష్టించినది. 75 కోట్ల భారతీయ జనాభాలో మేటి టిన్నీసు ఆటగాళ్ళు రమేష్‌కృష్ణన్, విజయ్ అమృతరాజ్. రమేష్ కృష్ణన్‌కి ప్రపంచ అగ్రగామి టిన్నీసు ఆటగాళ్ళుగా గుర్తింపు పొందిన వారిలో 28వ స్థానము కలదు. శ్రీనివాసన్ వాసుదేవన్‌కు 209వ స్థానము, విజయ్ అమృతరాజ్‌కు 257 స్థానములు ప్రస్తుతము కలవు. డబుల్స్ ఆటగాడు ఆనంద్ అముతరాజ్‌కు ...స్‌లో' స్థానము లభించలేదు.

ఈ ఏడు జూలై 26, 27, 28న ఢిల్లీలో జరిగిన ఇండియా- ఇస్రాయిల్ క్వార్టర్ ఫైనలు పోటీలో మన దేశం పాల్గొనుట గురించి తీవ్ర చర్చ జరిగినది. ఎన్నో వాదోపవాదాలు తర్వాత గట్టి బందోబస్తుతో పోటీ నిర్వహించబడినది. రాజకీయ కారణముల వలన ఇస్రాయిల్‌తో పోటీ మన భూభాగముపై అనుమతించరాదని కొందరు అంటే మరి కొందరు అసలు పోటీ నుండి మన దేశం విరమించాలి అని మరి కొందరు అభిప్రాయము వ్యక్త పరిచారు. ఆ రోజు పోటీలో మనము పాల్గొనకపోతే యీ రోజు మన ప్రతిభ ప్రపంచానికి తెలిసేది కాదు. ఇండియా- ఇస్రాయిల్ మధ్య జరిగిన పోటీలో మన దేశం సులభముగా విజయం సాధించింది. స్కోరు 4- 0. రమేష్‌కృష్ణన్ ష్లోమోగ్లిక్ స్టీన్‌పై 7-5, 6-1, 6-2 విజయ్ అమృతరాజ్ అమోస్ మన్స్‌డ్వర్ఫ్‌పై 6-4, 6-4, 7-5 ఆనంద్ విజయ్ జంట ష్లోమో, గ్లిలాద్ బ్లూమ్ జంటపై 6-2, 6-2, 7-5 రమేష్‌కృష్ణన్ అమోస్ మాన్స్‌డ్వర్ఫ్‌పై 10-8, 6-0 వాసుదేవన్ గ్లిన్‌స్టీన్‌పై 10-8 విజయాలు సాధించారు. కాని క్వార్టర్ ఫైనల్సు స్థాయి పోటీలో పాల్గొన్న క్రీడాకారులలో ఏ ఒక్కరూ ప్రపంచ స్థాయిలో 25లోపు స్థానము పొందిన వారు కాదు. అంతకు ముందు డేవీస్ కప్ పోటీ ఫలితాలు.

ఫస్ట్ రౌండ్ : పెరుగ్వే- యు.ఎస్.ఎ.పై 3-2, ఫ్రాన్స్- ద. కొరియాపై 5-0, స్వీడన్- ఇటలీపై 3-2, ఇస్రాయిల్ చెకస్లోవికియాపై 3-2, మెక్సికో- బ్రిటన్‌పై 5-0, స్పెయిన్- ప. జర్మనీపై 3-2, ఆస్ట్రేలియా- యుగస్లోవికియాపై 4-1, ఇండియా- అర్జంటీనాపై 3-2 స్కోరుతో గెల్చాయి.

క్వార్టర్ ఫైనల్సు ఫలితాలు : ఇండియా- ఇస్రాయిల్‌పై 4-0, స్వీడన్- ఫ్రాన్స్‌పై 4-1, ఆస్ట్రేలియా- మెక్సికోపై 4-1, స్పెయిన్- పెరుగ్వేపై 3-2 స్కోరుతో గెల్చాయి.



విజయ్ అమృతరాజ్, రమేష్ కృష్ణన్, ఆనంద్ అమృతరాజ్, ఎస్. వాసుదేవన్

## డేవిస్‌కప్ చరిత్ర

డేవిస్‌కప్ అంతర్జాతీయ లాన్ టిన్నీస్ ఛాలెంజ్ ట్రాఫీ 'టీమ్' పోటీ. డ్వియట్ ఎఫ్ డేవిస్ (1879-1945) అనే అమెరికన్ లాన్ టిన్నీసు ఆటగాడు, యు.ఎస్. టిన్నీసులో 1898, 1899లలో రన్నర్స్, వింబుల్డన్ 1901లో ఆల్‌కమర్స్ డబుల్స్ విజేత యీ కప్ బహూకరించారు. బోస్టన్‌కు చెందిన వెండి సామాను తయారు చేయు ప్రీవీ, క్రంప్ అండ్ కో అనే కంపెనీ 217 ఔన్సుల బరువు, 13 అంగుళముల ఎత్తు కలిగిన వెండి కప్పును రూపొందించారు. మొదటి పోటీ బోస్టన్‌లో లాంగ్ వుడ్ క్రికెట్ క్లబ్‌లో జరిగినప్పుడు యీ పోటీలు విశ్వ ఖ్యాతి పొందగలవని ఎవరూ ఆశించలేదు. 1901 పోటీలో బ్రిటన్ గెల్చినది. ఎ.డబ్ల్యు. గోర్, రోపర్ బారట్ యీ జట్టులో గలరు. మొదటలో ఆంగ్లో- అమెరికన్ పోటిగాయుండెడిది. 1905లో ఆస్ట్రేలియా, అంతకు ముందు ఫ్రాన్స్, బెల్జియంలు ప్రవేశించాయి. 1912లో జర్మనీ, కెనడా పాల్గొన్నవి. మొదటి ప్రపంచ యుద్ధము తర్వాత అనేక దేశాలు పాల్గొన్నవి. 1968నాటికి 47కు పెరిగినది. 1923 నుండి యీ పోటీలు యూరోపియన్, అమెరికన్ జోన్‌లు విభజించబడి జరిగినది. 1931లో యింకా జోన్‌ల సంఖ్య పెరిగినది. మొదటి ప్రపంచ యుద్ధము తర్వాత ఫ్రాన్స్ (1927-35) బ్రిటన్ (1933-36) వరకు ఆధిక్యత వహించాయి. అంతకు ముదు యు.ఎస్. (1920-26) విజేత. 1914లో తిరిగి 1939లో ఆస్ట్రేలియా గెల్చినది, 1950-67 మధ్య కాలము 18 ఏళ్ళలో 15సార్లు విజేత. 1968లో అమెరికా తిరిగి గెల్పు పొందినది.

1920లో మొదటి సారిగా మన దేశం డేవిస్‌కప్ పోటిలలో ప్రవేశించినది. పారిస్‌లో జరిగిన పోటీలో మన ఆట...ళ్ళు స్లీమ్, డిపన్ ఫ్రాన్స్‌ను 4-1 స్కోరుతో ఓడించినది. చికాగోలో జరిగిన పోటీలో జపాన్ చేతిలో ఓడిపోయినది. రామనాథ్‌కృష్ణన్, జయదీప్ ముఖర్జీ, ప్రేమజీత్‌లాల్ 1960లో ఇంటర్ జోనల్ ఫైనల్సులో బ్రెజిల్‌పై 3-2 విజయం పొంది ఛాలెంజ్ రౌండులో ప్రవేశించారు. 1962-68 మధ్య కాలములో నాలుగు సార్లు కృష్ణన్, ముఖర్జీ జంట ఇంటర్ జోనల్స్ ఫైనల్‌లో పాల్గొన్నది.




## అవీ – ఇవీ – అన్నీ

## గంగాధర్ ఆర్ట్ అకాడెమీ

కళలు మానవ జీవితానికి అర్థాన్ని – పరమార్థాన్ని ఇచ్చే దివ్య దీపకలైతే చిత్రకళ దానికి మనోహరతనీ – మనోజ్ఞతనీ ఆపాదిస్తుంది. అందులో ఆంధ్ర చిత్రకళా సంప్రదాయం ఒక స్వర్ణయుగం. పసిపిల్లలు మనస్సులను కేవలం చదువుల వత్తిడిలోనే కాక చిత్రకళా సంస్కారంతో తీర్చిదిద్ది వాళ్ల జీవితాలకు వికాసం కల్పించాలనీ, అన్ని వయసులవారూ చిత్రకళ అభ్యసించే అవకాశం కల్పించాలని సంకల్పించి రాతి యుగం నుండి రాకెట్ను యుగం వరకు రెండువేల బొమ్మలతో 18 మాసాలలో 18 పర్వాలుగా సర్వాంగ సుందరంగా తయారు చేయడం జరిగిందని ప్రముఖ చిత్రకారుడు గంగాదర్ ఆర్ట్ అకాడెమీ స్థాపకుడు అయిన శ్రీ గంగాదర్ తెలియజేస్తున్నారు.

చిత్ర కళ మీద ఆసక్తిగల విద్యార్థులకు ఆవిషయాలను శాస్త్రీయమైన పద్ధతిలో అందించి వారిలోని అంతశ్శక్తి బయల్పడేందుకు సహాకరించడమే గంగాదర్ ఆర్ట్ అకాడెమి ప్రదాన లక్ష్యమని ఆద్యేయ సాదనలో విద్యార్థుల శ్రద్ధాసక్తులే ప్రదాన పాత్ర వహిస్తాయని శ్రీ గంగాదర్ అన్నారు

అకాడమిలో నలుగురు విద్యార్థుల్ని చేర్పించే ఏ వ్యక్తి అయినా తనకు తెలిసిన ఒక బీద విద్యార్థి పేరు సూచించ వచ్చుని ఆ విద్యార్థికి ఈ సంస్థ ఉచితంగా శిక్షణ ఇస్తుందనీ అంటున్నారు

వివరములకు గంగాదర్ ఆర్ట్ అకాడెమి 88 రంగరాజపురంరోడ్డు మద్రాసు – 600024 చిరునామాకి రాసి తెలుసుకోవచ్చు

## అద్భుత ఫలప్రదాయకమైన శ్రీరామ రక్షాస్తోత్రం (కోటి ప్రతుల వితరణోద్యమం)

రాజమండ్రిలోని జయశ్రీ టాకీస్ రోడ్‌లో గల జ్ఞాన మహా యజ్ఞ కేంద్రంవారు ఆత్మ కళ్యాణంతో లోక కళ్యాణాన్ని కాంక్షిస్తూ గాయత్రీ రామాయణ శ్రీరామ మంత్ర మహాత్యం శ్రీరామ రక్షాయంత్ర ఫోటోతో తాత్పర్య సహితంగా అద్భుతఫల ప్రదాయకమైన శ్రీరామరక్షా స్తోత్రం యొక్క కోటి ప్రతుల ప్రచురణ వితరణోద్యమానికి దాతల సంపూర్ణ సహకారంతో పూనుకున్నారు ప్రథమ ప్రచురణగా 10 వేల ప్రతుల విడుదల చేసారు

ఒక రూపాయి పోస్టు బిళ్ళ పంపు వారికి రెండు ప్రతులు ఉచితంగా పంపగలమని ప్రకటిస్తున్నారు 50 ప్రతులు అంతకు మించి పంచి పెట్టుకోదలచిన వారు వివరాలకు ఈ క్రింది చిరునామాకు వ్రాసి తెలుసుకోవచ్చునని తెలియ చేస్తున్నారు

పురాణపండ రాదాకృష్ణమూర్తి ఎడిటర్ పరమార్థ వాణి రాజమండ్రి 4

## డేవిస్ కప్ సెమీ ఫైనల్స్

సెమీ ఫైనల్సులో ఇండియా ఆస్ట్రేలియాను 3 2 స్కోరుతో ఓడించినది స్వీడన్ స్పెయిన్‌పై గెలుపు

ఆస్ట్రేలియా రాజదాని సిడ్నీలో వైట్‌సిటీ టెన్నీసు క్రీడాంగణములో అక్టోబరు 2 3 4వ తేదీలలో ఇండియా ఆస్ట్రేలియాల మద్య సెమీ ఫైనలు పోటీ జరిగినది

మొదటి రోజు జరిగిన సింగిల్స్ పోటీలో రమేష్ కృష్ణన్ పిట్జ్ గెరాల్డ్‌ను నాలుగు సెట్లలో 6 1 6 2 3 6 8 6 స్కోరుతో ఓడించగా విజయ్ అమృతరాజ్ వాలీ మాసూర్‌ను 1 6 6 3 12 10 6-4 స్కోరుతో ఓడించాడు అమృతరాజ్ మాసూరు మద్య పోటీ 3 గం 25 నిమిషాలు దీర్ఘముగా జరిగినది ఆస్ట్రేలియా తన మేటి ఆటగాడు ఈ ఏడు వింబుల్డన్ విజేత పాట్ క్యాష్ లేకుండా పాల్గొన్నది క్యాష్ కుడి మోకాలు గాయము వలన ఆడలేదు ఇండియా జట్టుకు ఒక నాటి మన అగ్రగామి ఆటగాడు అక్తర్ అలీ కోచ్ ఆస్ట్రేలియా జట్టుకు ప్రపంచ అగ్రగామి ఆటగానిలో ఒకడు ఫ్రాజర్‌సారది మన ఆటగాళ్ళు రమేష్ కృష్ణకు 26 విజయ్‌కు 33 ఏళ్ళు మద్రాసువాసులు 5300 మంది అబిమానులు మండుటెండలో జరిగిన మొదటి రోజు పోటీ చూచి తృప్తి పొందారు మొదటి పోటీలో కృష్ణన్ ఒక గంటలో రెండు సెట్లలో విజయం పొందాడు ఎట్జ్‌గెరాల్డ్ సర్వీసును అయిదుసార్లు పడగొట్టాడు మూడవ సెట్టులో కృష్ణన్ సర్వీస్‌ను 3 9 గేములలో ఎడగొట్టి ఎట్జ్ గెరాల్డ్ 3 6 స్కోరుతో గెలుపు పొందాడు అతని పూర్వానుబవము యీ సెట్టు విజయానికి తోడ్పడినది నాలుగవ సెట్టులో ఎంతో ఆసక్తిగా జరిగిన పోటీలో కృష్ణన్ 8 6 స్కోరుతో సెట్టు మ్యాచ్ గెల్చాడు క్యాష్ స్థానములో యీ పోటీలో ఫిట్జ్ గెరాల్డ్ ఆడాడు

విజయ్ మాసూర్ మద్య జరిగిన రెండవ పోటీలో ఆస్ట్రేలియా ఆటగాడు తప్పక విజయం పొందగలడని ఆశించారు వయసులో అందరికన్నా పెద్ద అయిన విజయ్ ఎంతో కష్టపడి పట్టుదలతో ఆడాడు మొదటి సెట్టు మాసూర్ 6 1 స్కోరుతో గెల్చాడు ఆ తర్వాత మూడు సెట్లు వరుసగా విజయ్ గెల్చాడు

రెండవ రోజు డబుల్స్ పోటీ జరిగినది వింబుల్డన్ విజేత పాట్ క్యాష్ దూహన్‌తో పాల్గొన్నాడు ఇండియా జట్టులో ఆనంద్ అమృతరాజ్ వాసుదేవన్ ఆడారు ఆస్ట్రేలియా 6 3 6-4 6-4 స్కోరుతో 149 నిమిషాలలో మన జట్టును ఓడించినది క్యాష్ ప్రతిబ వాలీలు బేస్‌లైన్‌పై ఆడుట విజయానికి తోడ్పడినవి మూడవ రోజు పోటీలో రమేష్‌కృష్ణన్ అద్భుతముగా ఆడి మాసూరును 8 6 6-4 6-4 స్కోరుతో ఓడించాడు 125 నిమిషాలు జరిగిన యీ పోటీని 6 500 మంది తిలకి రెండవ పోటీలో ఎట్జ్‌గెరాల్డ్ అమృతరాజ్ 6 3 6 3 స్కోరుతో ఓడించాడు మొత్తముపై 3 2 స్కోరుతో విజం డేవిస్‌కప్ ఫైనల్సుకు చేరినది

ఆస్ట్రేలియాకు ఆ దేశ మాజీగమ... ఓడించ దేశములలో ఇండియా మూడవది యునైటెడ్‌స్టేట్ ఎడుసార్లు బ్రిటన్‌లు యిదివరకు గెల్పు పొందాయి రమేష్‌కృష్ణన్ యీ ఎడు యు ఎస్ ఓపెన్ టెన్నీసులో క్వార్టర్ ఫైనల్సుకు చేరాడు ఇండియా డేవిస్‌కప్ ఫైనలుకు చేరుట యిది మూడవసారి 1966లో మొదటిసారిగా చాలెంజ్ రౌండ్‌లో ప్రవేశించినది రమేష్ తండ్రి రామనాద్‌కృష్ణన్ బ్రెజిల్ ఆటగాడు థామస్ కోచ్‌పై గెలవటం వలన అప్పుడు అవకాశము లబించినది ఆస్ట్రేలియాచే 4 1 స్కోరుతో ఓడించబడినది 1974లో ఫైనల్సులో దక్షిణ ఆఫ్రికాతో ఆడుటకు యిష్టము లేక విరమించుకొన్నది ఆస్ట్రేలియా యీసారి విజయం పొందియుంటే డేవిస్‌కప్ ఫైనల్సులో 42వ సారి ఆడే అవకాశము అయిదు ఏళ్ళలో మూడవ విజయానికి అవకాశము యుండెడివి గత ఎడు మెల్బోర్న్‌లో జరిగిన ఫైనల్సులో ఆస్ట్రేలియా స్వీడన్‌ను ఓడించి విజేత అయినది

–ముకరమ్


Printed and Published for Nageswara Rao Estates Private Ltd by S Nageswara Rao at the Andhra Patrika Press Gandhinagar Vijayawada 520 003 Acting Editor M Madhava Rao, Chief Editor S Radhakrishna
Phones Business 61247, 61248, 75569 Editorial 75667